వయసులో వున్న ఆడపిల్లకి ప్రేమ, ఆకర్షణ రెండూ ఒక్కలాగే తియ్యగా అనిపిస్తాయి. కాని ఆకర్షణ క్షణికం-ప్రేమ శాశ్వతం.







(Telugu Monthly) October, 1977








ముఖచిత్రం : రండి ! రండి !
మన బొమ్మలు కొలువు దీరె రండి!

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య

సెప్టెంబరు సంచికలో పూర్తినవల

'వైదేహి' గారి

నేల ఒలికిన పాలు




ఈ నెల నవల అద్భుత రూపకల్పన రూపొందించి, మమ్మెంతో పరవశింప జేసిన రచయితగారికి మా అభివందనములు. 'అమూల్య' కథ వింత అనుభూతిని కలిగించింది. 'పొన్న' కథ బాగుంది. 'స్నేహమయి' సీరియల్‌కు మరి కొన్ని పేజీలు విటాయించగలరని మరొకసారి విన్నవించుచున్నాను. 'ప్రేమవాహిని' సీరియల్ రసవంతంగా సాగుతోంది.

—యం. ఏ. సలీమ్‌అక్తర్,
మంచిర్యాల.

మేలిమి బంగారువన్నె ఛాయతో తళతళ మెరుస్తూ వచ్చిన సెప్టెంబరు 'యువ' ముఖచిత్రం 'అవతారమూర్తి' అత్యంత ఆకర్షణీయంగా వుంది. వడ్డాది పాపయ్యగారికి మా కృతజ్ఞతలు అందజేయండి.

—

'స్నేహమయి', 'ప్రేమవాహిని' చాల ఇంటరెస్టుగా ఉంటున్నాయి. 'సూర్యుడి ఏడో గుర్రం' నవల బాగుంది. 'అజ్ఞాత బంధం', 'ది రింగ్' కథలు మాకు నచ్చాయి.

—న్యాయపతి రమేష్‌బాబు,
విజయకల్యాణి, విజయప్రియ, శ్రీలేఖ,
పుష్పలత, సంధ్యాకుమారి,
బరంపురం—, ఒరిస్సా.

విజయవిహారం చేస్తున్న

అత్యుత్తమ చారిత్రాత్మక చిత్రం



సెప్టెంబర్'యువ'ముఖచిత్రం చాలా అందంగా వుంది. రాజేశ్వరరావుగారి నవల ''సూర్యుని ఏడో గుర్రం''లో సంభాషణలు ఎంతో బాగున్నాయి. సీరియల్స్‌లో 'ప్రేమవాహిని' ఎంతో ఉత్సాహంగా సాగుతున్నది. నిత్య జీవితంతో హస్తాభినయములు మమ్మల్ని కడుపుబ్బ నవ్వించాయి. కథలలో 'తారతమ్యం కథ' ఈనాటి యువతులకు గుణపాఠం నేర్పేలా ఉన్నది.

—చంద్ర, ప్రభు, మధు,
నిజామాబాద్

సెప్టెంబర్'యువ' 'అవతారమూర్తి' ముఖచిత్రంతో ఎంతో ఆకర్షణీయముగా వెలువడింది. ముఖ్యంగా 'సూర్యుడి ఏడో గుర్రం' నవల మాకు నచ్చింది.

ఈమధ్య మీరు వైవిధ్యమున్న కథలు, నవలలు ప్రచురించుచున్నందుకు మా అభినందనలు. మీదు నిర్వహిస్తున్న క్విజ్ పోటీ వలన పాఠకులకే గాక, విద్యార్థులకు కూడా తెలియని 'ప్రపపంచజ్ఞానం' తెలియజేస్తోంది.

— ఎల్. పి. చంద్ర, పద్మప్రియ,
రఘునాథ్. రాము, సాయి, బుజ్జి,
బొమ్మిరెడ్డిపల్లి.

## చేసిన పరీక్షల వలన తెలిసింది...



# రుచికీ, విటమిన్లకూ, పుష్టికీ బిస్కట్ అంటేనే ఇది

## బ్రిటానియా గ్లూకోజ్-డి






అందుకే మరి ఏ ఇతర గ్లూకోజ్ బిస్కట్ కన్న బ్రిటానియా గ్లూకోజ్-డి అంటేనే ఎక్కువ మంది ఆకర్షితులవుతున్నారు

# సెప్టెంబరు నెల క్విజ్

## సమాధానాలు

1 — బి  2 — ఎ  3 — డి

4 — డి  5 — ఎ

6 కరాచి
7 970
8 తైవాన్
9 థామస్ స్టెఫెన్
10. ఢిల్లీ వెంకటకవి

సెప్టెంబరు నెల క్విజ్‌కు కిందివారు ఆల్ కరెక్టు సమాధానాలు పంపారు. ఒక్కొక్కరికి రూ. 58/- చొప్పున పంచడమైంది.

1. జి. మేరి, విశాఖపట్నం
2. ఎన్. పద్మావతి, ఏలూరు
3. ఎం. ఎస్. పి. రావు, నెల్లూరు
4. ఎం భాస్కరరావు, హైదరాబాదు.

---

# చందాదారులకు ఉచితం

# యువ

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు : చక్రపాణి

**సంపుటి 36** అక్టోబరు, 1977 **సంచిక 4**


ఈ మధ్య పత్రికలలో తరచూ 'హరిజనులపై అత్యాచారాలు' అనే వార్తలను చూస్తున్నాం; వాటిపై వ్యాఖ్యానాలను వింటున్నాం. మనదేశానికి స్వాతంత్ర్యం వచ్చి 30 సంవత్సరాలు గడిచినా, వ్యావసాయిక, పారిశ్రామిక, సామాజిక, సాంస్కృతిక, విద్యా, వాణిజ్య, వైజ్ఞానికరంగాలలో ఎంతో అభివృద్ధి సాధించినా, గాంధీ మహాత్ముని సిద్ధాంతాలను. ప్రవచనాలను జీర్ణించుకున్నా - సంఘంలో ఒకవర్గం వారిపై మరోవర్గంవారు దౌర్జన్యాలుచేయడం, ఒకవర్గంవారిని మరోవర్గం వారు అణగద్రొక్కడం, ఒక వర్గంవారిపై మరోవర్గంవారు నిరంకుశంగా ప్రవర్తించడం గమనిస్తే ఎంతో శోచనీయంగా కనబడుతుంది. ఈ విషయాన్ని ఎవరికి వారు ఆత్మవిమర్శ చేసుకొని ఆలోచించాల్సిన అగత్యముంది.

మనదేశంలో హరిజనుల సంఖ్య అతి తక్కువేంకాదు దేశంలో ఉన్న 60 కోట్ల జనాభాలో హరిజనులు దాదాపు 9 కోట్లమంది ఉన్నారు. అంటే 15 శాతమన్నమాట. గత రెండు నెలలుగా పత్రికల్లో వచ్చిన వార్తల్ని పరిశీలిస్తే హరిజనులను హత్యచేసిన, పట్టుకు కొట్టిన, వారి పంటలను, ఇళ్ళను తగులబెట్టిన, సందర్భాలు ఉన్నాయి. ఈ పరిస్థితి ఏ ఒక్క రాష్ట్రానికి పరిమితంకాదు. అన్ని రాష్ట్రాలలోనూ, చిన్నసైజులోనో, పెద్దసైజులోనో,

జరుగుతూన్నట్లు వార్తలు వెలువడుతున్నాయి. రాష్ట్రప్రభుత్వం ఏ పార్టీ వారిదైనా, హరిజనులపై అత్యాచారాలు జరుగుతూన్న ఉదాహరణలు కనబడుతున్నాయి.

గత 30 సంవత్సరాలలో హరిజనుల గౌరవాన్ని, ప్రాణాలకు, ఆస్తులకు కలిగే నష్టాన్ని కాపాడడంలో మామూలు శాంతి, భద్రతల యంత్రాంగం విఫలమైందని చెప్పవచ్చు. హరిజనులను హీనంగా చూడడం, వారి బలహీనతల ఆధారంగా దౌర్జన్యాలు జరపడం, వారికి అన్యాయాలు చేయడం మొదలైనవి ఎన్నో జరిగాయి. హరిజనులపై అత్యాచారాలు ఇదివరకు ప్రభుత్వ హయాంలో ఎక్కువ జరిగాయా, ఇప్పుడు ఎక్కువ జరుగుతున్నాయా అనేది కాదు ముఖ్యం. అట్లాంటి అత్యాచారాలు జరగకుండా చూడటమే అతిముఖ్యమైన, అత్యంత ప్రధానమైన కర్తవ్యం. ఈ కర్తవ్యం దేశంలోని రాష్ట్రప్రభుత్వాలపైనా, కేంద్రప్రభుత్వంపైనా ఖుమిక్కిలిగా ఉందని ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు.

హరిజనోద్ధరణకు, ఆర్థికంగా, సాంఘికంగా వెనుకబడినవారి అభ్యున్నతికీ పంచవర్ష ప్రణాళికలద్వారా కొనియాడదగిన కృషి జరిగినమాట వాస్తవమే. ఆర్థిక, సాంఘిక, సంక్షేమ పథకాలద్వారానైతేనేమి, ఉద్యోగాలు, ఉపాధికల్పనలద్వారానైతేనేమి, పరపతి సౌకర్యాలద్వారానైతేనేమి హరిజనుల ఆర్థికాభ్యుదయానికి చిత్తశుద్ధితో కూడుకున్న కృషి జరిగింది. అయితే అదంతా ప్రభుత్వం తరపున కృషి. మరైతే, ఇప్పుడు తక్షణం రావలసిన మార్పు ప్రజల మానసిక భావనలో. ఈనాటికీ కూడా హరిజనులను అంటరానివారిగా చూసే ప్రజలు కొన్ని గ్రామాలలో ఉండటంలో ఆశ్చర్యంలేదు. అంటే వారి మానసిక భావనలో మార్పు తేవడంలో ప్రభుత్వం విఫలమైందన్నమాట! ప్రజలలో వర్గరహిత, కుల రహిత భావవిప్లవానికి ప్రభుత్వం అవస్థాపన కల్పించాల్సిన అవసర మున్నప్పటికీ, మానసికమైన మార్పు, సర్వమానవ సౌభ్రాతృత్వం, సాటి మానవుణ్ని సమానస్థాయిలో గౌరవించి, ప్రేమించడం అనేవి ఎవరికి వారు ఏర్పర్చుకోవాల్సిన భావసముదాయం.

హరిజనులపైన దౌర్జన్యాలు, అత్యాచారాలు ఎక్కువగా గ్రామీణ ప్రాంతాలలో జరుగుతూండటం కద్దు. మనదేశానికి గ్రామాలు వెన్నెముక. ఆ గ్రామాలలో ఇట్లాంటి వర్గసంఘర్షణ కొనసాగడం దేశానికి, దేశ ఆర్థిక వ్యవస్థకు శ్రేయస్కరంకాదు.



సి.హెచ్. మధు



# అమ్మాయి నచ్చింది

అమ్మాయి నడిచి వచ్చి కూర్చుంది. పొడవైన జడ, పొడవైన ముక్కు, ఎర్రటి పెదవులు. సినిమా హీరోయిన్‌లా అందంగా వుంది.

"ఏం చదివింది?" ప్రశ్నించారు ఒకరు.

"ఎస్ ఎస్ సి."

"ఎన్నేళ్ళు?"

"పదారు."

"సంగీతం వచ్చా?"

"పాటలొచ్చు."

"ఏం పేరు?"

"విజయ."

'విజయ విజయ విజయ విజయ' నాల్గుసార్లు అనుకొన్నాడు యువకుడు. ఎంత అందంగా వుంది?—




మీకు అర్థమై దనుకుంటాను. అమ్మాయిని చూడటాని కొచ్చారని—

అమ్మాయి అబ్బాయిని చూచిండి. ఎర్రగా..... రింగుల వెంట్రుకలు..... అచ్చం సినిమా హీరోలా...

అమ్మాయికి అబ్బాయి నచ్చాడు అబ్బాయికి అమ్మాయి నచ్చింది. అబ్బాయి వాళ్లు బయట కెళ్ళారు. తల్లి అడిగింది. "ఏమిరా నచ్చిందా?"

"నచ్చింది."

లోపలి కొచ్చారు. "మాకునచ్చింది." అన్నారు.

'కట్నం' అడిగాడు ఒకాయన మధ్యస్తుడు.

అబ్బాయి తండ్రి అన్నాడు. "కట్నం మీ యిష్టం. మావాడు యిప్పటికే యాభై మంది అమ్మాయిలను చూసాడు, ఎవరూ నచ్చలేదు. అందరికీ వీడు నచ్చాడు. వీడు అందరినీ తిరస్కరిస్తూ వచ్చాడు. ఈమె నచ్చిందన్నాడు. మాకు సంతోషంగా వుంది. అదే చాలు. మీరు ఎంత ఇచ్చినా పర్వాలేదు."

ఈ మాటలు విన్న పెద్దలు సంతోషించారు.

ఈ మాటలు విన్న అమ్మాయి కొంతసేపు ఆలోచించింది. "యాభై మందిని తిరస్కరించాడా?" అనుకుంది.

గబుక్కున లేచి నిల్చుంది.

"నాకు అబ్బాయి నచ్చలేదు." లోపలికెళ్ళిపోయింది.

—:०:—

నవంబరు నెల యువ

# భావపరిచయ పోటీ

బహుమానం రూ. 25-00

**ఈ కార్టూనుకు హాస్యయుత వాక్య (Caption) కావాలి**



**గమనిక :** వ్యాఖ్యలు పోస్టుకార్డుమీదనే వ్రాయాలి. సెప్టెంబరు 28వ తేదీ లోపు మాకు చేరాలి.

అక్టోబరు నెల యువ భావపరిచయ పోటీ

బహుమతి పొందిన వ్యాఖ్య



తలిదండ్రుల తగువు

బిడ్డలకు బిగువు

— మొహోరీరు రామచంద్రరావు

కిసాన్‌నగర్



# 1

"నెక్స్ట్?"

ఆ మాట వినపడగానే స్ప్రింగ్‌డోర్స్ తోసుకుని లోపలికి వచ్చింది జూలి. మంచు బిందువులు అద్దిన గులాబీలా ఉన్న ఆమెని చూసి ఆశ్చర్య పోయాడు, డాక్టర్ చక్రపాణి- ఆంగ్లో ఇండియన్ గర్ల్. దానికితోడు బిగుతుగా ఉన్న గులాబిరంగు గౌనులో మెరుస్తోంది.

కుర్చీ కొంచెం వెనక్కు లాక్కుని కూర్చుంది జూలి.

"ఎక్స్‌క్యూజ్ మి డాక్టర్!" అంది, కర్చీఫ్‌తో ముఖం తుడుచుకుంటూ.

తెల్లబోయాడు చక్రపాణి.

"ఎందుకు ?" అన్నాడు ఆశ్చర్యంగా.

"నేను మీ దగ్గరకి పేషెంట్‌గా రాలేదు. మీ నుండి కొంచెం ఇన్ఫర్మేషన్ కావాలి !"

సంభాషణ ఆంగ్లంలో జరుగుతోంది.

"అడగండి, తెలిసినంతవరకు చెబుతాను" అన్నాడు

పర్స్ తెరిచి ఒక ఉత్తరం బయటికి తీసింది అది టేబుల్‌మీద పెడుతూంటే అతను అడిగాడు.

"ఇంతకూ మీరు..." ప్రశ్నార్థకంగా చూశాడు

"బెంగుళూరులో అజంతా ఇంపోర్ట్స్ అండ్ ఎక్స్‌పోర్ట్స్ కంపెనీ ఒకటి ఉందిలెండి. దాని ఓనరు రాజశేఖరంగారు ఆయనకి అదొక్కటే కాకుండా బెంగుళూరులో ఒక హోటల్, థియేటర్ ఉన్నాయి. ఆయన పెద్ద బిజినెస్ మాగ్నెట్. బొంబే, కలకత్తాలలో ఆయనకి చాలా కంపెనీలలో షేర్సు ఉన్నాయి నేను ఆయన సెక్రటరీని. చాలా ముఖ్యమైన పనిమీద యిక్కడకు రావలసి వచ్చింది."

"ఐసీ ! ఇంతకీ నానుండి మీకు కావలసిన ఇన్ఫర్మేషన్ ఏమిటి ?" తనతో వారికేం పనో అర్థంకావడంలేదు చక్రపాణికి.

జవాబుగా ఉత్తరాన్ని అతని వద్దకు తోసింది.

"దాన్ని చదవండి ! తర్వాత చెబుతాను," అంది కుర్చీలో వాలుతూ.

ఉత్తరంవైపు ఓ సారి పరీక్షగా చూశాడు చక్రపాణి. ఇన్లాండ్ కవర్ అది చాలా పాతదిగా ఉన్నట్లు, బాగా నలిగి ఉంది.

దాన్ని విప్పదీశాడు. అందులో ఇలా ఉంది.

వైజాగ్,
1–10–70.

లావణ్య గారికి,

నన్ను చక్రపాణి అంటారు. వైజాగ్‌లో మెడిసిన్ మూడవ సంవత్సరం చదువుతున్నాను! నేను మీకు ఈ ఉత్తరం వ్రాయడానికి ముఖ్యమైన కారణం ఏమిటంటే, మీరు జ్యోతీప్రసాదుకు చేసిన అవమానం గూర్చి విన్నాను. అతన్ని మీరు నడిరోడ్డులో చెప్పుతో కొట్టినట్లు తెలిసి సంతోషించినవారిలో నేను మొదటి వాణ్ణి. నాకు టైమ్‌లేదు కానీ, లేకుంటే స్వయంగా మీ వద్దకువచ్చి అభినందించి ఉండేవాణ్ణి. నేను ఎప్పుడైనా గుంటూరు వస్తే మిమ్మల్ని తప్పక కలుసుకుంటాను.

క్రింద మా యింటి అడ్రస్ ఇస్తున్నాను మాచెల్లెలి పేరు సుధ. దానికి విషయం మీరు వ్రాయండి. ఎంతో సంతోషిస్తుంది. ఎందుకంటే జ్యోతిప్రసాద్‌గాడు, అవమానం చేసిన అమ్మాయిల్లో అదికూడా ఒకటి. మర్చిపోకుండా వ్రాస్తారు కదూ!

భవదీయుడు
చక్రపాణి.

కోపమూ, సంభ్రమమూ, కుతూహలమూ ధ్వనిస్తున్న కంఠంతో అడిగాడు చక్రపాణి.

"ఇది మీ దగ్గరకు ఎలా వచ్చింది?"

"గుడ్! ఒక సందేహం తీరిపోయింది. అది మీరే వ్రాశారన్నమాట," జూలీ కళ్ళలో మెరుపు వచ్చింది.

"అవును! చెప్పండి. మీ దగ్గరికి ఎలా వచ్చింది?" ఆతృతగా అడిగాడు చక్రపాణి.

"లావణ్య ఇచ్చింది." క్లుప్తంగా చెప్పింది జూలి.

"ఆమె ఇప్పుడు ఎక్కడున్నారు?" ఆశ్చర్యంగా అడిగాడు.

"బెంగుళూరులో మా కంపెనీలోనే పనిచేస్తున్నారు. ఈ ఉత్తరం నేను తీసుకువచ్చింది జ్యోతిప్రసాద్‌కోసం. అతడి గురించిన వివరాలు మీరేమయినా చెబుతారేమోనని..."

కోపంతో జేవురించింది చక్రపాణి మొహం.

"వాడా? దొంగ రాస్కెల్! వాడసలు మనిషేనా? ఎప్పుడూ ఆడపిల్లల్ని వెంటబడి ఏడిపించడం తప్ప మరోటి తెలీని వెధవ! వాడు నాతోపాటు పి.యు.సి. చదువుతుండేవాడు. నేను ఉన్నానన్న యిద్దైనా లేకుండా వాడు నా చెల్లెలికి ప్రేమలేఖ వ్రాశాడు. వాణ్ణి చితకదన్నాను. డిబార్ చేయించేవాణ్ణే. వాళ్ళ నాన్న పలుకుబడివల్ల ఎలాగో తప్పించుకున్నాడు. మొత్తానికి తగిన శాస్తి చేయగలిగాను. కాని, మా చెల్లి భవిష్యత్తు పాడయింది. అది వట్టి పిరికిది. ఎస్సెల్సీ పాసయింది. కానీ ఆపై చదవలేకపోయింది. వచ్చిన సంబంధాలన్నీ ఆకాశరామన్న ఉత్తరాలు వ్రాసి వాడు చెడగొట్టాడు. చాలా కష్టంమీద దాని పెళ్ళి జరిగింది. అందుకే నాకు వాడంటే పరమ అసహ్యం. పి.యు సి తర్వాత నేను మెడిసిన్‌చదవటానికి వైజాగ్ వెళ్ళాను. గుంటూరులో ఉన్నప్పటికీ, మా అన్నయ్య వైజాగ్‌లో పనిచేస్తుండడంవల్ల అక్కడ చదివాను. అప్పుడే ఎవరో చెప్పారు

ఫైనల్ బియస్సీ చదువుతున్న ప్రసాద్‌గాడిని, లావణ్య అనే అమ్మాయి చెప్పుతో ఎంచి పది దెబ్బలు కొట్టిందని వాడికి ఆ దెబ్బతో పొగరంతా దిగిందని. మా చెల్లి అప్పుడు యింట్లోనే ఉంది. దాని ప్రోద్బలంమీదే ఆవిడకి ఉత్తరం వ్రాశాను." ఆగాడు చక్రపాణి.

"ఆవిడ మీకు బదులు ఉత్తరం వ్రాశారా ?" ఆతృతగా అడిగింది జూలి.

"లేదు !"

"పోనీ మీరు ఆమెని ఎప్పుడైనా చూశారా ?"

"ప్చ ! వీలుపడలేదు." పెదవి విరుస్తూ అన్నాడు.

నిరాశగా నిట్టూర్చింది జూలి.

"ఇంతవరకూ మీరు చెప్పినదానికి చాలా థాంక్స్ ! నాకు కావలసింది అంతా జ్యోతీప్రసాద్ ఇప్పుడు ఎక్కడున్నాడో తెలియాలి ! లావణ్య ఉత్తరంవల్ల మీ అడ్రెస్ తీసుకుని వైజాగ్ వెళ్ళి ఇక్కడకు వస్తున్నాను."

"ఏమో మరి ! ప్రసాద్ అతిప్రయత్నంమీద కట్టుకొని బియస్సీ పాసయ్యాడని విన్నాను. ఎక్కడున్నాడో, ఏం ఉద్యోగం చేస్తున్నాడో తెలియదు. లావణ్య చెప్పలేదా మీకు ప్రసాద్ ఎక్కడున్నాడో ?"

'ఆవిడ అసలు లావణ్య అయితే గదా, తెలియడానికి !' మనసులో అనుకుంది జూలి.

"లేదు ఆమెకి తెలియదట ! మీరేమయినా చెప్పగలరేమోననే మీ వద్దకు వచ్చాను." నిరాశ ధ్వనిస్తోంది.

"కొంచెం ఉండండి !" ఆలోచించసాగాడు చక్రపాణి.

ఆశగా చూడసాగింది జూలి చక్రపాణి వైపు.

"అచ్యుతం అని ఒకడున్నాడు లెండి. పి.యుసి.లో నా క్లాస్‌మేట్. వాడే అనుకుంటా, జ్యోతీప్రసాద్ లావణ్యచేత చెప్పుదెబ్బలు తిన్న సంగతి నాకు చెప్పింది. వాడు విజయవాడలో బిఎస్సీ చదివాడు. దాదాపు సంవత్సరం క్రింద హైదరాబాదులో కలిశాడు. బి.ఎస్సీ అవగానే వాడు రేంజ్ ఆఫీసర్ ట్రైనింగ్‌కి కోయంబత్తూరు వెళ్ళాడుట రెండు సంవత్సరాలు. ఇప్పుడెక్కడో పనిచేస్తున్నానని చెప్పాడు. ఉండండి ! డైరీలో చూసి చెబుతాను."

చక్రపాణి గబగబా టేబిల్ సొరుగు లాగాడు. అందులో కొంచెంసేపు వెదికి డైరీ బయటకు తీశాడు. రెండు క్షణాలపాటు పేపర్లు తిరగేసి, "ఆఁ, దొరికింది," అన్నాడు ఆనందంగా.

జూలీ వెంటనే తన పర్సు జిప్‌లాగి, చిన్న పుస్తకమూ, పెన్నూ బయటికి తీసింది.

''అడ్రెస్ క్లియర్‌గా లేదులెండి. ఆవేళ వాడితో మాట్లాడిన విషయమంతా డైరీలో వ్రాసుకున్నాను. గిద్దలూరు డివిజన్‌లో పనిచేస్తున్నాడని మాత్రము రాసుకున్నాను. వాడినడిగితే తప్పకుండా జ్యోతీప్రసాద్ వివరాలు తెలుస్తాయి.''

"చాలా చాలా థాంక్సండీ!" జూలీ లేచింది.

"ఒక్కమాట!" చక్రపాణి చప్పున అడిగాడు.

ఏమిటన్నట్లు చూసింది జూలి.

"మీకు జ్యోతీప్రసాద్ వివరాలు ఎందుకు?"

నవ్వింది జూలి.

"అది రహస్యం లెండి." బయటికి నడిచింది.

నిజంగా జ్యోతీప్రసాద్ వివరాలు తనకెందుకు?

## 2

గేటు తెరిచే ఉంది. కారును లోపలికి పోనిచ్చింది జూలి ఫారెస్ట్ ఆఫీసు లోపల లైట్లు వెలుగుతున్నాయి, బయట వాచ్‌మన్ కాబోలు ఉన్నాడు. ఆశ్చర్యంగా చూస్తున్నాడు కారువైపు. అతన్ని పిలిచి అడిగింది జూలి.

"డి.ఎఫ్.ఓ. గారు ఆఫీసులో ఉన్నారా?

"లేరండీ! ఇప్పుడే బంగళాలోకి వెళ్ళారు."

"ఏది బంగ్లా!" అడిగింది జూలి.

"అదేనండీ!" వాడు చూపించాడు,

ప్రక్కగా పెద్ద బావి ఉంది, రాత్రి అయినప్పటికీ ఎవరో చేదుకుంటు న్నారు నీళ్ళు. గిలకల చప్పుడు వినిపిస్తోంది గట్టిగా. దాని ప్రక్కనే బంగళా ప్రహరీగోడ కనిపిస్తోంది. కారును మెల్లగా పోనిచ్చి, బంగళా ముందు ఆపింది. జూలి.

కారు తలుపువేసి తలుపుతోసి లోపలికి వచ్చింది. బయటఎవరూ లేరు. చుట్టూ చూసుకుంటూ వరండాలోకి వచ్చింది. వరండాలో కుర్చీలూ, ఈజీచైర్‌లూ ఉన్నాయి మనుషులు ఎవరూ లేరు. ఎవర్ని పిలవాలో తెలియలేదు జూలీకి. స్తంభం అడ్డున్నందున కొంచెం ముందుకు వచ్చింది జూలి. అప్పుడు కనిపించిందో అమ్మాయి మూలగా ఉన్న ఈజీచైర్‌లో కూర్చుని.

ప్యాడ్ ఒకటి అడ్డంగా వేసుకుని, ఏకదీక్షగా తెల్లకాగితాలమీద తెగ రాసే

స్తోంది ఆ అమ్మాయి. రచయిత్రి కాబోలు, అనుకుంది జూలి. రెండుసార్లు పిలిచింది ఆ అమ్మాయిని. పలకలేదు. లోపలినుంచి ఓ ఆడకంఠం వినిపించింది.

"అమ్మలూ ! ఎవరో పిలుస్తున్నారు, చూడు ?" అని.

ఆ కేకకి ఆ అమ్మాయి ఉలిక్కిపడి తలెత్తింది.

ఎదురుగా జూలీని చూసి కంగారుపడుతూ లేచింది.

"ఎవరు కావాలండీ ?" అని అడిగింది తడబాటుగా.

డి.ఎఫ్.ఓ. గారు," అంది జూలి.

"పిలుస్తాను కూర్చోండి." అని చెప్పి లేడిలా చెంగున లోపలికెళ్ళింది,

జూలీ అక్కడే ఉన్న ఓ కుర్చీలో కూర్చుంది. టేబుల్‌మీద పేపర్ ఉంటే లాక్కుని చూడసాగింది, రెండు నిముషాలకు ఆయనెవరో వచ్చారు లోపలి నుండి ఆయనే డి.ఎఫ్.ఓ. అనుకుని లేచింది జూలి.

"గుడీవెనింగ్ సర్ ! సారీ ఫర్ ది డిస్టర్బెన్స్ !" అంది.

"నెవర్ మైండ్ ! వాట్ కెన్నై డూ ఫర్ యూ ?" అన్నారు సౌమ్యంగా.

"అచ్యుతం గారని మీ డివిజన్‌లో, రేంజ్ ఆఫీసర్ ఎవరేనా ఉన్నారా సర్ ?"

"ఆఁ, ఉన్నారు. ఇక్కడకాదు, నాలుగు మైళ్ళదూరం వెళ్ళాలి !" అని ఆయన ఏదో పల్లెటూరి పేరు చెప్పారు. అది నోరే తిరగలేదు జూలీకి.

"మీరు ఏమీ అనుకోకుంటే ఎవరయినా ప్యూన్‌ని పంపండి సర్ రూట్ చూపడానికి !" అంది.

"అలాగే ! దానికేముంది ? ఐదు నిముషాలు ఆగండి," అని ఆయన బయటకు వెళ్ళి వాచ్‌మన్‌ను పిలిచారు.

మరో నిముషానికి, లోనికొచ్చి అన్నారు జూలీతో.

"రమ్మని చెప్పాను. వస్తున్నాడులెండి ప్యూన్ మీ వెంట," అని అంటుండగానే ఆ ప్యూన్ ఎవరో లోపలికొచ్చాడు.

అతనికి చెప్పారు, రూట్ చూపమని డి. ఎఫ్. ఓ. గారు. అతను 'అలాగే సర్' అని తలూపుతుండగా లేచింది జూలి.

కారు స్టార్ట్‌చేస్తూ వాచీ చూసుకుంది జూలి. తొమ్మిది కావస్తోంది. ఇక ఈ వేళ భోజనం చేసినట్లే అనుకుంది మనసులో.

అరగంటకల్లా ఆ పల్లెటూరుచేరి, రేంజ్ బంగళా చేరగలిగింది జూలి. వెంబడి వచ్చిన ప్యూన్ లోపలికి వెళ్ళి చెప్పాడు. రమ్మంటున్నారని పిలుపు వచ్చాక వెళ్ళింది జూలి.

తనను చూసి ఆ అచ్యుతం అనబడే వ్యక్తి ఆశ్చర్యపోతూంటే నవ్వొస్తుంది జూలీకి. నిజమే మరి! రాత్రివేళ అపరిచితురాలైన ఆడపిల్ల గుమ్మం ముందు నిలబడితే, ఆశ్చర్యం కాక మరేం వేస్తుంది?

అచ్యుతంతో ఎక్కువ సంభాషణ జరపలేదు జూలి. అతను కూడా లావణ్యని చూడలేదని చెప్పాక, చక్రపాణి వద్దనుండి వచ్చానంటీ జ్యోతీప్రసాద్ వివరాలు కావాలని అడిగింది.

అతన్ని లావణ్య అనబడే అమ్మాయి చెప్పుతో కొట్టిందని వినడమే కానీ నేను చూడలేదండి. అహఁ. అలా అని అతన్ని కొట్టలేదనలేను. ఖచ్చితంగా చూసినవారు నాతో చెప్పారు. కానీ తర్వాత వాడు ఆ అమ్మాయిపై పగబట్టి ఆ అమ్మాయికి పెళ్ళిగాకుండా చేశాడని విన్నాను. నేను లావణ్యని మటుకు చూడడం తటస్థించలేదు."

"ఇంతకీ జ్యోతీప్రసాద్ ఎక్కడున్నారంటారు."

"వాడికి గవర్నమెంటు జాబ్ రాలేదండి. ఏదో ప్రయివేటు కంపెనీలో పని చేస్తున్నాడని విన్నాను. అంతే! వాళ్ళ అక్క అనంతపూర్ ఉమెన్స్ కాలేజీలో తెలుగు లెక్చరర్. ఆవిడని వెళ్ళి కలుసుకోండి. వాడు ఎక్కడున్నాడో తప్పకుండా వాడి అడ్రెస్ తెలిసిఉంటుంది."

* * *

జూలీ, జ్యోతిప్రసాద్ అక్క రాజ్యలక్ష్మిని పట్టుకోగలిగిందే కానీ, ఆవిడ చేత అతని అడ్రెస్ త్వరగా చెప్పించలేకపోయింది. ఆవిడకి అసహనం, కోపం, చిరాకు ఎక్కువ కాబోలు! విజిటింగ్ రూమ్‌లోకి వస్తూనే. "ఎవరండీ మీరు? ఏమిటి మీకు నాతో పని?" అంది విసుగ్గా.

జూలీ మొదట తెల్లబోయింది. ఆవిడ మాటాడే తీరుచూసి కొంచెం కోపం కూడా వచ్చింది. అయినా నిగ్రహించుకొంది. అవసరం తనది కనుక.

"జ్యోతీప్రసాద్ మీ తమ్ముడేనా అండీ?" నిదానంగా అడిగింది.

"ఆఁ, అవును. మీరు వాడికోసం వచ్చారంటే మటుకు లాభంలేదు. వాడు యిక్కడలేడు." వెళ్ళబోయింది.

"ఏమండీ. ఏమండీ!" పిలిచింది జూలీ.

ఆవిడ వెనక్కు తిరిగి వచ్చింది.

"ఏమిటి చెప్పండి?" ఈసారి ఆవిడ స్వరంలో విసుగూ, చిరాకూ స్పష్టంగా వినిపిస్తున్నాయి.

"అలా తొందరపడితే ఎలా చెప్పండి ? నాకు మీ తమ్ముడి అడ్రెస్ కావాలి. దయచేసి చెప్పగలరా ?" అనునయంగా అడిగింది.

"వాడి అడ్రెస్ ఎందుకు మీకు ?" ఆవిడ అనుమానంగా అడిగింది.

"కొంచెం పనుంది లెండి ?" పర్స్ తెరుస్తూ అంది జూలి.

జూలీని చూస్తుంటే ఆవిడ ఉద్దేశం మరో రకంగా మారింది.

"లక్షణంగా పెళ్ళిచేసుకున్నాడు. ఇద్దరు పిల్లలు, అయినా వాడికివేం బుద్ధులు ! వాణ్ణని ఏం ప్రయోజనం ? ఆడవాళ్ళిలా బరితెగించి పోతుంటే ?" ఆవిడ మెల్లగా గొణగసాగింది.

జూలీకి కోపం వచ్చింది.

"ఏమిటండీ మీరు మాట్లాడేది ? ఆడపిల్లచేత చెప్పుదెబ్బలు తిన్న మీ తమ్ముడి కోసం నేను వెంటబడి వచ్చాననుకున్నారా ? అతను బెంగుళూరులో మా కంపెనీలో పనిచేస్తూ, ఓ ఫైల్ పోగొట్టేశాడు. తర్వాత రిజైనిచ్చి వెళ్ళిపోయాడు. ఆ ఫైల్ కోసం వెదుకుతూ తిరుగుతున్నాను," అంది.

వెలవెలా బోయింది రాజ్యలక్ష్మి మొహం. తాను వేసిన మంత్రం పారినందుకు సంతోషించింది జూలి

"చెప్పండి మీ తమ్ముడి అడ్రెస్" అంది, కంఠాన్ని కరుగ్గా మార్చి. ఆవిడ సంబాళించుకుని చెప్పింది.

"సంవత్సరం క్రిందట నాకో ఉత్తరం వ్రాశాడండి రెండొందలు పంపమని. నేను పంపలేదు. అప్పట్నుంచి బదులే లేదు అయినా ఆ అడ్రెస్ ఏం పనికొస్తుంది. మీకు ? మీ కంపెనీలో యిటీవలే చేశాడంటున్నారుగా !"

"ఎక్కడినుంచి వ్రాశాడు మీకు ఉత్తరం ?" ఆతృతగా అడిగింది.

"బొంబాయి నుంచి."

"అడ్రెస్ చెప్పండి." పర్స్‌లో నుంచి పేపరూ, పెన్నూ తీస్తూ అడిగింది.

"నా కెక్కడ గుర్తుంది ? ఆ ఉత్తరంలో యిచ్చాడంతే ! ఉత్తరం ఉందో పోయిందో ? అయినా ఆ అడ్రెసేం చేసుకుంటారు మీరు ?"

చెప్పకూడదని ఆవిడ ఉద్దేశం.

చెప్పించాలని జూలీ తాపత్రయం.

ఎలాగైతేనేం, ఆవిడ యింటికి వెళ్ళి, ఆవిడచేత వెదికించి మొత్తానికి బొంబాయిలో జ్యోతిప్రసాద్ అడ్రెస్ సంపాదించగలిగింది జూలి. సంవత్సరం క్రిందటి అడ్రెస్, అతనక్కడ ఉన్నాడో లేదో ; నిట్టూర్చింది జూలి.

* * *



## 3

చేతిలోని కాగితంమీద ఉన్న అడ్రెస్‌లోని ఇంటినెంబర్, ఎదురుగా మూయబడిన తలుపుమీద ఉన్న నెంబర్‌ని మార్చి, మార్చి చూసింది జూలి. రెండూ ఒకటే! ఆ కాగితాన్ని పర్స్‌లో పడేసి తలుపు తట్టింది.

టక్, టక్.

ఎవరూ తీసిన శబ్దం రాలేదు.

ఈసారి కొంచెం గట్టిగా బాదింది.

"ఎవరది ?" కోమలమైన స్వరం వినిపించింది.

జవాబుగా మరోసారి బాదింది జూలి.

ఈసారి ఎవరో గబగబా వచ్చి తలుపు తెరచిన చప్పుడు.

జూలీ తలుపు తోసింది.

ఎదురుగా అప్సరసలాంటి అమ్మాయి. పాతికేళ్ళుండవచ్చు. అందమంతా కుప్పపోసినట్లుగా నిలుచుని ఉంది. పల్చగా, పాలమీగడల్లాంటి బుగ్గల్ని నిమరా లనిపించిందది జూలీకి. గులాబిరంగులో తడితో మెరుస్తున్న పెదవుల్ని చూపుడు వేలితో రాయాలనిపించింది. ఉంగరాలజుత్తు. ముందుకు పడుతున్న ముంగురు లను తోసుకుంటూ అంది.

"ఎవరు కావాలండీ?"

చప్పున ఈ లోకంలోకి వచ్చింది జూలి. జవాబు చెప్పకుండా లోపలికి అడుగుపెట్టింది. తను వేసుకున్న ప్లానుప్రకారం తెలివిగా చెప్పింది, యిలా. "నేను ఉద్యోగం చేస్తున్న అవివాహితలపై రీసర్చి చేస్తున్నాను. ఎవరో చెప్పారు, ఈ యింట్లో ఉద్యోగం చేస్తున్నవారు ఉన్నారని, మీరేనాండీ?" అమాయకంగా అడిగింది.

"నేను కాదండీ! మా అక్కయ్య. యిక్కడ పనిచేయడంలేదు. బెంగు ళూర్లో చేస్తుంద."

''అయ్యో! ఇక్కడే ఉన్నారనుకున్నానే? ఎలామరి...మీ కభ్యంతరం లేకపోతే మిమ్మల్ని కొన్ని ప్రశ్నలు వేస్తాను, జవాబు చెప్తారా?"

కొంచెం తటపటాయించి ఆ అమ్మాయి "అలాగే," అంది.

"కూర్చోండి!"

ఆ గదిని పరీక్షగా చూసింది జూలి. చిన్న గది అది. కిటికీకి దగ్గరగా టేబిల్, కుర్చీ ఉన్నాయి. ఒక ఈజీఛైర్ వెనగ్గా వాల్చబడి ఉంది. లోపలి దృశ్యం కనబడకుండా గుమ్మానికి పరదా వ్రేలాడుతోంది

"మీరూ కూర్చోండి!" ఈజీఛైర్‌లో కూర్చుంటూ అంది.

ఆ అమ్మాయి టేబిల్ దగ్గరగా ఉన్న కుర్చీ జూలీకి అభిముఖంగా వేసుకుని కూర్చుంది.

"ఇప్పుడు చెప్పండి!"పర్స్‌లోని చిన్న నోట్‌బుక్కూ, పెన్నూ తీస్తూ అంది.

"మీ పేరు?"

"అమృత!" వెంటనే జవాబు వచ్చింది.

"మీ అక్కయ్య పేరు?"

"లావణ్య!"

"ఇన్షియల్..." అడిగిం తర్వాత నాలుకొక్కరుక్కుంది జూలి.

"ఎస్," అంది అమృత.

"బెంగుళూరులో కదూ మీ అక్కయ్య పనిచేస్తున్నదన్నారు?"

"అవును!"

"ఏం ఉద్యోగం?"

"స్టెనో!"

"ఏ ఆఫీస్‌లో?"

"ఆఫీస్ కాదు! ప్రయివేటు కంపెనీ అది."

"ఏ కంపెనీ?"

చెప్పింది అమృత.

సందేహంలేదు. తమ కంపెనీయే అది. మరయితే పొరపాటు ఎక్కడ జరిగింది? జాన్ పొరబడ్డారేమో!

"మీ ఇంట్లో యింకా ఎంతమంది సభ్యులు ఉన్నారు?"

"అమ్మ, వదిన, వదినపిల్ల లిద్దరు."

"అన్నయ్య ఏమయ్యాడు?" తల ఎత్తుతూ అడిగింది జూలి.

"ఆక్సిడెంట్‌లో పోయాడు. ఆర్నెల్లవుతోంది."

"సారీ!" అంది జూలి.

అవతలనుంచి జవాబురాలేదు.

"మీ అక్కయ్య ఏం చదివింది?"

"బి.యస్‌సి."

"ఏ కాలేజీలో?"

చెప్పింది అమృత. సందేహంలేదు! సర్టిఫికెట్స్‌లో ఉన్నదే?

"మీరు ఏం చదివారు?"

దానికా అమ్మాయి తలవంచుకొని జవాబు చెప్పింది.

"టెన్త్‌క్లాస్ మూడుసార్లు ఫెయిలయ్యాను. ఇక చదవలేక మానేశాను."

'అయ్యో! ఇంత అందమైన అమ్మాయికి చదువు లేదా,' అనుకుంది జూలి. లావణ్యకూడా అందమైనదే కానీ సాధారణమైన అందమది.

"మీరు బెంగుళూరే వెళ్ళొచ్చుగదా? యిక్కడ ఎందుకున్నారు?"

"అక్కయ్యది తిరిగే ఉద్యోగమట! వాళ్ళ మేనేజర్ వెంబడి ఎప్పుడూ మద్రాస్, బొంబాయి వెళుతూ ఉండాలిట! పైగా దానికొచ్చే ఆరువందల్లో సిటీలో మేమంతా ఎలాబ్రతుకుతాం? అన్నయ్య పిల్లలిద్దరికీ చదువులు పాడవుతాయి. అందుకని యిక్కడే ఉంటున్నాం."

ఇక ఏమడుగుదామా అని ఆలోచిస్తోంది జూలి.

"కొంచెం మంచినీళ్ళు తెచ్చిపెట్టగలవా?" హఠాత్తుగా అడిగింది.

అమృత తలవూపి లోపలికెళ్ళింది. ఒక్క ఉదుటున లేచి గోడదగ్గరికి వచ్చింది జూలి. రెండు ఫొటోలు ఉన్నాయి అక్కడ. ఒకదాంట్లో అమృత అన్నా, వదినా కాబోలు ఉన్నారు. రెండవదాంట్లో లావణ్య ఉంది సందేహం లేదు, లావణ్యే!

నిరాశగా వెళ్ళి ఈజీఛైర్లో కూలబడింది జూలి.

అమృత మంచినీళ్ళు తెస్తే గడగడా తాగింది. గ్లాసు చేతికిస్తూ అంది, "చాలా థ్యాంక్స్ అమృతా! అయినా నిన్నడిగితే ఏంలాభం? ఉద్యోగంచేసే ఆడవాళ్ళ మన స్తత్వాలు తెలుసుకోవాలంటే మీ అక్కయ్యనే అడగాలి! వస్తాను యిక!

ఈజీఛైర్లో ఉన్న పర్స్‌ను వంగి తీసుకుంది. సన్నగా లోపలినుండి ఏడుపు వినిపించింది.

"ఎవరది?" ఆశ్చర్యంగా అడిగింది,

"మా వదిన!" అమృత మొహం సీరియస్‌గా మారింది

పాపం! మనసులో జాలిపడింది జూలి.

సందు మలుపువరకూ చిన్నగా నడిచివెళ్ళిన జూలీ, హఠాత్తుగా వెనుతిరిగి చూసింది. అమృత గుమ్మంలో నిలబడి చూస్తోంది. చేయివూపింది జూలి.సందు మలుపు తిరగానే, ఎదురుగా చెట్టుక్రింద పార్క్‌చేయబడిన కారు నవ్వుతూ పలకరించింది.

## 4

"గుడీవెనింగ్ మేడమ్!" మేనేజర్‌రావ్ వస్తూ అన్నాడు.

విసుగ్గాచూచింది జూలి.

"మళ్ళీ ఎవరొచ్చారు? రాత్రి పదిగంటలవరకూ నేను రానని చెప్పు!" కోపంగాఅంది.

క్రితం రాత్రి బొంబాయికి వచ్చింది జూలి. ఆమె వచ్చినప్పటినుంచీ జ్యోతీ ప్రసాద్ పనిచేసిన కంపెనీకి వెళదామంటే కుదరడమేలేదు. నాలుగురోజులు ఆమె లేకపోయేసరికి, మేనేజర్ రావ్ ఆమెకోసం బొంబాయిలో ఎదురుచూ స్తు న్నాడు ఫైల్సు పట్టుకొని. అవన్నీచూసి బాస్‌కి కావలసినవి పంపించి, సాయంత్రం నాలుగ్గంటలకికానీ బయటపడలేదు. తమ బట్టలమిల్లుకి వెళ్ళి






అక్కడ పనిచూసుకుని అటే జ్యోతిప్రసాద్ పనిచేసిన కంపెనీకి వెళదామనే ఉద్దేశ్యంతో బయలుదేరింది. కానీ అంతలోనే మేనేజర్ ప్రత్యక్షమయ్యాడు.

"సారీ మేడమ్! ఆ వచ్చినాయన మీతో అర్జెంట్‌గా కలవాలన్నారు," అన్నాడు రావ్, బుర్రగోక్కుంటూ.

"అంతకంటె 'యమర్జెంటు పనిమీదనే వెళుతున్నానని చెప్పు. ఊఁ, యూ కెన్ గో."

రావ్ కదల్లేదు. నసుగుతూ అక్కడే నిలబడ్డాడు.

"ఏమిటయ్యా నీగోల?" చిరాగ్గా అంది.

"ఆ వచ్చినాయన మిమ్మల్ని ఎలాఅయినా సరే తప్పకుండా తీసుకు రమ్మన్నారండి! లేకపోతే ఆయనే వచ్చేస్తామన్నారు," అన్నాడు.

"ఇంతకీ ఎవరయ్యా ఆ మహానుభావుడు?" కోపాన్ని దిగమింగుతూ అడిగింది. ఒళ్లు మండిపోతోంది జూలీకి, ఆ కనపడని వ్యక్తిమీద.

"ఎవరో జేమ్స్‌గారుటండీ!"

ఆ మాట వినగానే జూలీ మొహంలో చప్పున మార్పువచ్చింది వింత కాంతితో కన్నులు మెరిశాయి.

"ఏం మనిషవయ్యా నువ్వు? ఆ మాట ముందే చెప్పాల్నా లేదా? ఫలానా

వ్యక్తి మీకోసం అడిగారు మేడమ్ అని చెప్పకూడదూ?" అతన్ని దులుపుతూ, ఒక్క ఉదుటున కారుదగ్గరికి పరిగెత్తింది.

రావ్, ఆమె ప్రవర్తన అర్థంకాక చూస్తూ నిలబడ్డాడు ఆశ్చర్యంగా,

* * *

"హలో జేమ్స్! ఎప్పుడు రాక?" హైహీల్సు టక టకమనిపిస్తూ, హాల్లోకి వస్తూ అంది జూలి.

సోఫాలో కూర్చుని పేపర్ చదువుతూ ఉన్నాడు జేమ్స్. ఆమె అలికిడి వినగానే, పేపర్ అవతలపడేసి చిరునవ్వుతో జవాబిచ్చాడు.

"రాక గంటక్రితంగానీ, తమరేమిటి యింత ఆలస్యం?"

"సారీ! నువ్వనుకోలేదు. ఎవరో వచ్చారంటే యింకెవరో అనుకున్నాను. ఆ మేనేజరొక యూస్‌లెస్ ఫెలో. నీ పేరు చెప్పకుండా నాటకాలాడుతున్నాడు యింతసేపూ!" అతని ప్రక్కన కూర్చుంటూ చెప్పింది.

"ఏమిటి, మీ బాస్‌కే తెలియకుండా నాలుగురోజులు మాయమైపోయావుట!" నవ్వుతూ అడిగాడు.

"ఒక ముఖ్యమైన పనిమీద వెళ్ళాల్సి వచ్చిందిలే!"

"ఏమిటబ్బా అంత ముఖ్యమైనపని! నేనేమో నిన్ను సర్‌ప్రైజ్ చేద్దామని లెటర్‌కూడా వ్రాయకుండా సడెన్‌గా దిగాను. తీరాచూస్తే నువ్వు లేవు. నువ్వు ఎక్కడికి వెళ్ళిందీ రాజశేఖర్‌కికూడ తెలియదట! ఆ మాట అతను అనగానే చెప్పలేనంత ఆశ్చర్యం వేసింది. బొంబే, మద్రాస్, కలకత్తా వరసగా ట్రంకాల్ చేశాము. నువ్వు లేవన్నారు. ఈవేళ ఉదయంమటుకు నువ్వు యిక్కడ ఉన్నావని తెలిసింది. ఫోన్‌లో మాట్లాడుదామంటే నువ్వు దొరకలేదు. ఎందుకులెమ్మని చెప్పి నేనే ప్లేన్‌ఎక్కి చక్కా వచ్చేశాను." హాస్యం మేళవిస్తూ చెప్పాడు జేమ్స్

"మంచిపని చేశావు!" నవ్వింది జూలి.

"లే, లే! టైమయిపోతోంది. ఫస్ట్‌షో చూసుకుని, అలాగే ఏదయినా హోటల్లో డిన్నర్ చేసుకుని, తర్వాత..." లేచి నిలబడ్డాడు జేమ్స్. చేయిపట్టి లాగి కూర్చోబెట్టింది జూలి

"సారీ జేమ్స్! ఈవేళ వీలుపడదు. చాలా ముఖ్యమైన పనిమీద వెళ్ళాలి!" బ్రతిమిలాడుతున్నట్టుగా అంది.

"ఈ నాలుగురోజులుగా తిరుగుతోంది ఆ పనిమీదేనా?"

"అవును ! ఈ ఒక్క రోజుకీ వదిలెయ్! ప్లీజ్ ! చాలా అర్జెంటుపని,"
దీనంగా మొహంపెట్టింది.

రెండుక్షణాలు ఆలోచిస్తున్నట్లు నటించి తర్వాత అన్నాడు జేమ్స్. "ఓకే! ఒప్పుకున్నాం. కానీ ఒక్కషరతు. ఆ పని ఏమిటో చెబితేగానీ మిమ్మల్ని వదిలేది లేదు."

"చెప్పక తప్పదా?"

"తప్పదు!"

"సరే! అయితే దానికొక కథ చెప్పాలి!"

"కథ అయితే మరీ మంచిది లక్షణంగా వింటాం. అవునూ, ఈ కథ రాజులదా?"

"కాదు! రాజశేఖరంగారిది," వర్తి పలికింది.

# 5

ట్రైన్ ఏదో చిన్న స్టేషన్‌లో ఆగింది. బాత్‌రూమ్‌లో మొహం కడుక్కుంటున్న రాజశేఖర్ సడెన్‌గా ట్రైన్ ఆగటంతో ఒకక్షణం తూలిపడి నిలదొక్కుకున్నాడు.

కానీ అతను అనుకున్నట్లుగా కాకుండా, రెండునిముషాలకే కూతవేసి బయలుదేరింది. టవల్‌తో మొహంతుడుచుకుంటూ, అతను తలుపు తెరచుకుని బయటకు వచ్చేసరికి, ట్రైన్ కొద్దిగా వేగాన్నందుకుంది. కంపార్ట్‌మెంట్ తలుపు తోసుకుని ఎవరో వస్తున్నట్లుగా కనబడేసరికి, కంగారుగా వెళ్ళి తలుపు తీయటమేమిటి, ఆ వ్యక్తి ఒక్క ఉదుటున అతని మీదపడటమేమిటి క్షణంలో జరిగిపోయాయి. రాజశేఖర్ తనను తాను నిలదొక్కుకోవటంతోపాటు, ఆవ్యక్తి నడుముచుట్టూ చేయివేసి పడకుండా గట్టిగా పట్టుకున్నాడు.

రైలు పూర్తి వేగాన్నందుకుని, ప్లాట్‌ఫారంని వదిలేసింది.

చీకట్లో ఆ వ్యక్తి ఎవరో తెలియలేదుగానీ, ఆమెను తాకగానే తెలిసిపోయింది పరువంలో ఉన్న స్త్రీ అని. వెంటనే ఆమెని వదిలేశాడు.

"అయాం సారీ!" అస్పష్టంగా అంది ఆ యువతి.

"నెవర్ మైండ్. కానీ క్షణంలో ఎంత ప్రమాదం తప్పిందో చూశారా?" అన్నాడు మందలిస్తున్నట్లు.

దానికామె ఏమీ జవాబు చెప్పలేదు.

"లోపలికి రండి!" వెనక్కి తిరిగి రెండడుగులు వేస్తూ అన్నాడు. ఆమె కదల్లేదు. అతను తిరిగిచూశాడు

"మరేం ఫర్వాలేదు రండి!" అన్నాడు తిరిగి.

ఆమె కొంచెం తటపటాయించి మెల్లగా నడిచింది అతని వెనక.

అతి చిన్న ఫస్ట్‌క్లాస్ కంపార్టుమెంటది. ఎదురెదురుగా రెండు బెర్త్‌లు తప్ప మరే సీట్లూలేవు. ఒక బెర్త్ మీద దిండువేయబడి ఉంది. పేపర్ చిందరవందరగా మడిచిఉంది. సూట్ కేస్ పైనుంచి తొంగిచూస్తోంది. బాస్కెట్ ఒకటి మూలగా ఉంది.

దిండు ఉన్న తనబెర్త్ మీద కూర్చుంటూ అన్నాడు రాజశేఖర్ "కూర్చోండి!" ఆమె అతని ఎదురుగా కూర్చుంది.

లైటు వెలుతురులో ఆమెని పరీక్షగా చూడసాగాడు రాజశేఖర్.అంతవరకూ సరిగ్గా చూడలేదు. రోజారంగు జార్జెట్ చీర కట్టుకుని ఉంది. దానిమీద అక్కడక్కడా నల్లటిపూలు కుట్టబడి ఉన్నాయి. నల్లటి జాకెట్ వేసుకుంది చెవులకి కొంచెం పెద్దవి అనిపించే రింగులు, మెడలో ఒంటిపొర గొలుసు. కుడిచేతికి ఒక మట్టిగాజు. ఎడమచేతికి వాచీ. అతి సాధారణమైన అలంకరణతో నిరాడంబరంగా కనిపిస్తోంది. ఆ నిరాడంబరతే ఆమె అందాన్ని ఎత్తిచూపుతోంది.

అతను ఆమెని అలాగే తదేకంగా చూడసాగాడు. ఒకసారి తలెత్తి చూసిన ఆమె చూపులు, అతనితో కలవటంతో తొట్రుపాటుతో కళ్లు దించుకుంది. ఆ చూపులలో లీలగా భయం కనపడింది రాజశేఖర్‌కి.

ఆమె చేతిలో ఉన్న పర్స్‌ను చూస్తూ అన్నాడు.

"మీరు ఎక్కడికి వెళ్తున్నారు?"

తలెత్తింది,

"బెంగుళూరుకి. నేను ఎక్కింది గుంతకల్లులో ఎనిమిది దాటాక ఏదో స్టేషన్‌లో టిఫెన్ తెప్పించుకుని తిన్నాను. మంచినీళ్ళు తాగుదామనుకునే లోపలే ట్రైన్ కదిలింది. మా కంపార్ట్‌మెంట్‌లో ఎవరిదగ్గరా నీళ్లు లేవు. బాగా దాహమవుతుంటే, ధైర్యంచేసి యిందాక దిగాను. ఇలా దిగి కుళాయి దగ్గరికి నడిచానో లేదో ట్రైన్ కదిలింది, నీళ్ళు తాగనేలేదు. పరుగెత్తుకుంటూ వచ్చేసరికి అలవాటు లేకపోవడంవలన మా కంపార్ట్‌మెంట్ త్వరగా ఎక్కలేకపోయాను. మీదాంట్లోకి ఎక్కేశాను.

"ఇంతకీ మీరు మంచినీళ్ళు త్రాగరా, లేదా?" నవ్వుతూ అడిగాడు రాజా.

"లేదు!" సిగ్గుపడుతూ చెప్పింది.

"మీ సాహసకార్యం ఫలించలేదన్న మాట!"

రాజశేఖర్ బాస్కెట్‌లోంచి వాటర్‌బాటిల్ తీసి, గ్లాసులో నీళ్ళుపోసి యిచ్చాడు. ఆమె చేయిచాపి వెంటనే తీసుకుంది

"థ్యాంక్స్!"

గ్లాసు పైకెత్తి గటగటా తాగేసింది. గ్లాసు తీసుకుంటూ అడిగాడు. "ఇంకా కావాలా?"

"చాలు!" తల అడ్డంగా ఊపుతూ అంది.

అతను వాటర్ బాటిల్‌ను తిరిగి బాస్కెట్‌లో పెట్టేశాడు.

"మీ సామానూ అదీ..." ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఒక్క బాగే లెండి. చూస్తూండమని చెప్పివచ్చాను. అంతగా పోయినా బాధపడవలసిందేమీలేదు. రెండు చీరలు తప్ప అందులో ఏమీ లేవు. పర్స్ నాదగ్గరే ఉందిగా!"

కొంచెంసేపు యిద్దరూ మౌనంగా ఉండిపోయారు. తిరిగి ఆమే మాట్లాడింది. "మీ రెక్కడికి వెళుతున్నారు?"

"బెంగుళూరుకే! రైలు ప్రయాణమంటే నాకు సరదా! అందుకే తీరిక ఉన్నప్పుడల్లా యిలా ప్రయాణం చేస్తుంటాను."

ఆమె నవ్వింది. మైమరచి చూశాడు రాజశేఖర్.

"బెంగుళూరులో మీ బంధువులెవరన్నా ఉన్నారా?"

"ప్చ్! ఎవరూ లేరు. ఇంటర్వ్యూకోసం వెళుతున్నాను."

"అయితే ఎక్కడ దిగుతారు మీరు?"

"ఎక్కడా దిగను. వెయిటింగ్ రూమ్‌లోనే ఉంటాను. సాయంత్రం ఇంటర్వ్యూ చూసుకొని రాత్రికీ మరలా ప్రయాణం." గోర్లు కొరుకుతూ చెప్పింది.

"ఏ ఇంటర్వ్యూకి మీరు వెళ్ళేది?"

"స్టెనోకి, ప్రైవేటుకంపెనీ అది, పేరు గుర్తులేదు."

రాజశేఖర్ ఏమీ మాట్లాడలేదు. ఆమె పర్స్‌తీసి, ఇంటర్వ్యూ కార్డు బయటికి తీసింది దాన్ని ఓసారి మనసులో చదువుకుని తిరిగి పర్స్‌లో పెట్టబోతుంటే అతను చేయిచాపాడు.

"ఇలా తేండి, అది!"

ఆమె యిచ్చింది. దాన్ని చూసిన రాజశేఖర్ విపరీతంగా ఆశ్చర్యపోయాడు. మొహంలో అదేమీ కనపడకుండా అదిమిపట్టాడు. ఆ కార్డులో స్పష్టంగా ఆమె పేరు ఉంది 'లావణ్య' అని. అయినా అడిగాడు–

"మీ పేరేమిటి?"

"లావణ్య!"

'లావణ్య! లావణ్య! !' మనసులో ముద్రించుకున్నాడు.

తరవాత స్టేషన్ వచ్చి లావణ్య కంపార్టుమెంట్ మారేవరకూ, ఒకరినొకరు చూసుకోవడం తప్ప, యిక సంభాషణేమీ జరగలేదు వారిమధ్య.

# 6

"ఎలావుంది కథ?"

"పాత కథే! తొలిచూపులోనే రాజా ఆ అమ్మాయిని ప్రేమించాడు. తన కంపెనీలోనే ఉద్యోగమిచ్చాడు. కానీ ఆ అమ్మాయి ఏవో కారణాలవల్ల ఆ ఉద్యోగం వదులుకుని వెళ్ళిపోయింది. నువ్వు వెతుక్కుంటూ వెళ్ళావు! అంతేనా?"

పకపకా నవ్వింది జూలి.

"ఏం? నేను చెప్పింది తప్పా?"

"కాదు, నిజమే! కానీ ఆ అమ్మాయి ఉద్యోగం వదులుకుని వెళ్ళిపోలేదు. లక్షణంగా మా కంపెనీలోనే పనిచేస్తోంది."

"మరి?" ఆశ్చర్యంగా అడిగాడు జేమ్స్.

"ఆ అమ్మాయి బాస్ చూసిన లావణ్య కాదు!" నిదానంగా అంది.

"వాట్ !" తెల్లబోయాడు.

"ఎస్! బాస్ తెల్లవారుఝామున బెంగుళూర్లో దిగారు. నేనే స్వయంగా రిసీవ్ చేసుకున్నాను. మరుసటిరోజు ఆయన పేపర్‌మిల్స్ మెషీన్స్‌కోసం ఇటలీ వెళ్ళాల్సి ఉంది. అందుకని ఉదయమే బొంబే వెళ్ళిపోయారు. నేను వెంట వెళ్ళ లేదు. ఆయనే వద్దన్నారు. వెళుతూ స్టెనోకి 'లావణ్య' అనే అమ్మాయిని అపాయింట్ చేయమన్నారు. నేను అలాగే చేశాను. నాలుగు నెలల తర్వాత అంటే పదిరోజులక్రిందట బాస్ బెంగళూరు వచ్చారు. వచ్చిన వెంటనే అడిగారు, 'లావణ్యని అపాయింట్ చేశావా' అని. 'చేశాను ఇప్పుడు వర్క్‌చేస్తోంది సర్' అని చెప్పాను. ఆయనకి ఎన్ని పనులున్నా సాయంత్రమే కంపెనీకి వచ్చారు.



లావణ్యని పంపమంటే నేనే స్వయంగా, ఫైల్స్ ఆమె చేతికిచ్చి పంపాను కానీ అప్పుడే కథ అడ్డం తిరిగింది..."

* * *

రాజశేఖర్ గుండెలు ఉద్వేగంతో కొట్టుకుంటున్నాయి.

'తనను చూసి ఏమనుకుంటుంది లావణ్య! బహుశా ఆశ్చర్యపోతుందేమో? తనే ఆమెని ఈ ఉద్యోగానికి రికమెండ్ చేసి ఉంటాడని భావిస్తుంది కాబోలు!'

"మే ఐ కమిన్ సర్!"

ఉలిక్కిపడ్డాడు.

"యస్. కమిన్," అనేసి పేపర్ మొహానికి అడ్డంగా పెట్టుకున్నాడు. ఆమె లోపలికి వచ్చిన చప్పుడు!

"ప్లీజ్ టేక్ యువర్ సీట్!" పేపర్ తీయకుండానే అన్నాడు.

కుర్చీలాగి కూర్చున్న చప్పుడు వినిపించింది.

'ఆమెని సర్ప్రైజ్ చేయాలి!' రెండునిముషాలు పేపర్ తీయలేదు తర్వాత చిన్నగా పేపర్ తీసి ఆమెవైపు చూశాడు. షాక్ తగిలినట్లయింది.

ఎదురుగా ఉన్నది లావణ్య కాదు! ఆమెకీ, ఈమెకీ పోలికలే లేవు ఆమె దీక్షగా ఫైల్స్ చూస్తోంది. రాజశేఖర్ నిరాశనీ, కోపాన్నీ అణచుకొని "మీరు వెళ్ళి జూలీని రమ్మన్నానని చెప్పండి!" అన్నాడు.

ఆమె ఉలిక్కిపడి "అలాగే సర్!" అని లేచి వెళ్ళిపోయింది. వెనుక నాట్యమాడుతున్న పొడుగాటి జడ అతన్ని చూసి నవ్వింది.

రాజశేఖర్ మనసు చెప్పలేనంత అసంతృప్తితో నిండిపోయింది తాను అనుకొన్నదేమిటి? జరిగిందేమిటి?

ఆ లావణ్య ఏమయిపోయింది? ఈవిడెక్కడినుంచి వచ్చింది? జూలీ లోపల అడుగుపెట్టింది.

"ఎందుకు బాస్ పిలిచారట?"

ఆమెని చూడగానే అతనికోపం ఉవ్వెత్తున లేచింది.

* * *

బాస్ అంత సీరియస్గా ఉండటం ఎప్పుడూ చూడలేదు నేను. నన్ను చూడగానే యిలా అడిగారు.

"జూలీ! నే నెవర్ని అపాయింట్ చేయమన్నాను స్టెనోగా?"

నేను తెల్లబోయాను.

"లావణ్యనే కదా సర్!"

"అయితే యిప్పుడు నా గదిలోకి వచ్చింది లావణ్యేనా?"

"అవును సార్!" అన్నాను

"నో! ఆమె లావణ్య ఎంతమాత్రం కాదు?"

నాకు అర్థంకాలేదు తిరిగి బాస్ యిలా అన్నారు.

"ఇంటర్వ్యూకి ఏమైనా యిద్దరు లావణ్యలు వచ్చారా?" అన్నారు ఆలోచిస్తూ.

"లేదు సార్, ఒక లావణ్యే వచ్చింది," అన్నాను.

నాకు బాస్ ప్రవర్తన ఎంతమాత్రం అర్థంకాలేదు తర్వాత చెప్పారు, రైల్లో తనని లావణ్య కలిసిన సంగతి బాస్ ఆ అమ్మాయిని ఎంతగానో కోరుకుంటున్నారని అర్థమయింది కానీ యిదేమిటి? ఏకంగా అమ్మాయే మారి

పోయింది. బాస్ లోలోపల చాలా బాధపడ్డారు. పైకిమాత్రం నాతో ఏమీఅనలేదు.

"నేను చాలా దురదృష్టవంతుణ్ణి. ప్రతిదీ అందినట్లే అంది దూరమయి పోతోంది. ఇక ఈ జీవితాని కింతే! పొరపాటునకూడా ఏదీ ఆశించకూడదు." అని అంటుంటే ఆ కంఠంలో నిరాశ చూసి, నేను చాలా మధనపడ్డాను.

ఫలితంగా లావణ్యని వెదకటం ప్రారంభించాను. ఆ ప్రయత్నంలోనే యిన్నాళ్ళూ తిరుగుతున్నాను. ఇప్పుడు పనిచేస్తున్న లావణ్య డూప్లికేట్ అని చెప్పడానికి ఆధారాలు లేవు!" ముగించింది జూలి.

"ఒకవేళ రైల్లో కనిపించిన లావణ్యే నకిలీయేమో? ఎలా చెప్పగలం?" సిగరెట్ వెలిగించుకుంటూ అన్నాడు జేమ్స్.

"నిజమే! నాకూ ఆ అనుమానం తగలకపోలేదు. ఒకవేళ రైల్లో అమ్మాయే ఈ లావణ్య పర్సు దొంగిలించి, ఇంటర్వ్యూకి వస్తున్నానని బాస్‌తో అబద్ధాలాడిందో ఏమో?"

"చెప్పలేం? సముద్రపు లోతైనా కనుగొనవచ్చు గానీ. ఆడవాళ్ళ మనసు లోతు కనుక్కోలేమట! ఎంతకైనా బరితెగిస్తారు. పోనీ ఈ లావణ్యనే నిలదీసి అడక్కపోయావా, నీ పర్స్ ఎవరైనా తీసుకున్నారా? అని."

"దానివల్ల ఓ ప్రమాదముంది. ఈ లావణ్యే డూప్లికేట్ అయితే, మనం అలా అడిగితే, తన బండారం బయటపడుతుందని ముందుగా జాగ్రత్తపడుతుంది. లేకపోతే ఏకంగా ఈవిడే మాయం అయిపోవచ్చు. అందుకని ఈవిడకి తెలియకుండా ఆమెగురించి ఎంక్వైరీ చేస్తున్నాను."

"ఏమైనా తెలిసిందా?"

"ఈవిడ ఈవిడే అని తెలిసింది " నిరాశగా అంది జూలి.

"అదేమిటి?"

"ఫలానా అని తెలీకుండా వాళ్ళింటి కెళ్ళాను, వాళ్ళ చెల్లెలు లక్షణంగా జవాబిచ్చింది. ఎక్కడా దొరకలేదు క్లూ!"

"అలా చెప్పమని ఈవిడే వాళ్ళ చెల్లెలికి చెప్పిందేమో?"

"నేనంత తెలివితక్కువదాన్నేమిటి? వాళ్ళకుటుంబం గురించి చుట్టుపక్కల విచారిస్తే అంతా అదే చెప్పారు, వాళ్ళ యింటికి పెద్ద లావణ్య అని, బెంగుళూర్లో ఉద్యోగంచేస్తూ కుటుంబాన్ని పోషిస్తోందని."

"అయితే ఈవిడ డూప్లికేటా, ఒరిజినలా అని తెలియడానికి యిక ఆధార మేం లేదా?"

"లేకేం? చక్కగా ఉంది."

జూలీ పర్సు తెరిచి, చక్రపాణి లావణ్యకు వ్రాసిన ఉత్తరం తీసియిచ్చింది. దాన్ని ఆసక్తిగా చదివిన తర్వాత జేమ్స్ పకపకా నవ్వాడు.

"ఇదెక్కడ సంపాదించావు నువ్వు?"

"చెప్పానుగా! లావణ్యను ఎంక్వైరీ చేస్తున్నానని. ఒకసారి ఆమెని తొందర పాటుతో పంపించి, తర్వాత ఆమె పర్సు వెదికాను. అందులో యిది దొరికింది. ఏమైతే అయింది లెమ్మని ఇది తీసేసుకున్నాను. ఇంకో ఉత్తరం ఉంది. అది వాళ్ళ యింటికివ్రాసిన ఉత్తరం. దానిమీద అడ్రెస్ నోట్ చేసుకున్నాను. ఆ అడ్రెస్‌తోనే వాళ్ళ యింటికి వెళ్ళాను."

"సరే బాగానే ఉంది. కానీ ఈ ఉత్తరం ఆవిడ యిన్నాళ్లూ ఎందుకు దాచి పెట్టుకుందంటావ్?"

"ఆ ఆలోచన నాకూ వచ్చిందిలే! ఆమె పర్సు అయిదారు అరలది. అందులో మూలగా ఈ ఉత్తరం దొరికింది. లావణ్య పేదపిల్ల. ఆమె పర్సు కూడా చాలా పాతది. ఈ ఉత్తరం ఆమె ఎప్పుడో పెట్టుకుని మర్చిపోయి ఉండవచ్చుగదా!'' తెలివిగా సర్దిచెప్పింది జూలి.

"అయివుండవచ్చు! మరి ఈ చక్రపాణి వద్దకు వెళ్ళావా? అతను ఆమెను గనుక చూసిఉంటే గుర్తుపట్టగలిగేవాడుకదా?"

"వెళ్ళాను. కానీ అతను లావణ్యని చూడలేదన్నాడు. ఇప్పుడు మనం వెదకాల్సిందల్లా జ్యోతిప్రసాద్‌ని,"

జేమ్స్‌కి పట్టకుండా నవ్వువచ్చింది.

"వెరీగుడ్! ప్రపంచంలో ఏ కేసుకీ యిటువంటి క్లూ ఉండదనుకుంటాను. ఇప్పుడు చెప్పుదెబ్బలు తిన్న అతన్ని పట్టుకుంటే, లావణ్యని గుర్తుపట్టగలడన్న మాట!" ఇంకా నవ్వసాగాడు.

* * *

మూడంతస్తుల మేడమీద ఉన్న మేనేజర్ గదిలోకి లిఫ్ట్‌ద్వారా వెళ్ళవలసి వచ్చింది జేమ్స్, జూలి.

ఎయిర్‌కండిషన్డ్, సౌండ్‌ప్రూఫ్ అయిన ఆ గదిలోకి ప్రవేశించాక తెల్ల బోయింది జూలి, అక్కడి వ్యక్తులను చూసి. 'కాస్మెటెక్స్' కంపెనీలో

తమతో షేర్సు ఉన్న భండారీ ఉన్నారక్కడ! మేనేజర్ సీట్లో ఎవరో కాదు, ఆయన కొడుకు సిద్ధార్థ భండారీ కూర్చుని ఉన్నాడు.

"వాటీజ్ దిస్ మిస్టర్ భండారీ? మాకు తెలీకుండా ఈ కంపెనీని మీరు ఎప్పట్నుంచీ రన్ చేయిస్తున్నారు?"

చనువుగా వెళ్ళి కుర్చీలో కూర్చుని అడిగింది. ప్రక్కనే జేమ్స్ కూర్చున్నాడు.

"గుడీవెనింగ్ మిసెస్ జూలీ! ఎప్పుడు వచ్చారు జేమ్స్? రాజా క్షేమమేనా? ఈమధ్య ఇటలీనుంచి వచ్చాక కలవనేలేదు. ఆఁ, ఏమిటి అడుగుతున్నారు? ఈ కంపెనీ ఎప్పటినుంచి నడుస్తున్నదనా? మీకు తెలియందేముంది? జస్ట్ టెన్ పర్సెంట్ పార్ట్నర్‌షిప్. అంతే! ఈమధ్య మా సిద్ధార్థ ఎమ్.ఎ. అయినతర్వాత ఖాళీగా ఉంటే తీసుకొచ్చి ఈ సీట్లో కూర్చోబెట్టాము. ఎలా నడుపుతాడో, ఏమిటో?" కొడుకువైపు చూస్తూ అన్నారు.

హిప్పీవేషంలో ఉన్న సిద్ధార్థ సిగ్గుపడుతున్నట్లుగా నవ్వాడు.

"విష్ యూ బెస్ట్ ఆఫ్ లక్ మిస్టర్ సిద్ధార్థా!" జేమ్స్ అన్నాడు.

"థాంక్యూ సర్!" నమ్రతగా అన్నాడు.

బెల్ నొక్కాడు భండారీ. ప్యూన్ లోపలికొచ్చాడు.

"ఏం తీసుకుంటారు? కాఫీ ఆర్ కూల్‌డ్రింక్స్?" ఆయన అడిగారు.

"నో! నో! ఇప్పుడేం వద్దు! ఇప్పుడే తీసుకుని వస్తున్నాము." వారించింది.

"మరేం ఫర్వాలేదు! ఫోర్ కాఫీ!" అని చెప్పారు.

ప్యూన్ వెళ్ళిపోయాడు.

"ఇంతకీ మేము వచ్చినపనే మరిచిపోయాం!" జేమ్స్ అన్నాడు.

"ఎప్పుడూ ఉన్నవేగా వెధవపనులు! ఇంతకీ ఏంకావాలి? పర్సనలా?"

"నో జస్ట్ సమ్ ఇన్ఫర్మేషన్. సంవత్సరం క్రిందట మీ కంపెనీలో పని చేసిన జ్యోతిప్రసాద్ అనే వ్యక్తి యిప్పుడు ఉన్నాడో లేడో కనుక్కోవాలి, అంతే!"

"ఈ చిన్నవిషయానికే మీరు స్వయంగా రావాలా?" భండారీ ఫోన్‌చేస్తూ అన్నారు.

"అది ఎంతముఖ్యమైనదో ఈయనకేంతెలుసు!" మనసులో అనుకుంది జూలి.

"ఏంపేరు మీరు అన్నది జూలీ?" బండారీ మౌత్‌పీస్ దించి అన్నారు.

"ఎ. జ్యోతిప్రసాద్!" ఒత్తిపలికి చెప్పింది.

ఆయన ఫోన్‌లో మాట్లాడి పెట్టేశారు.

"మరో ఐదునిముషాల కంతా చూసి పంపిస్తామన్నారు!"

ఇంతలో కాఫీలు వచ్చాయి. నలుగురూ సిప్‌చేస్తూ బిజినెస్ గొడవలు మాట్లాడసాగారు. కాఫీ పూర్తిచేసేసరికి ఫోన్ వచ్చింది క్రిందినుంచి. ఆయన ఆ చెప్పింది విని ఫోన్ పెట్టేశారు.

"సారీ మిసెస్ జూలీ. ఆ జ్యోతిప్రసాద్ ఇప్పుడు ఇక్కడ లేడు. దాదాపు పదినెలలక్రిందటే అతను ఏదో అవకతవక పనిచేసినందుకు డిస్‌మిస్ చేసేసారట!" భండారీ చెప్పారు.

నిరాశగా వాడిపోయిన జూలీ మొహంచూస్తూ, మనసులో నవ్వుకున్నాడు జేమ్స్. జూలీ రెండుక్షణాలు ఆలోచించి యిలా అంది:

"పోనీ అతనికెవరన్నా మీ కంపెనీలో స్నేహితులున్నారేమో కనుక్కొని చెప్పమనండి! వీలయితే యిక్కడికి పంపమనండి!"

ఇదేదో ముఖ్యమైనదిగా భావించి, ఈసారి సిద్ధార్థ ఫోన్ ఎత్తాడు. చాలా గట్టిగా మాట్లాడా తను.

"వెరీగుడ్! అప్పుడే మేనేజర్ లక్షణాలు వచ్చేశాయి!" జూలీ నవ్వుతూ అంది. రిసీవర్ పెట్టేస్తున్న సిద్ధార్థ నవ్వాడు చిన్నగా.

"మరి నేర్చుకోకపోతే ఎలా? వీడి నసలు మేనేజ్‌మెంట్ కోర్సు చదవమంటే వినలేదు! మా రెండోవాడు చదువుతున్నాడు," అన్నారు భండారీ.

"ఎమ్.బి.ఎ. చదివితేనే బిజినెస్ బాగా చేస్తారని ఎక్కడాలేదు. రాజాసాబ్ చదివారా? మిసెస్ జూలీ చదివారా?" కోపంగా అన్నాడు.

"నిజమే! తెలివితేటలుంటే దేనిలోనైనా రాణిస్తారు లెండి. దేనికైనా ఇంటరెస్ట్ ఉండాలి!" జేమ్స్ అన్నాడు.

"ఇంటరెస్ట్ ఒక్కటే చాలదు! పట్టుదలా, శ్రద్ధా కూడా ఉండాలి!"

"చిత్తం! తమరే అందుకు ఉదాహరణకదా?" జేమ్స్ అనేసరికి తండ్రీ కొడుకులిద్దరూ నవ్వేశారు.

"మే ఐ కమిన్ సర్?"

చప్పున నలుగురూ గుమ్మంవైపు చూశారు. ముప్పైఏళ్ళ యువకుడొకడు నిలబడిఉన్నాడు.

"యస్, కమిన్!" సిద్ధార్థ అన్నాడు.





అతను లోపలికొచ్చాడు.

"ఏం కావాలి?" హుందాగా అడిగాడు

"అసిస్టెంట్ మేనేజర్ పంపారు సర్! జ్యోతిప్రసాద్ వివరాలు కావాలన్నార్ట. అందుకని నన్ను పంపారు."

భండారీ, సిద్ధార్థ, జేమ్స్ జూలీవైపు చూశారు సాభిప్రాయంగా. జూలీ గొంతు సవరించుకుని అడిగింది.

"చూడు మిస్టర్! నీ పేరు?"

"రాజేష్!"

"గుడ్! జ్యోతిప్రసాద్ నీ స్నేహితుడా?"

"వాడు నా ఫ్రెండా? ఛీ! ఛీ! అలాంటి లోఫర్‌తో ఎవరు స్నేహంచేస్తారు మేడమ్? మొదట అలాగే మోసపోయి స్నేహం కట్టాను. అప్పుడే వెయ్యి రూపాయలు అప్పుతీసుకున్నాడు. తర్వాత తెలిసిపోయింది వాడి అసలు స్వరూపం! నా అప్పుకోసం వాడితో మంచిగా ఉండేవాణ్ణి. ఇక్కడినుంచి డిస్మిస్ అయాక కూడా ఇంకా నాకు ఐదువందలు ఇవ్వవలసి ఉండేది ఇప్పుడంతా తీర్చేశాడు."

"ఇప్పుడెక్కడున్నాడో తెలుసా నీకు?" ఆతృతగా అడిగింది జూలి.

"ఎక్కడపనిచేస్తున్నాడో తెలీదుమేడమ్! ఓసారి డిస్మిస్ అయాడుకాబట్టి,

తానెక్కడ పనిచేసేదీ చెప్పలేదు. తను డిస్మిస్ అయాడని తెలిస్తే ఆ కంపెనీ వారుకూడా తీసేస్తారని భయపడ్డాడు."

"అయితే నీకు డబ్బు ఎక్కడినుండి పంపేవాడు ?"

"మెడ్రాస్‌నుండి మేడమ్! మెడ్రాస్‌లో ఫామిలీ పెట్టాడు. బహుశా మెడ్రాస్‌లోనే జాబ్ చేస్తున్నాడేమో?"

"నీకు ఏ అడ్రెస్ యిచ్చాడు?"

"ఇంటి అడ్రెస్!"

"ఇప్పుడు ఆ అడ్రెస్ నీదగ్గర ఉందా?" ఆమె ఆతృత చూస్తుంటే నవ్వొచ్చింది జేమ్స్‌కు.

"ఉంది మేడమ్!"

"నువ్వు ఆఖరిసారిగా అతని దగ్గరినుంచి మణియార్డరు తీసుకుంది ఎప్పుడు?" జేమ్స్ అడిగాడు.

"రెండు నెలల క్రిందట సార్!"

"అడ్రెస్ గుర్తుందా? కరెక్టుగా చెప్పు!" జూలీ పెన్నూ పేపరూ తీసుకుంటూ అంది.

రాజేష్ గుర్తుచేసుకుని చెప్పాడు.

'థాంక్స్ మిస్టర్ రాజేష్! యూ కెన్ గో!" అంది జూలి

రాజేష్ వెళ్ళిపోయాడు. జూలీ, జేమ్స్ లేచారు.

"ఇక వస్తామండీ! మీరు చేసిన సహాయానికి చాలా థాంక్స్!"

"అదేమిటి జూలీ! ఇంతమాత్రానికి కృతజ్ఞతలు దేనికి ?" అంటూ వారిని గుమ్మంవరకూ సాగనంపారు, భండారీ.

మేడ దిగి, పార్క్ చేయబడిన కారును తీస్తూ అంది జూలి-

"రేపు మెడ్రాస్ వెళదాం, జేమ్స్!" కారు స్టార్టు చేసింది.

"జూలీ! ఒక మాట అడగనా?"

"ఏమిటబ్బా ఆ మాట?" హాస్యంగా అంది.

"రాజా విషయంలో నీ కంత శ్రద్ధ ఎందుకు?" సీరియస్‌గా అడిగాడు.

"నువ్వంటే నాకింత యిష్టం ఎందుకు?" ఎదురుప్రశ్న వేసింది.

ఫక్కున నవ్వాడు జేమ్స్.

"నేను చాలా అదృష్టవంతుణ్ణి జూలీ!"

"కాదు! నేను చాలా అదృష్టవంతురాల్ని. తన భార్య మరోవ్యక్తిని

అభిమానిస్తూ అతనిదగ్గరే పనిచేస్తోందని తెలిసీ, సహించి, భార్యను ప్రేమించే భర్తలు ఈ ప్రపంచంలో ఎంతమంది ఉంటారు?"

## 8

జేమ్స్, జూలీ మర్నాడు మెడ్రాస్ వచ్చేసరికి, 'రెస్ట్‌హవుస్'లో మేనేజర్ రావ్, లావణ్యా కనపడ్డారు.

"బాస్‌కూడా రావలసిందే మేడమ్! కానీ 'రెస్ట్‌తీసుకోవాలి. ఇంకా పది రోజులవరకూ నేను రానన్నా న'ని చెప్పమన్నారు మేడమ్!"

నిట్టూర్చింది జూలి. మెడ్రాస్‌కి రాజశేఖర్‌ని రావలసిందిగా రాత్రి ట్రంక్‌కాల్ చేసింది. అతను ఎందుకు రానన్నాడో అర్థమయింది. బాస్ మనసు నిజంగా గాయపడింది అనుకుంది.

లావణ్యని జేమ్స్‌కి చూపించింది జూలి. అతను ఏమీ అనలేదు. ఆవేళ వాళ్ళు జ్యోతీప్రసాద్‌ని వెదుకుతూ వెళ్ళలేదు. ఆవేళకి వదిలేశాడు పాపం జ్యోతీప్రసాద్!

ఆవేళ సాయంత్రం బీచ్‌కి వెళ్ళారు జూలీ, జేమ్స్. అలలదగ్గరగా కూర్చుని మాట్లాడుకుంటుండగా మధ్యలో ఒకసారి గిల్లి జూలీని దూరంగా కనిపిస్తున్న ఒక జంటవైపు చూపాడు.

"ఎవరు?" తెల్లబోయి అడిగింది.

"సరిగ్గా చూడు!"

పరీక్షగా చూసి తెల్లబోయింది జూలి. అతన్ని అక్కడే ఉండమని చెప్పి, కొంచెం దగ్గరగా వెళ్ళింది ఆ జంటకు. వారికి తను కనబడకుండా కూర్చుని వారిని పరిశీలించసాగింది.

ఆ మాట్లాడుతున్నది లావణ్య! పక్కన ఎవరో అపరిచితుడైన యువకుడు. అతనేదో బ్రతిమిలాడుతున్నాడు. ససేమిరా అని తలూపుతోంది లావణ్య! ఓ ఐదునిముషాలపాటు ఇద్దరూ మౌనంగా ఉండిపోయారు. తర్వాత లావణ్య లేచి గబగబా వెళ్ళిపోయింది. జూలీ, ఆ వ్యక్తితోపాటు ఆశ్చర్యంగా చూడసాగింది.

లావణ్య కనుమరుగయేంతవరకూ చూసిన తర్వాత జూలి, ఆ వ్యక్తివైపు చూసింది. అతని మొహంలో దిగులు స్పష్టంగా కనబడుతోంది అతను ఓ రెండునిముషాలు ఇసుకలో గీతలు గీస్తూ కూర్చున్నాడు. తర్వాత వెళ్ళడానికి లేచాడు. జూలీ ఒక్కపరుగున అతనివద్దకు వెళ్ళింది.

"మిస్టర్!"

ఏమిటన్నట్లు తిరిగి ఆశ్చర్యంగా చూశాడు. నన్నేనా పిలిచింది అనే భావం అతని కళ్ళలో స్పష్టంగా కనిపించింది.

"ఇందాక మీతో మాట్లాడిన యువతి ఎవరు?" గబగబా అడిగింది.

"ఎందుకు?" అతను అనుమానంగా చూశాడు.

చప్పున ప్లేటు మార్చింది జూలి.

"నేను ఆవిడకి శ్రేయోభిలాషిని. ఆవిడ కుటుంబమంతా నాకు తెలుసు! మీరేదో ఆవిడతో పోట్లాడుతున్నట్లుంటే నేను మీదగ్గరికి రాలేదు."

"నా పేరు జగన్! నేను ఆమెతో చాలా ముఖ్యమైన విషయం గూర్చి మాట్లాడుతున్నాను" చెప్పాలా, వద్దా అని సందేహిస్తున్నాడు.

"మరేం ఫర్వాలేదు, చెప్పండి! నేను కావలిస్తే మీకు సహాయం చేయగలను. ఆమె కుటుంబమంతా నాకు తెలుసు!" అనునయంగా అంది జూలి.

"నేను అమృతను పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాను."

గతుక్కుమంది, జూలి

"అమృతనా? మీరా?" అంది. అప్సరసలా ఉన్న అమృత గుర్తొచ్చింది.

"అవును! ఇది ఈనాటిది కాదు. ఎన్నాళ్ళనుంచో అనుకుంటున్నదే! కానీ మధ్యలో హఠాత్తుగా వాళ్ళ అన్న ఆక్సిడెంట్‌లో చనిపోవటంతో కథ అడ్డం తిరిగింది. వాళ్ళ వదినకి పిచ్చెక్కింది. పిచ్చి వదిననూ, ఇద్దరు పసిపిల్లల్నీ, కళ్ళు కనపడని తల్లినీ ఎవరు చూసుకుంటారు? ఎవరు వారికి ఆధారం? అందుకే ఈ పెళ్ళికి ససేమిరా ఒప్పుకోవడంలేదు!" అతని కంఠంలో నిరాశ స్పష్టంగా వినిపిస్తోంది.

నిజమే అనిపించింది జూలీకి.

"ఇంతకీ ఈ పెళ్ళికి అమృత ఒప్పుకుందా?"

"అమృతే ఒప్పుకుని ఉంటే యిక పెళ్ళికి అడ్డేముంది? తనవాళ్ళని గాలికి వదిలేసి తన స్వార్థం తాను చూసుకునేటంత నీచురాల్ని కాదంది!"

"అయితే ఇప్పుడేం చేయదలచుకున్నారు?"

"అన్నాళ్ళు ఆగమంది. తర్వాత ఆలోచిస్తానంది!"

"ఏమో అనుకున్నాను. మొత్తానికి లావణ్య అసాధ్యురాలే" అంది జూలి.

అతను దీర్ఘాలోచననుండి తేరుకున్నాడు.

"వస్తానండీ! ఎవరు వినీ ఏం చేయగలరు?" జగన్ మెల్లిగా అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయాడు. అతన్నే చూసుకుంటూ, జేమ్స్ దగ్గరకు వచ్చింది

జూలి. ఆమె కూర్చుంటుండే అడిగాడు—

"ఎవరతను? ఏమన్నా తెలిసిందా?"

"లావణ్య చెల్లెలు ఒకమ్మాయి ఉంది, అమృత అని. చాలా అందంగా ఉంది. నేను చూశాను. ఆ అమ్మాయి లవర్ ఈ అబ్బాయి. చెల్లెలి పెళ్ళికి లావణ్య ఒప్పుకోవడంలేదు."

"ఎందుకని ?" ఆశ్చర్యంగా అడిగాడు జేమ్స్.

"లావణ్య ఉద్యోగంచేసి వాళ్ళని సాకుతోంది. ఆ అమ్మాయి యింట్లో. గుడ్డితల్లినీ, పిచ్చివదిననూ యిద్దరు పిల్లల్నీ చూసుకుంటోంది. ఇప్పుడు మధ్యలో తన స్వార్థం చూసుకొని వెళ్ళిపోవడానికి యిష్టపడలేదుట!"

"లావణ్య చెల్లెలికి చెప్పి ఒప్పించవచ్చుగదా !"

"నాకూ అదే ఆశ్చర్యంగా ఉంది. లావణ్య నిస్సందేహంగా నిస్వార్థపరురాలే! అటువంటిది చెల్లెలి భవిష్యత్తు పాడుచేస్తుందా? ఎంత ఇబ్బంది కలుగకపోతే ఆమె ఈ పెళ్ళికి ఒప్పుకోదు? ఇంటి పరిస్థితులు చాలా క్రుంగదీసి ఉండాలి, ఆమెని" జాలిగా అంది జూలి

"అమృత ఏమీ చదువుకోలేదా?"

"లేదు! టెన్త్‌క్లాస్ ఫెయిలయ్యానని చెప్పింది."

"ఇప్పటికయినా ఆశ వదులుకో జూలీ! ఈవిడే లావణ్య అని కచ్చితంగా తెలిసిపోతోంది కదా? ఇంకా ఎందుకు నీ ఎంక్వైరీ? లావణ్యనే అడిగేస్తే సరి, 'నీవు జ్యోతీప్రసాద్ అనే వ్యక్తిని చెప్పుతోకొట్టావా?' అని."

"నువ్వు ఒక కోణంనుంచే ఆలోచిస్తున్నావు. ఈ లావణ్య చాలా కష్టాల్లో ఉంది. ఏ కారణంచేతనైనా ఆ లావణ్య సర్టిఫికెట్స్ దొంగిలించిఉండవచ్చుగదా అలాగే ఈ ఉత్తరం కూడాను. పేరు యిద్దరిదీ ఒకటే అయివుండవచ్చు. అందుకని ఈ ప్లాన్ ఫలించి ఉంటుంది "

"అలాగే జరిగి ఉంటుదన్న నమ్మకమేమిటి?"

"రాజశేఖర్ వ్యక్తిత్వం తెలిసి అలా ఊహిస్తున్నాను. మోసకారి అయిన ఒక ఆడపిల్లను ఆయన గుర్తుపట్టలేకపోవడం నిజంగా ఆయనకే మచ్చ! అటువంటి ఆడదాన్ని ఆయన ప్రేమించారంటే నిజంగా సిగ్గుపడవలసిన విషయం "

"ఒకవేళ అలాగే జరిగితే ఏంచేస్తావు?"

"ఎప్పటికీ అలా జరగదు! బాస్ అంత సులభంగా తేలిపోయే వ్యక్తికాదు " దృఢంగా అంది జూలి.

జేమ్స్ మాట్లాడలేదు నిశ్చలాకాశంవైపు చూస్తూ ఉండిపోయాడు.

## 9

మరునాడు జూలీ రాజేష్ యిచ్చిన అడ్రెస్ వెతుక్కుంటూ జ్యోతీప్రసాద్ యింటికి వెళ్ళింది. కానీ ఆ యిల్లు తాళంవేసి ఉంది. ముందురోజే ఊరికి వెళ్ళారని, పదిరోజులవరకూ రామన్నారని పక్కింటివారు చెప్పారు. ఏ ఊరని అడిగితే తెలియదన్నారు.

జూలీ నిరాశపడలేదు. తాను వెదుకుతున్నకొద్దీ దూరమవుతుంటే, అది తప్పకుండా ఫలిస్తుందని నమ్మకగలిగింది. లేకపోతే అడుగడుగునా ఈ అడ్డంకు లన్నీ ఎందుకు?

అసంతృప్తి మొహంతో తిరిగి వచ్చిన జూలీని, నవ్వుతూ అడిగాడు జేమ్స్. "ఏమయింది వెళ్ళినపని?" అని,

అప్పటిగ్గానీ, క్రితంరోజు తనని వెళ్ళకుండా ఆపిన వ్యక్తి ఎవరో గుర్తు రాలేదు. సర్రున కోపమొచ్చింది.

"నువ్వే చేసిందంతా! నిన్న వాళ్ళ యింటికి వెళదామంటే 'ఒక్కరోజులో ఏమీ మునిగిపోదులే' అని ఆపేశావు. ఇప్పుడు చూడు ఏమయిందో?"

"ఏమయింది?" తెల్లబోయి అడిగాడు.

"ఏమన్నా ఏమవుతుంది? వాళ్ళు నిన్ననే ఊరు వెళ్ళిపోయారట ! తాళంవేసి ఉంది. యింటికి పదిరోజులగ్గాని రారుట."

"హమ్మయ్య! పదిరోజులు నాకు రెస్ట్ అన్నమాట!"

అతని నెత్తిన మొట్టింది కోపంగా.

"జూలీ! ఊటీ వెళదామా ఈ పదిరోజులు?"

"ఉహుం, నేను రాను." ఇంకా కోపం దిగలేదు.

"ప్లీజ్! మళ్ళీ సంవత్సరంవరకూ అడగనుగా!"

జూలీ కోపమంతా దెబ్బకు దిగిపోయింది.

"అలాగేలే! బాస్ పర్మిషన్ తీసుకుని," అంది.

* * *

పదిరోజులగ్గానీ రానన్న రాజశేఖర్ మరునాడే దిగాడు.

"వాటీజ్ దిస్ జూలీ! యిక బెంగుళూరు రాదలచుకోలేదా? జేమ్స్‌ను చూసి బిజినెస్ అంతా మరిచిపోయావా?" అన్నాడు ప్లేన్ దిగుతూనే.

"సారీ బాస్!" సిగ్గుపడింది జూలి.




మేనేజర్ రావ్ కూడా వచ్చాడు ఏరోడ్రోమ్‌కి జేమ్స్ రాలేదు కారు తీసి బయట పెట్టాడు, రావ్, జూలీ, రాజశేఖర్ బ్యాక్‌సీట్లో కూర్చున్నారు రావ్ డ్రైవ్ చేయసాగాడు అప్పుడే అతనిని అడిగింది తనకి పదిరోజుల సెలవు కావాలని ఎందుకో ఊహించిన అతను వెంటనే గ్రాంట్ చేశాడు

కారు 'రెస్ట్‌హవుస్' ముందు ఆగుతూనే జేమ్స్ ఎదురొచ్చాడు "గుడ్మార్నింగ్ రాజా!" అంటూ

మధ్యాహ్నం లంచ్ దగ్గర చెప్పింది జూలీ, జేమ్స్‌తో, పదిరోజుల సెలవు గ్రాంట్ అయినట్లు

"జూలీ యిన్నాళ్లూ ఏం పనిమీద తిరుగుతోందో మీకైనా తెలుసా?" రాజా భోంచేస్తూ జేమ్స్‌ని అడిగాడు

"ఎందుకు తెలియదూ? ఆమె మీ " ఆగిపోయాడు జేమ్స్, జూలీ కళ్ళతో చెప్పవద్దని సైగచేసేసరికి

మధ్యలో ఆపేసరికి ఆశ్చర్యంగా తలెత్తాడు రాజశేఖర్ జూలీ వైపే చూస్తున్న జేమ్స్ దొరికిపోయాడు

"చెప్పవద్దంటోంది రాజా!" అన్నాడు పట్టుబడిపోయి

మిర్రి చూసింది జూలి నవ్వి ఊరుకున్నాడు రాజా

మరునాడే మేనేజర్ రావ్‌కి అప్పగించాల్సినవి అన్నీ అప్పగించి, జాగ్రత్త

చెప్పి ఊటీకి బయలుదేరింది జూలి జేమ్స్, హాయిగా, ఆనందంగా ఉన్నాడు, ఆమెతో హనీమూన్‌కి వెళుతున్నట్లుగా

సరిగ్గా పదిరోజులకి ఊటీనుంచి వచ్చేశారు జేమ్స్, జూలీ వచ్చినఆ సాయంత్రమే జ్యోతీప్రసాద్ యింటికి వెళ్ళాలని జూలీ తహతహ లాడింది కానీ, జేమ్స్ వారించాడు

"సరిగ్గా పది అంటే పదిరోజులకే వస్తారని నమ్మకమేముంది? ఈ ఒక్క రోజుకి వాళ్ళేం పారిపోరులే! రేపు ప్రొద్దునే వెళ్దాం సరేనా!" అని

జూలీ అసంతృప్తిగానే సమ్మతించింది

ఆ రాత్రి హోటల్ అజంతా ఎయిర్‌కండిషన్డ్‌లో భోజనంచేస్తుంటే, ఓ జంట వారి ముందుగా వెళ్ళింది పరధ్యానంగా తింటూ ఉన్న జూలీ మొదట వారిని గమనించలేదు కానీ, తమ పక్కటేబిల్ ఆక్రమించి ఉంటే చూడక తప్పలేదు

తర్వాత తెల్లబోయింది వారిలో పంజాబీ దుస్తులలో ఉన్న స్త్రీ ఎవరో తెలియదుకానీ, పక్కనున్న పురుషుడు మేనేజర్ రావ్. జూలీ మనసులో కొంచెం అసంతృప్తి వ్యాపించింది

రావ్ సిన్సియర్‌గా పనిచేసేవ్యక్తి ఈ గొడవేదో తేలిపోగానే, అతనికి, లావణ్యకు (నిజంగా లావణ్య అవునో కాదో) అమృతకు, జగన్‌కు పెళ్ళిచేసి వారి కుటుంబానికి చేతనైన సహాయం చేద్దామనుకుంది రావ్ అవివాహితుడూ, ఒంటరిగాడూ అని తెలుసు జూలీకి రావ్, లావణ్య ఒకేచోట పనిచేస్తున్నారు కాబట్టి ఒకరినొకరు అర్థంచేసుకోగలరని భావించింది లావణ్యపైన ఇప్పు డిప్పుడే సదభిప్రాయం ఏర్పడుతోం జూలీకి

"ఏమిటి? తినడం మానేసి ఆలోచనలో పడ్డావు?" జేమ్స్ అడిగాడు

ఉలిక్కిపడింది జూలి

"అహఁ, ఏంలేదు," అంది కంగారుగా

భోజనం పూర్తయిపోయాకగానీ, రావ్ వీరిని చూడలేదు చూడగా నే విష్ చేశాడు ప్రక్కనున్న స్త్రీని పరిచయంచేశాడు

"షి ఈజ్ ఆషా! మై వుడ్ బి వైఫ్," అన్నాడు చిరునవ్వుతో

"కంగ్రాచ్యులేషన్స్!" జేమ్స్ చెప్పాడు జూలీ చెప్పలేదు

"థ్యాంక్యూ సర్! మా పెళ్ళికి ఆషా తరపు పెద్దవాళ్ళు ఒప్పుకోలేదు కాబట్టి రిజిస్టర్ మారేజి చేసుకోదలచుకున్నాం సాక్షి సంతకాలు మీరే చెయ్యాలి"

"అలాగే" అన్నాడు జేమ్స్.

ఆషా, రావ్ వెళ్ళిపోయారు. కారు తీస్తున్న జేమ్స్ అంతవరకూ గమనించ లేదు, జూలీ ఏందుకో దిగాలుగా ఉండటం.

"అదేమిటి ? అలా వున్నావేం?" అన్నాడు ఆశ్చర్యంగా.

"రావ్ పెళ్ళిచేసుకుంటుంటే దిగులుకాక మరేమిటి?" అంది కారులో కూర్చుని డోర్ వేస్తూ.

తెల్లబోయాడు జేమ్స్.

"అతనికి పెళ్ళవుతే నీ కెందుకూ బాధ?" అన్నాడు.

"నాకు కాక మరెవరికి? అతని కో మంచి సంబంధం చూసిపెట్టి ఉంచాను." నిరాశగా అంది.

"నువ్వా? అతనికా? ఎవర్ని చూశావు?" తెల్లబోతూ అడిగాడు.

"ఇంకెవరు? మనకు తెలిసిన ఆవిడే!"

ఇంకా అర్థంకాలేదు జేమ్స్‌కి.

"ఎవరు?"

"లావణ్య!" నిర్వికారంగా చెప్పింది.

జేమ్స్ నవ్వు దాచుకోవడానికి అవస్థపడాల్సి వచ్చింది.

## 10

కారు ఆపి ఆ యింటిముందు దిగింది జూలి. ఆ యింటికి తాళంవేసి లేదు. తలుపులు మూసి ఉన్నాయి.

ఓసారి వాచీ చూసుకుంది. పొద్దున్నే ఏడుగంటలకి వద్దామని రెడీ అవుతే ఏదో పనుందని జేమ్స్ ఆపేశాడు. తరవాత వద్దామంటే కుదరలేదు. మద్రాస్‌లో పని అయిపోవడంతో రాజశేఖర్, మేనేజర్ రావ్, లావణ్య ఉదయం తొమ్మిది గంటలకి ప్లేన్‌లో బెంగుళూరు వెళ్ళిపోయారు. తాము మరునాడు వస్తామని చెప్పింది జూలి. ఎందుకని అడగలేదు రాజశేఖర్.

వాళ్ళని ప్లేన్ ఎక్కించి కారును జ్యోతిప్రసాద్ ఇంటివైపు తిప్పింది జూలి. కొంచెం తటపటాయించి ఆ యింటి తలుపు తట్టింది.

"ఎవరది ?" వెంటనే లోపలినుండి ఒక ఆడకంఠం వినిపించింది. మళ్ళీ తట్టింది జవాబుగా.

తలుపు తీయబడింది. ఎదురుగా కనబడుతున్న స్త్రీని పరీక్షగా చూసింది జూలి పాతికేళ్ళ పైనే వయస్సు ఉంటుంది. సామాన్య గృహిణిలా ఉంది.

చామన ఛాయగా, నుదుట ఎర్రని కుంకుమతో సాదా వాయిల్ చీరతో ఏ ప్రత్యేకతా లేకుండా ఉంది.

"ఎవరు కావాలండీ ?" ఆ స్త్రీ అడిగింది.

"జ్యోతిప్రసాద్ లేరా ?" ఆవిడ మొహంలో భావాలను జాగ్రత్తగా పరిశీలిస్తూ అడిగింది జూలి.

"లేరు !"

"ఎక్కడికి వెళ్ళారో తెలుసా ?"

"వారం పదిరోజుల నుండి కాంపులో తిరుగుతూ నిన్న రాత్రే వచ్చి ఉదయమే వెళ్ళారు మళ్ళీ !" అంది.

నిరాశపొందింది జూలి.

"మళ్ళీ ఎప్పుడు వస్తారు ?"

"తెలియదు !"

కొంచెం ఆలోచించి అడిగింది జూలి.

"ఏ ఉద్యోగం మీవారు చేసేది ?"

ఆవిడ తెల్లబోయింది. తరవాత మొహంలో కోపం కనిపించింది.

"మీరు ఇంతసేపూ మాట్లాడింది మావారు ఎక్కడ పనిచేసేదీ తెలియకనే అడిగారా ? ఇంకా మావారితో పాటు ఉద్యోగం చేస్తున్న వారనుకుంటున్నాను. భలే మంచివారే !"

జూలీ తడబడింది.

"అబ్బే అదేం లేదండి. ఇదివరకు మీవారు మా కంపెనీలో పనిచేశారు. హఠాత్తుగా రిజైనిచ్చి వెళ్ళిపోయారు. వారితో పనిఉండి వచ్చాను. దయచేసి ఆయన ఎక్కడ పనిచేసేదీ చెప్పండి. మీరు చేసిన సహాయం నే నీ జన్మలో మరచిపోలేను."

ఆవిడ కొంచెం తటపటాయించింది.

"లోపలికి రండి !" అంది చివరికి.

"కూర్చోండి!" అని చెప్పి లోగి కెళ్ళింది. అప్పటివరకూ చూడలేదు జూలి. అక్కడ ఇద్దరు పిల్లలు ఉన్నారు. ఆరేళ్ళ ఆడపిల్లా నాలుగేళ్ళ మగపిల్లాడు. ఇద్దరూ ఒకళ్ళమీద ఒకళ్ళు పడి కొట్లాడుకుంటున్నారు. ఇద్దరూ ముత్యాల్లా ఉన్నారు. జూలీ వెళ్ళి ఇద్దరినీ విడదీసింది. కుర్చీలో కూర్చుని ఇద్దర్నీ దగ్గరకు తీసుకుంటూ అడిగింది యిలా:



"చూడు పాపా ! నీ పేరేమిటి ?"

"జ్యోతి !" ఆ పిల్ల ఠకీమని జవాబు చెప్పింది.

"తమ్ముడి పేరు ?"

"నా పేరు శశి" ఆ పిల్లాడు చక్రాల్లాంటి కళ్ళు తిప్పుతూ చెప్పాడు.

"శశి కాదు, శశీంద్ర !" జ్యోతి పూర్తిచేసింది.

"మీ అమ్మ పేరు ?"

"లలిత !" జ్యోతీ, శశిబాబూ కలిసి చెప్పారు కోరస్‌లో.

"మీ నాన్నగారి పేరు ?" ఈ ప్రశ్న అడుగుతున్నప్పుడు ఎందుకో జ్యోతీ గుండెలు బరువెక్కాయి.

"ప్రసాద్ !" అన్నాడు బాబు.

"ఏంకాదు ! నాన్నగారి పేరు జ్యోతీప్రసాద్," అంది జ్యోతి.

లలిత వచ్చింది గదిలోకి. చేతిలో కాఫీ కప్పుతో. "ఏమిటి పిల్లలిద్దరూ అప్పుడే కబుర్లు చెప్పేస్తున్నారా ?" అంటూ.

"ఏంలేదు లెండి నేను అడుగుతుంటే జవాబులు చెప్తున్నారు. ఇదేమిటి ? ఇప్పుడు కాఫీ ఎందుకండీ ?" ఇబ్బందిగా అంది.

"ఫర్వాలేదు, తీసుకోండి. నేను వారి అడ్రెస్ వెదుకుతాను. సరిగ్గా గుర్తు లేదు." జూలీ చేతికి కాఫీ కప్పు యిచ్చి, బల్ల సొరుగు లాగింది లలిత డైరీ బయటికి తీసింది. అడ్రెస్ బయటికి గట్టిగా చదివింది.

"ఎ. జె. ప్రసాద్, కేరాఫ్ అజంతా ఇంపోర్ట్స్ అండ్ ఎక్స్‌పోర్ట్స్ కంపెనీ "

"ఏమన్నారు ?" కాఫీ తొణికింది జూలీకి.

"ఏ ఊర్లో మీవారు పనిచేసేది ? ఇక్కడ కాదా ?"

"కాదు,- బెంగుళూర్లో."

కాఫీ ఈసారి పూర్తిగా తొణికి, జూలీ చేతులమీదా, గౌనుమీదా పడింది.

* * *

కారు పోర్టికోలో ఆపి, పరుగులాంటి నడకతో లోపలికొచ్చింది జూలి జేమ్స్ హాల్లో సోఫాలో కూర్చుని పేపరు చదువుతున్నాడు. జూలీని చూస్తూనే నవ్వి అడిగాడు.

"ఏమయ్యాడు, నీ జ్యోతీప్రసాద్ ?"

ఒళ్ళు మండిపోయింది జూలీకి. అతన్ని విసురుగా తోసి, వీపుమీద దబదబా కొట్టింది.

"బాబోయ్ ! ఇదేమిటి ?" అతను జూలి చేతులను పట్టుకుంటూ అడిగాడు

"నువ్వు ప్రతిదానికీ పానకంలో పుడకవి. నేను మార్నింగే వెళతానంటే వద్దు అనేశావు. ఇప్పుడు అతను లేడు. ఎప్పుడు వస్తాడో, ఎక్కడ ఉన్నాడో కూడా తెలియదు !''

"నాకు తెలుసు యిలా అవుతుందని." నవ్వుతున్నాడు జేమ్స్ ఈసారి ఊడుకోక్కలేదు జూలి నవ్వుతూ చూసింది అతనివైపు.

"ఎక్కడికి పోతాడు ! అతని పిలక యిప్పుడు నా చేతిలో ఉంది !" అంది చిటికెలువేస్తూ.

"ఎక్కడ పనిచేస్తున్నాడో తెలుసుకున్నావా ? ఈ ఊళ్ళోనా లేక వేరే ఊళ్లోనా ?"

"ఈ ఊళ్ళో కాదు."

"మరెక్కడ ! మళ్ళీ ప్రయాణం తప్పదా మనకు ?"

"బెంగుళూర్లోనా ?" ఆశ్చర్యంగా అని మళ్ళీ అన్నాడు. "ఎక్కడ పనిచేసేది ?"

"చెప్పనా ?" ఊరిస్తున్నట్టుగా అడిగింది.

"చెప్పు !"

"చెప్పేస్తున్నా !"

"త్వరగా చెప్పు తల్లీ, చంపక !"

"అయితే కాచుకో ! జ్యోతిప్రసాద్ బెంగుళూర్లో పనిచేసే కంపెనీ పేరు..." ఆగింది.

జూలీ చెవి పట్టుకున్నాడు జేమ్స్.

"చెప్పమంటావా ? వదిలితే గాని చెప్పను. ముందు చెవి వదులు." అరిచింది జూలీ.

"చెపితే గానీ వదలను." మొండిగా అన్నాడు.

"అయితే చెప్పేస్తున్నా. ఆ కంపెనీ అజంతా ఇంపోర్ట్స్ అండ్ ఎక్స్పోర్ట్స్."

ఎగిరిపడ్డాడు జేమ్స్ "ఏమిటీ నిజమే ?"

"అక్షరాలా నిజం. చంకలో పిల్లిని పెట్టుకుని ఊరంతా వెదుకుతున్నాం ఇన్నాళ్ళూ."

"అయితే పద ! ఈవెనింగ్ ఫ్లయిట్‌లో వెళదాం" ఉత్సాహంగా లేచాడు.

సాయంత్రం ప్లేన్ దిగి బెంగుళూర్లో అడుగుపెట్టాకగానీ జేమ్స్‌కి, తనని వేదిస్తున్న సమస్యని జూలీతో అడిగే విషయం గుర్తురాలేదు.

"జూలీ ! రాజాతో నువ్వు లావణ్యకోసం వెదుకుతున్నావని ఎందుకు చెప్ప వద్దన్నావు ?"

"బాస్ ఇప్పటికే ఆ అమ్మాయి కనబడలేదని గాయపడి ఉన్నారు. ఆయనకి తను రైల్లో చూసిన అమ్మాయి 'మోసగత్తె' అన్న భావం నిలిచిపోయింది. మనం చేసే పరిశోధన ఆయనకి ఆనందాన్నిచ్చేదై ఉండాలి గానీ, మరింత బాధపెట్టేదిగా ఉండకూడదు. ఇంతవరకూ తెలిసింది ఈ లావణ్య ఒరిజినల్ అనే కదా ! ఈమె మోసం చేసిందని చెప్పటానికి ఆధారాలు లేవు. అందుకే చెప్పవద్దన్నాను."

మరేం మాట్లాడలేదు జేమ్స్.

జూలీ జ్యోతీప్రసాద్ గురించి ఊహిస్తూ ఉండిపోయింది.

జూలీ బెల్ నొక్కింది. మేనేజర్ రావ్ లోపలికి వచ్చాడు.

"చూడండి. మిస్టర్ రావ్ ? మన కంపెనీలో క్లర్క్ లలోనో, టైపిస్టుల్లోనో ఎ. జె ప్రసాద్ అనే వ్యక్తి ఉండాలి. మరచిపోయాను. అతన్ని ఓసారి పిలవండి. అతనికో చిన్న వార్నింగు ఇవ్వాలి ''

మరో పావుగంటకల్లా మేనేజర్ రావ్ వచ్చాడు. చేతిలో ఏదో కాగితంతో.

"సారీ మేడమ్ ! అతను వారం రోజులు సెలవుపెట్టి వెళ్ళాడు, చెల్లెలి పెళ్ళికని. ఇదిగో లీవ్ లెటర్ చూడండి."

అది తీసుకుని చదివింది జూలి. క్రింద సంతకం తర్వాత డిస్పాచ్ క్లర్క్ అని ఉంది.

'చెల్లెలి పెళ్ళి అని నాటకం ఆడతావా, రాస్కెల్ ? నీ బండారం నేను బయటపెట్టినపుడు తెలుస్తుందిలే !' కసిగా అనుకుంది మనసులో.

"ఐసీ ! మరో అయిదురోజులక్కానీ అతను రాడన్నమాట ! వచ్చిన వెంటనే నా దగ్గరికి పంపటం మరచిపోకండి." అంది పైకి.

"ఎస్ మేడమ్ !" రావ్ వెళ్ళిపోయాడు.

'ఒరేయ్ ! జ్యోతీప్రసాద్ వెధవా ! నన్నింత కష్టపెడుతున్నావ్ కదూ ? నీకు తగిన శాస్తి చేయకపోతే అడుగు' పళ్ళు కొరుక్కుంది.

ఇంటికి వెళ్ళగానే జేమ్స్ అడిగాడు.

"ఊరు వెళ్ళాడు. నాలుగు రోజులక్కాని రాడట," అంది కోపంగా. నవ్వు బలవంతాన ఆపుకున్నాడు జేమ్స్. పైకి ఏమీ అనలేదు. అంటే జూలీ ఉడుక్కుంటుందని తెలుసు.

ఆ అయిదు రోజులు ఎలా గడపాలో తెలీక జూలి బిజినెస్ వంకన జేమ్స్‌తో కలిసి హైదరాబాద్ వెళ్ళి వచ్చింది.

* * *

జూలి గుండెలు దడదడలాడుతున్నాయి ఇక కొంచెంసేపట్లో జ్యోతీ ప్రసాద్ వస్తాడు. అతనిని ఏమని అడగాలి ! 'నువ్వు ఎప్పుడైనా లావణ్య అనే అమ్మాయిచేత చెప్పుదెబ్బలు తిన్నావా ?' అని అడిగితే అతని మొహం ఎలా ఉంటుంది ? ఇంతవరకూ ఇద్దరూ ఒకేచోట పనిచేస్తూ ఒకరి నొకరు గుర్తు పట్టకుండా ఉంటారా ? ఇద్దరి ఉద్యోగాలూ అవసరార్థమైనవే కాబట్టి ఎరగనట్టు ఊరుకున్నారా? ఏమయితేనేం ఈలావణ్య నకిలీ అయినదీ అసలీ అయినదీ తేలిపోతుంది.

ఆలోచనల్లో మునిగి తేలుతున్న జూలీ, జేమ్స్ గదిలోకి రావడం గమనించ లేదు. అతను జూలీ ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చుంటుంటే అప్పుడు చూసింది.

"ఇంకా మీ జ్యోతిప్రసాద్ రాలేదా ?" నవ్వుతూ అడిగాడు జేమ్స్.

"వచ్చావుగా శకున పక్షివి ! ఇక ఎందుకు వస్తాడు ?" కోపంగా అంది.

"మే ఐ కమిన్ మేడమ్ !"

ఇద్దరూ ఉలిక్కిపడి చూశారు గుమ్మంలో సుమారు ముప్పై ఏళ్ళ వయసు గల యువకుడు ఉన్నారు. చామనఛాయగా, అమాయకంగా ఉన్నాడు.

"ఎస్ ! కమిన్," అంది జూలీ తేరుకుని.

అతను లోపలికి వచ్చి నిలబడ్డాడు.

"ఎందుకు మేడమ్ పిలిచారట !" అణకువగా అన్నాడు.

'ఆహా ! ఏమి నమ్రత ? ఏమి వినయం ? మోసగాళ్ళంతా యిలా ఉండక ఎలా ఉంటారు ?' మనసులో అనుకుంది జూలీ.

"కూర్చోండి, మిష్టర్ జ్యోతిప్రసాద్ !" అంది ఒత్తి పలుకుతూ, వ్యంగ్యంగా.

అతను ఉలిక్కిపడ్డాడు.

"సారీ మేడమ్ ! మీరు పొరపడ్డారు. నా పేరు జ్యోతిప్రసాద్‌కాదు. జయ ప్రసాద్ !" అన్నాడు.

"వాట్ నాన్‌సెన్స్ యూ ఆర్ టాకింగ్ ? నీ పేరు జ్యోతిప్రసాద్ ! నా దగ్గర నీ నాటకాలు సాగవు," అంది కోపంగా జూలి.

"మీరు పొరబడుతున్నారు మేడమ్ ! నే నేమిటి జ్యోతిప్రసాద్ నేమిటి ? కావలిస్తే నా సర్టిఫికెట్స్ తెచ్చి చూపిస్తాను." అయోమయంగా అంటున్నాడు ప్రసాద్.

తల పట్టుకు కూర్చుంది జూలి. ఆమె అవస్థ చూడలేక జేమ్స్ అతన్ని ప్రశ్నలు వేయసాగాడు.

"నువ్వు వారంరోజులు సెలవు పెట్టావు దేనికి ?"

"మా చెల్లెలి పెళ్ళికి సార్ !"

"ఎక్కడ పెళ్ళి ?"

"చిత్తూరు దగ్గర మా స్వగ్రామంలో."

"నువ్వు బి.ఎస్‌సి. ఎక్కడ చదివావు ?"

"బి.ఎస్‌సి. కాదు సార్, నేను చదివింది ! బి. ఎ. అదయినా కాలేజీలో చదవలేదు. ప్రయివేటుగా కట్టుకొని చదివాను."

"సరే నువ్వెళ్ళి నీ సర్టిఫికెట్లూ, నీవు ఇంతకుముందు పనిచేసిన వివరాలూ మీ చెల్లెలి పెళ్ళి నిజంగా అయిందా లేదా అనేదానికి రుజువూ తీసుకురా !"

"అలాగే సర్ !" తలవూపి వెళ్ళిపోయాడు ప్రసాద్

అతన్ని మళ్ళీ పిలిచాడు జేమ్స్

"చూడు ! మేము నిన్నిలా అడిగిన సంగతి ఎవరికీ చెప్పకు !"

నిజంగా జ్యోతీప్రసాద్ ఉంటే తప్పించుకుంటాడని అలా చెప్పాడు జేమ్స్. ప్రసాద్ వెళ్ళిపోయాక జేమ్స్ జూలీవైపు చూడలేకపోయాడు దాదాపు కళ్ళ నీళ్ళపర్యంతగా ఉంది జూలి

* * *

ఎ. జె ప్రసాద్ జ్యోతీప్రసాద్ కాదని, నిజంగా జయప్రసాదేనని ఖచ్చితంగా తేలిపోయింది జూలీ పొందిన నిరాశ వర్ణనాతీతం

ఒకవేళ ఈ కంపెనీలో ఎ జె ప్రసాద్ అనే వ్యక్తి ఉన్నాడని ఈ అడ్రెస్ యిచ్చి, ఇతని ద్వారా ఉత్తరాలూ, వగైరా అందుకుంటున్నాడేమో అని అనుమానం తగిలింది యిద్దరికీ కానీ అదీ నిరాధారమని తేలిపోయింది

"బాధపడకు జూలీ ! అతను మన కంపెనీలోనే ఉండి ఉండాలి ! వెతుకుదాం ఓక్కడికి పోతాడు ? ఈ విషయం మనం ఎవరికీ తెలియనివ్వలేదుగా !"

ఓదారుస్తూ అన్నాడు జేమ్స్

"దొరక్క ఎక్కడికి పోతాడు ? ఖచ్చితంగా పట్టుకుని తీరతాను అసలు యిదంతా చూస్తుంటే నాకో అనుమానం కలుగుతోంది నీకా జ్యోతీప్రసాద్ ఎవరో తెలిసి ఉండాలి ! అందుకే ప్రతిసారీ అతన్ని తప్పించి తమాషా చూస్తున్నావు ?"

తెల్లబోయాడు జేమ్స్

"ఇంకా నయం ! నన్నే జ్యోతీప్రసాద్ అన్నావు కావు " నవ్వుతూ అన్నాడు

"ఎందుకు కాకూడదు ?"

"హమ్మబాబోయ్ ! కథ అడ్డం తిరిగిందేమిటి ?"

మేనేజర్ రావ్‌ని పిలిపించింది జూలీ

"చూడండి మిష్టర్ రావ్ ! మీరు మరో గంటకల్లా మన కంపెనీలో పనిచేసే వ్యక్తుల, చివరికి వాచ్‌మెన్ దగ్గరనుంచీ అందరి సర్టిఫికెట్స్, వివరాలు నాకు తెచ్చి ఇవ్వండి ! నేను చూడాలి !"

"ఓ.కే. మేడమ్!"

రావ్ వెళ్ళిపోయాడు. జూలీ అలాగే కూర్చుండిపోయింది. ఏమైనా ఈ విషయం తేలేవరకూ రానని చెప్పి, జేమ్సును పంపించేసింది.

* * *

## 12

రాత్రి తొమ్మిది గంటలు కావస్తోంది.

బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంది జూలి. అప్పటికి అందరి వివరాలూ, పుట్టు పూర్వోత్తరాలూ చూడటం అయిపోయింది. ఎ. జ్యోతీప్రసాద్ అనే వ్యక్తి ఉన్న జాడలేదు. ఎ. జయప్రసాద్ తప్పితే. అతను ఎంతమాత్రం ఈ విషయాలతో సంబంధం ఉన్న వ్యక్తి కాడని స్పష్టంగా తేలిపోయింది.

'రాస్కెల్! ఎంత మోసం చేశాడు. ఇక్కడ ఎ.జె. ప్రసాద్ అనే వ్యక్తి ఉన్నాడని తెలిసి ఈ అడ్రెస్ ఇచ్చి ఉంటాడు. ఎలాగైనా ఈ జ్యోతీప్రసాద్‌ని పట్టుకు తీరాలి.' కసిగా పళ్ళు నూరుకుంది జూలి బెల్ నొక్కింది.

మేనేజర్ రావ్ లోపలికి వచ్చాడు.

"చూడండి మిష్టర్ రావ్! ఇవన్నీ రేపు ప్రొద్దున్నే ఎవరివి వారికిచ్చేయండి. అంతా వెళ్ళిపోయారా? ఇంకా ఎవరైనా ఉన్నారా?"

"లావణ్య ఉన్నారు మేడం! అర్జెంట్ ఫైల్స్ చూస్తున్నారు."

"ఓ. కే. నేను వెళ్ళి కారు పంపిస్తాను. తరవాత ఆవిడని డ్రాప్‌చేసి మీరు వెళ్ళిపోండి." లేచింది జూలి.

"మేడమ్!"

ఏమిటన్నట్లు చూసింది. అతనేదో చెప్పాలని తటపటాయిస్తున్నాడు.

"ఏమిటి, చెప్పండి?"

"రేపు ఆషా, నేనూ రిజిష్టర్ మ్యారేజ్ చేసుకుంటున్నాం. పదిహేనురోజులు లీవ్ గ్రాంట్ చేయాలి!" అతను సిగ్గుపడుతున్నట్టు మొహంపెట్టాడు.

"అలాగే! దానికేముంది?" ముందుకు నడవబోయింది.

"మరొక్క సహాయం చేయాలి మేడం! ఆషాకి మన కంపెనీలోనే ఉద్యోగం యిప్పించేటట్లు చూడాలి!" అర్థిస్తున్నట్లు అన్నాడు.

"అలాగే చూద్దాంలెండి."

మెట్లు దిగి పోర్టికోలో అడుగుపెట్టింది. డ్రైవర్ డోర్‌తెరచి పట్టుకు నిల్చున్నాడు. రావ్ నిలబడి ఉన్నాడు.

జూలీ కారు ఎక్కుతూ అంది

"మిస్టర్ రావ్ ! మీరు వెళ్ళి లావణ్యతో చెప్పండి రేపు ప్రొద్దున్నే మా యింటికి రమ్మన్నానని."

"అలాగే మేడమ్ !" రావ్ గబగబా వెళ్ళి మెట్లెక్కి మేడమీదకు వెళ్ళాడు. జూలీ అలాగే చూసింది. అతను మెట్లెక్కేవరకూ. 'తను ఇక లావణ్యని అడగక తప్పదు. ఈ సస్పెన్స్ భరించక తప్పదంలేదు. ఇక విడగొట్టాలి.' డ్రైవరు సీట్లో కూచుని స్టార్ట్ చేశాడు.

జూలీ ఠక్కున డోర్ తెరుచుకుని దిగింది.

"చూడూ, నువ్వు యింటికి వెళ్ళి అరగంటకి రా !" టకటకమని మెట్లెక్కి వెళ్ళింది లోపలికి.

డ్రైవరు తెల్లబోయి చూసి, స్టార్టుచేసి వెళ్ళిపోయాడు.

* * *

జూలీకి మతిపోతున్నట్లుగా ఉంది.

"ఇదేమిటి ? ఇలా అడ్డం తిరిగింది కథ ! తను చూస్తున్నది నిజమేనా ? సర్టిఫికెట్స్ నవ్వుతున్నాయి జూలీని చూసి. ఇవి తన దగ్గరే ఉండటం ఎంత మంచిదయింది !" తన తెలివితేటలు ఎంతవరకు పనిచేశాయో అర్థమయింది జూలీకి.

మేడమీద ఏదో దభీమని పడ్డ చప్పుడు. ఉలిక్కిపడి బయటకు వచ్చి, రెండడుగుల చొప్పున ఓ మెట్టెక్కుతూ మేడ ఎక్కింది.

ఎదురుగా జరుగుతున్న దృశ్యాన్ని చూసి కళ్ళు తిరిగాయి జూలీకి.

లావణ్య మేనేజరు రావ్‌ని చెప్పుతో ఎడాపెడా బాదుతోంది, ఒకచేత్తో కాలరు పట్టుకుని.

గట్టిగా చప్పట్లు కొట్టింది జూలి.

"వెల్‌డన్ మిస్టర్ జ్యోతిప్రసాద్ రావ్ ! వెల్‌డన్ మిస్ లావణ్యా ! రెండవ సారి కూడా చెప్పుతోనే సత్కరించినందుకు.

జూలీని చూస్తూనే చెప్పు క్రిందపడేసి, కాలర్ వదిలేసింది లావణ్య. ఆమెను చూస్తూనే ఒక్క ఉదుటున మెట్లుదిగి వెళ్ళిపోయాడు రావ్.

"వెళ్ళిపోయాడు, వెధవ రాస్కెల్ !" పళ్ళు కొరికింది లావణ్య.

"ఎక్కడికి పోతాడు ? రేపీపాటికల్లా కటకటాల వెనక కూర్చోబెట్టనూ ? ఉన్న భార్యాబిడ్డలు చాలక మళ్ళీ రేపు పెళ్ళి చేసుకుంటున్నాడట ! పెళ్ళి ! ఇడియట్ !"

"ఆఁ, అవును గానీ లావణ్యా! నువ్వు కాలేజీలో చదువుకునే రోజుల్లో కూడా వీడిని చెప్పుతో కొట్టావ్ కదూ?"

"నేనా? ఈ రావ్‌నా?" అనేసి నాలికొర్కుకుంది లావణ్య.

చప్పున దొరికిపోయింది జూలీకి.

*　　　　*　　　　*

రాజశేఖర్, జేమ్స్, జూలీ, లావణ్య కూర్చున్నారు గుండ్రంగా.

"చెప్పు లావణ్యా! నీ కెటువంటి ప్రమాదమూ రాదని నేను మాట ఇస్తున్నాను కదా! ఇది మరోరకంగా చూస్తే ఎటువంటి నేరమో తెలుసా?" జూలీ అంది.

"అవును నిజమైన లావణ్య ఎక్కడున్నా సరే, ఆమెను మేము బలవంత పెట్టి తీసుకురాము. మాకు కావలసిందల్లా మీరిద్దరూ ఎలా మార్పు చెందారా అనేదే?" జేమ్స్ అన్నాడు.

లావణ్య చాలా సేపు తటపటాయిస్తూ కూర్చుంది.

"చెప్పడానికి నాకేం అభ్యంతరం లేదుగానీ, ఎటువంటి పరిస్థితులలోనూ తన గురించి తెలియనివ్వనని నేను లావణ్యకు ప్రమాణం చేశాను."

ఇది ఆమెకు చెరుపు కలిగించేదైతేనే ఆ ప్రమాణం వర్తిస్తుంది. కానీ మేమంతా ఆమె శ్రేయోభిలాషులమే ఆమెకి మంచి చేయాలనేదే మా ప్రయత్నమంతా! నువ్వేం తటపటాయించవలసింది గానీ, సందేహించవలసింది గానీ యిందులో ఏమీలేదు. చెప్పు లావణ్యా!" అంది జూలీ

ఆ లావణ్యని యిదివరకు రాజశేఖర్ చూశాడనే చెప్పిందిగానీ, అతను ఆమెను పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాడని చెప్పలేదు. ముందు లావణ్య ఉనికి తెలుసుకుని, ఆమెను చూడాలని జూలీకి మహా ఆతృతగా ఉంది.

గొంతు సవరించి మొదలుపెట్టింది లావణ్య.

"ఎలా మొదలుపెట్టాలో, ఎలా చెప్పాలో నాకు తెలియడంలేదు కానీ మొదట నేను ఉద్యోగం చేయవలసిన అవసరం గురించి చెప్పితే బాగుంటుంది మా కుటుంబానికి పెద్ద మా అన్నయ్య. నాన్న ఎలా ఉంటారో నాకు తెలీదు. నా చిన్నప్పుడే ఆయన పోయారు. నేను మామూలుగా బి. ఎస్‌సి. చదువుకున్నాను. కాని ఉద్యోగం చేయాలన్న తలంపు నాకు లేదు. నా చదువు అవగానే అన్నయ్య యాక్సిడెంటులో చచ్చిపోవడం షాక్ తగిలినట్లయింది, మా కందరికీ. అమ్మకి అప్పటికే చత్వారం వచ్చేసి కళ్ళు కనబడేవికావు.

వదినకి మతి స్థిరం తప్పింది. అన్నయ్యకి ఇద్దరు పిల్లలు. నా కప్పటికే పెళ్ళి నిశ్చయమైంది. కానీ ఎలా చేసుకోను? అందుకే బాధ్యత నా నెత్తిన వేసుకున్నాను. నాకు టైపూ, షార్ట్‌హాండూ వచ్చు. గవర్నమెంటు ఉద్యోగం వచ్చే సూచనలు లేక ప్రయివేటు కంపెనీలో పనిచేశాను. నాకొచ్చే జీతం ఎంతమాత్రం చాలేది కాదు. అన్నయ్యకొచ్చిన డబ్బంతా బ్యాంకులో వేశాను. అది వాడుకో సాగాను. అదంతా కర్పూరహారతిలా తరిగిపోసాగింది. ఇంతలో ఏదో ఒక గవర్నమెంటు ఉద్యోగం రాకపోదా అని ఆశతో ఎదురు చూసేదాన్ని. ఉద్యోగం రావడం మాట అటుంచి, ఉన్న ఉద్యోగం ఊడింది. వెంటనే ఉద్యోగం దొరక్క నేను ఎన్ని బాధలు పడ్డానో ఆ దేవుడికే తెలియాలి. అప్పుడే బెంగుళూరు నుంచి ఇంటర్వ్యూ వచ్చింది. కొండంత ఆశతో బయలు దేరాను. ఎలాగైనా సరే కాళ్ళా వేళ్ళాబడి ఆ ఉద్యోగం పొందాలి అనుకున్నాను. తీరా ఇక్కడికి వచ్చేసరికి చెప్పలేనంత ఆశాభంగం కలిగింది. మేనేజర్ రావ్ ఐమీన్ జ్యోతిప్రసాద్ రావు ఎవరితోనో అంటూండగా విన్నాను.

ఉద్యోగానికి అంతా గ్రాడ్యుయేట్స్ వచ్చారని, ఎవరికివ్వాలో తెలియక ఓనర్‌గారు అంటే రాజశేఖర్‌గారు లాటరీ తీశారని, అందులో లావణ్య అనే అమ్మాయికి ఉద్యోగం వచ్చిందని చెప్పారు. ఇంటర్వ్యూకి వచ్చిన అమ్మాయిలంతా గుసగుస లాడుకుంటున్నారు. 'లావణ్య ఎవరు? లావణ్య ఎవరు?' అని." ఆగింది లావణ్య ఊపిరి పీల్చుకోడానికి.

"నిజంగా మీరు లాటరీ తీశారా రాజా?" జేమ్సు అడిగాడు.

"ఛ! ఛ! లేదు. నేను అప్పుడే నీకు చెప్పానుగదా? ఈ ఉద్యోగం లావణ్యకివమని చెప్పారని. ఆంటర్వ్యూ గొడవన్నీ రావ్ చూసుకుంటున్నాడు. మనం 'లావణ్య' అనే అమ్మాయికి ఉద్యోగం యిస్తే, అతను ఏ రికమండేషనో అని అపార్థం చేసుకుంటాడని అలా చెప్పాను." జూలీ అంది.

తిరిగి లావణ్య మొదలెట్టింది.

"ఎలా అయితేనేం లావణ్య అనే అమ్మాయికి ఉద్యోగం యిచ్చేస్తున్నారని తెలిసి, చాలామంది ఇంటర్వ్యూకి ఉండకుండా వెళ్ళిపోయారు. కొందరు ఆశతో అలాగే ఉన్నారు. నాకు నిరాశా నిస్పృహలతో కళ్ళు తిరిగినట్లయింది. మెల్లగా నడుచుకుంటూ ముందు తోటలోకి వెళ్ళాను. అప్పుడే చూశాను లావణ్యని. కాశీరత్నం తీగ అల్లబడిన పందిరిక్రింద దిగులుగా కూర్చుని ఉంది. నాలాటి అభాగ్యురాలే అయి ఉంటుంది అనుకున్నాను. మెల్లగా వెళ్ళి ఆమె దగ్గర కూర్చు

న్నాను. ఆశ్చర్యంగా చూశాను ఆమె వైపు ఎందుకంటే ఆమె ఏడుస్తోంది. నన్ను చూడగానే గబగబా కళ్లు తుడుచుకుంది నాకు జాలివేసింది నాకూ ఈ ఉద్యోగం రావడంలేదు కానీ నేను ఏడవాల్సినంత బాధ కలగలేదు నా కంటే ఈమె ఎక్కువ కష్టాల్లో ఉండి ఉంటుంది అనుకున్నాను అందుకే ఓదార్పుగా నాలుగు మాటలు చెప్పాను

'ఏమిటండీ మీరు ? వెధవ ఉద్యోగం రాకపోతే పోయింది, మనకేం డిగ్రీ ల్లేవా ? అర్హత లేదా ? ఎలాగోలా ఉద్యోగం వస్తుంది, దీని తాతలాంటిది ! దీనికోసం యింత బాధపడుతున్నారేమిటి ? లావణ్య ఎవరో అదృష్టవంతురాలు ఏం చేస్తాం ! అందరికీ ఆ అదృష్టం రావద్దూ' అన్నాను "

ఆమె నవ్వింది

"నేను ఏడుస్తోంది ఉద్యోగం రానందుకు కాదు !" అంది

ఆశ్చర్యపోయి "మరెందుకు ?" అన్నాను

"ఉద్యోగం వచ్చినందుకు," అంది

షాక్ తిన్నాను

"అయితే ఆ లావణ్య " అన్నా సంధిగ్ధంగా

"నేనే ? ఆ లాటరీలో ఖర్మగాలి నేనే వచ్చానా ?"

"మీకీ ఉద్యోగం అవసరం లేదా ?"

"ఉద్యోగం నాకు చాలా అవసరం కానీ ఇక్కడమటుకు చేయలేను, నన్ను వేటాడుతున్న "షికారీ" ఉన్నాడిక్కడ ?"

నాకు అర్థం కాలేదు

"మరైతే ఇప్పుడేం చేస్తారు మీరు ? ఇంటికి వెళ్ళిపోతారా ?"

"శాశ్వతంగా యింటికి వెళ్ళిపోతాను," అంది శూన్యంలోకి చూస్తూ అంత లోనే నా వైపు తిరిగి "మీకీ ఉద్యోగం అవసరమా ?" అంది

"చచ్చేంత అవసరం ఇది రాకపోతే ఆత్మహత్య చేసుకోవాలి ?" దిగులుగా అన్నాను నాకు మనసులో చెప్పలేనంత కలవరంగా ఉంది

"మీకు ఎవరైనా ఉన్నారా ?" అని అడిగింది

మా కుటుంబం పరిస్థితంతా వివరంగా చెప్పాను అంతా విని "మీ మీద ఆధారపడి అంతమంది ఉన్నప్పుడు మీరు చచ్చిపోవాలనుకోవడం పిరికితనం ఓ పని చేయండి, మీకు ఉద్యోగం కావాలి ! నాకు అవసరంలేదు అందుకని మీరు నా సర్టిఫికెట్స్ అవీ తీసుకుని మీరే లావణ్య అని చెప్పి ఉద్యోగంలో చేరిపోండి,'' అంది తేలిగ్గా

నేను బి త్తరపోయాను

"మై గాడ్ ! మీరు తెలిసే మాట్లాడుతున్నారా ? ఇది ఎవరికైనా తెలిసిందంటే మీరూ, నేనూ వెళ్ళి జైల్లో కూర్చుంటాం," అన్నాను కంగారుగా

"మీరు ఎంతమాత్రం భయపడనవసరంలేదు మనం యిద్దరం ఆంధ్రులమే ! ఇది బెంగుళూరు, మన గురించి ఎవరికీ తెలిసే ప్రమాదంలేదు ఒక వేళ మీ గురించి తెలిసినా ఎంక్వైరీ చేస్తే చెప్పడానికి మీ యింట్లో ఎవరూ లేరు ఇక నా గురించి ఎంక్వైరీ చేశారంటే అసలు నేను ఉంటేగా దొరకడానికి ?" అంది

నేను భయపడ్డాను

"మీకేమైనా మతిపోయిందా ? మీరు మీ సర్టిఫికెట్లు ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నా తీసుకోడానికి నేను సిద్ధంగా లేను ఉద్యోగం లేకపోతే పస్తులైనా ఉంటాగానీ ఇలాంటి అవకతవక పని నే చెయ్యను తరవాత వచ్చే విపరీత పరిస్థితులను నేను ఎదుర్కోనూలేను" అన్నా నిష్కర్షగా

నా వైపు నిదానంగా చూసింది

"సరే మీ యిష్టం ! ఇందులో నే బలవంత పెట్టేదేమీలేదు నేనెలాగూ చచ్చిపోవాలని నిర్ణయించుకున్నాను ఆ పని చేసేముందు, ఒక మంచిపని చేద్దామంటే కుదరటంలేదు నా సర్టిఫికెట్సు మీ కవసరం లేదంటే ఇప్పుడే చింపేస్తాను" అని పర్సు తెరవసాగింది

నేను కంగారుగా ఆమె చేయిపట్టుకొని ఆపాను

"ఏమిటండీ యిది ? మీరు నిజంగా ఆత్మహత్య చేసుకుందా మనుకుంటున్నారా ?" అన్నాను

"అవును ! ఇక నాకు బ్రతకాలని ఎంతమాత్రమూ లేదు నా గురించి మీరు దిగులుపడకండి నా సర్టిఫికెట్స్ మీరు తీసుకోండి దయచేసి నన్నెవ్వరూ బ్రతికించలేరు మీ కక్కర లేదంటే ఇవి చింపిపారేసి, నా దారి నేను చూసుకుంటాను '' అంది ఖచ్చితంగా

"ఆగండి ! అన్నా నన్ను కొంచెం ఆలోచించుకోనివ్వండి "

నేను దీర్ఘంగా ఆలోచించాను నాకు ఉద్యోగం చాలా అవసరం ఆమెకి అవసరంలేదు ఆమె చచ్చిపోబోతోంది ఈ సర్టిఫికెట్స్ నే తీసుకుని నేను ఉద్యోగం సంపాదించడమే కాకుండా లావణ్యాని ఆత్మహత్య బారినుండి తప్పించవచ్చు



ఇలా జరిగింది మా మార్పిడి సాధారణంగా లోకంలో యిది అరుదు కాబట్టి ఎవరూ మా గురించి ఆరాతీయరనుకున్నాం లావణ్యని ఎంతో ప్రయత్నంమీద ఒప్పించి, ఆమెను చావునుంచి కాపాడాను

లావణ్యని నేను తన గతజీవితం గురించి చెప్పమని ఎప్పుడూ బలవంత పెట్టలేదు అసలా ప్రసక్తె రాలేదు మా మధ్య తన డైరీలోంచి ఒక ఉత్తరం పడిపోతే అది నేను తీసి పర్సులో పెట్టుకున్నాను అది ఉందా లేదా అని నేనెప్పుడూ ఆలోచించలేదు దాని విషయమె మర్చిపోయాను కానీ ఆ సామాన్యమైన ఉత్తరమె ఇలా మమ్మల్ని బయటపెట్టేది అవుతుందని ఎన్నడూ అనుకోలేదు అసలు ఆ ఉత్తరంలోని జ్యోతిప్రసాదే ఈ రావ్ అని నేనెప్పుడూ అనుకోలేదు ఈ రావ్‌ని చూసే లావణ్య భయపడి, అతనివద్ద స్టెనోగా చేయడానికి

నిరాకరించిందని నాకు తెలీదు ఇప్పు డర్థమవుతోంది రావ్ దగ్గరికివెళ్ళి 'నే నే లావణ్యని' అని చెప్తే అతనెంత నిరాశపొందిందీ నేను కళ్ళారా చూశాను మీరా లావణ్య అంటే' అని ఆశాభంగం పొందిన అతని మొహం నాకు బాగాగుర్తుంది ఎస్ లావణ్య అంటే అతను లోగడ తనకి చెప్పు దెబ్బలతో సత్కారం చేసిన లావణ్యే అనుకుని ఉంటాడు ఆ నిరాశలో అతను నా సర్టిఫికెట్స్ సరిగ్గా చూడ లేదు చూసివుంటే గనుక అప్పుడే నా బండారం బయటపడి ఉండేది

అంతా దిగ్భ్రమతో వింటున్నారు

"అసలు నా గురించి ఎంక్వైరీ చేస్తున్నారని నాకు పొరపాటునైనా అనుమానం రాలేదు జూలీగారు ఇంత శ్రమపడేకంటే నన్ను ఒక్కమాట అడిగి ఉంటే ధైర్యంగా చెప్పేసేదాన్ని లావణ్య శ్రేయస్సుకన్నా నా క్కావల్సిం దేముంది ?"

రెండు క్షణాలు నిశ్శబ్దం ఆవరించింది దాన్ని ఛీలుస్తూ అడిగాడు జేమ్స్ "ఇంతకీ అసలుమాట అడగడమే మరచిపోయాం ! మీ పేరుకూడా 'లావణ్య' యేనా ?"

"కాదు" అడ్డంగా తలాడించింది

"మరి ?" ఆసక్తిగా చూశారంతా

"నా పేరు......అమృత !"

## 13

కారు ఆపి గబగబా దిగింది జూలి వెనుక డోర్ తెరుచుకుని అమృతా, రాజశేఖర్ దిగారు జేమ్స్ ఆతృత పడకుండా నిదానంగా దిగాడు

అప్పటికే ఇంటిదగ్గరికి పరిగెత్తిన జూలి స్తబ్ధురాలై నిలబడిపోయింది తలుపుకు వేయబడిన తాళంచూసి

"ఇదేమిటి ? ఎక్కడికి వెళ్ళారు వీళ్ళు ?" కంగారుగా అడిగింది అమృత

జూలీ పలకలేదు తెల్లబోయి చూస్తున్నారు రాజశేఖర్, జేమ్సు

"పక్కింట్లో అడిగివస్తాను" పరిగెత్తింది అమృత తలుపు దడదడా బాదే సరికి లావుపాటి ఒకావిడ వచ్చి అమృతను చూసి తెల్లబోయింది "ఇదేమిటమ్మా లావణ్యా ? నీకు సీరియస్‌గా ఉందని టెలిగ్రాం వస్తే అమృత పిల్లల్ని అందర్నీ తీసుకుని బయలుదేరింది । నువ్వేమో ఇలా వచ్చావేమిటి ?"

కళ్ళు తిరుగుతున్నట్లయ్యింది అమృతకు

ఆవిడ ఇంకా ఏమిటో అంటున్నా వినిపించుకోలేదు నీరసంగా వారి దగ్గరకు వచ్చింది విషయం విని తెల్లబోయారంతా

"ఇది తప్పకుండా జ్యోతీప్రసాద్ పనే అయిఉంటుంది!" అన్నాడు జేమ్సు.

"నీవు ఇక్కడ వుంటున్నట్లు ఎప్పుడైనా అతనితో చెప్పావా అమృతా ?" జూలీ అడిగింది

"మాటల మధ్యలో చెప్పే ఉంటాను అతన్ని ఆవేశంలో కొట్టానే గానీ, ఇంతపని చేస్తాడని ఊహించలేదు అతను లావణ్యని చూశాక ఏదైనా అపకారం తలపెడితే " అమృత గొంతు బొంగురుపోయింది

నలుగురి మనసుల్లోనూ అదే భావం సుడులుతిరుగుతోంది గుడ్డి తల్లీ, పిచ్చి వదినా, లోకం తెలియని పసిపిల్లలూ, అమాయకురాలైనా లావణ్యా ఏమైపోయినా తను బ్రతగ్గలదా ? కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి అమృతకు

"అధైర్యపడకు అమృతా !" జేమ్సు అన్నాడు.

ఏ ముహూర్తంలో త నీ వేట మొదలుపెట్టిందోగానీ అన్నీ అవాంతరాలే ! అనుకుంటోంది జూలీ,

మిట్ట మధ్యాహ్నం భోజనాలవేళ ఆకలి చచ్చిపోయింది అందరికీ "టెలిగ్రాం ఏ వూరికి రమ్మని వచ్చిందో కనుక్కో అమృతా !" అన్నాడు రాజా "నిజమే వీళ్ళు బెంగుళూరికి వెళ్ళి ఉండరు అంత తెలివితక్కువవాడు కాదు రావ్ " జేమ్స్ అన్నాడు

"మద్రాస్‌కి రమ్మని ఇచ్చాడేమో ! ఒకవేళ వాళ్ళ యింటిలో దించుదామనుకున్నాడేమో ? అతని భార్య లలిత చాలా మంచిది జేమ్స్," అంది జూలి

అమృతకు మనసులో ఆశ చిగురించి పక్కింటివైపు పరిగెత్తింది పక్కింటావిడ మద్రాస్‌కే వెళ్ళారని చెప్పింది

ఆ మాట వినగానే నలుగురూ మద్రాస్‌కు బయలుదేరారు ఎంతో ఉత్సాహంగా వచ్చినవారికి అంతులేని నిరాశ ఎదురవటంతో దారిలో ఏ ఒక్కరూ మాట్లాడుకోలేదు. మద్రాస్ చేరేవరకూ నిర్లిప్తంగానే ఉండిపోయారు రాజశేఖర్ జేమ్సు మార్చుకొని డ్రైవ్ చేశారు మద్రాసు చేరేసరికి సాయంత్రం ఏడు కావస్తోంది

సిటీలోకి రాగానే డ్రైవింగ్ సీటు తాను తీసుకుంది జూలి తనకు రావ్ ఇల్లు తెలుసు కాబట్టి వేగంగా డ్రైవ్ చేయసాగింది. వేగం తరిగేకొద్దీ జూలీ గుండెలు దడదడ లాడసాగాయి లావణ్యకి ఏమైనా అయిఉంటే, ఎంతో ఆశతో తను చేసిన ప్రయత్నాలన్నీ బూడిదలో పోసిన పన్నీరవుతాయి

*        *        *

కానీ జూలీ బృందానికి రావ్ ఇంటి దగ్గర ఆశాభంగమే ఎదురయింది. అతను పదిరోజులుగా జాడేలేదని లలిత చెప్పింది అమె మాటలతీరు చూస్తూంటే ఆమె అబద్ధం చెబుతోందన్న నమ్మకం కలుగలేదెవ్వరికి

"లావణ్య సీరియస్, అనికదా టెలిగ్రాం వచ్చింది! మనకోసం ఏదైనా హాస్పిటల్‌కు వెళ్లారేమో వెదుకుదాం!" అన్నాడు రాజా

అతనికి లావణ్య జాడ తెలిసిందన్న ఆనందం, ఆమె ఆపదలో చిక్కుకుందని తెలియగానే కర్పూరంలా ఆవిరయింది భగవంతుడంటే నమ్మకం లేని అతను,' మొదటిసారిగా లావణ్య కే ఆపదా రాకుండా చూడమని దేవుణ్ణి మనసారా ప్రార్థిస్తున్నాడు

రాజశేఖర్ మాటప్రకారమే ఆవేళంతా అన్ని హాస్పిటల్సూ గాలించారు. ఎక్కడా వారి ఆచూకీ తెలియలేదు చేసేదిలేక జ్యోతిప్రసాద్ రావ్‌ని ఎక్కడున్నాసరే పట్టుకోమని పోలీస్ రిపోర్టు యిచ్చాడు

"ఇక్కడుండి చేసేదేముంది? బెంగుళూరు వెళ్ళుదాం!" అంది జూలి. చేసేది లేక అంతా ప్లేన్‌లో బెంగుళూరు వచ్చేశారు మరునాడు అందరికీ మనసుల్లో దిగులుగా ఉంది

బెంగుళూర్లో అడుగుపెట్టారో లేదో జ్యోతిప్రసాద్ అతని ప్రియురాలు ఆషాతో సహా పట్టుబడ్డాడని తెలిసి ఒక్క పరుగులో మద్రాస్ వెళదామన్న ఆవేశం కలిగింది అందరికీ. తిరుగు ప్లేన్‌లోనే మద్రాస్ వచ్చేసి, సరాసరి పోలీస్ స్టేషన్‌లో పడ్డారు

తన భర్త అరెస్టయ్యాడని తెలిసి, లలిత శోకాలుపెడుతూ వచ్చింది ఆమె దుఃఖం చూడలేకపోయింది జూలి కానీ ఏంచేయగలదు? ఎన్నిసార్లు అడిగినా తనకు లావణ్య వివరాలు తెలియదనే అన్నాడు

"ఈ లావణ్య నన్ను కొట్టగానే నాకు ప్రతీకారం తీర్చుకుందామన్న కసి రేగినమాట నిజమే! దానికితోడు జూలి చప్పట్లు కొడుతూ 'రెండవసారి కొట్టావు' అన్న మాట వినగానే అనుమానం వచ్చింది ఇంతకుముందు లావణ్య చేత చెప్పుదెబ్బలు తిని అవమానం పొందిన నా గుండెల్లో ఆ అవమానాగ్ని ఇంకా మండుతూనే ఉంది దానికితోడు ఈ లావణ్య చేసిన అవమానం దానిపై ఆజ్యం పోసినట్లయింది ఆ లావణ్య, ఈ లావణ్యకు తెలిసి ఉంటుందేమో అన్న అనుమానం తగిలి, ఈవిడకి ఆక్సిడెంట్ అయినట్లు టెలిగ్రాం యిచ్చాను. వారిలో లావణ్య ఉంటుందని నాకు నమ్మకం లేదు. నా ఊహ మాత్రమే.

వారి కుటుంబాన్ని కొంతకాలం దాచిపెట్టి ఏడిపిద్దా మనుకున్నాను ఆ ఉద్దేశం తోనే ఆషాను స్టేషన్‌కి పంపించాను అన్ని రైళ్లూ వెదికాము కానీ వారి కుటుంబాన్ని ఎట్లా గుర్తుపట్టగలము? వారిలో ఎవరున్నారో కూడా మాకు తెలియదు అనాధలుగా దిగితే మోసంచేసి తీసుకుపోదా మనుకున్నాను ఈ లావణ్య (అమృత) కుటుంబానికి మొగదిక్కు లేదన్న సంగతి నాకు తెలుసు!" అని చెప్పాడు జ్యోతిప్రసాద్ నిష్కర్షగా

అంతా నిర్వికారంగా వింటూ ఉండిపోయారు అతన్ని హింసించి చెప్పించ గలమంటే, పోలీసు అధికారులని వారించారు జ్యోతిప్రసాద్ ఆ మాత్రము చెప్పగలగటమే నిజంగా అదృష్టం తమ ఆదుర్దాలో తాము అతన్ని అనుమా నించారేగానీ, లావణ్య అమృత ఇంట్లో ఉంటున్న సంగతి అతనికెలా తెలుసు అలా అని అతను నిజంగా నిర్దోషే అని చెప్పడానికీ ఆధారాలు లేవు లావణ్యానీ అమృత కుటుంబాన్నీ ఎక్కడైనా దాచిపెట్టి ఇలా నాటకమాడుతున్నాడేమో?

లలిత పడుతున్న వేదన చూసి అందిరికీ బాధ కలిగింది ఆమె కన్నీరు మున్నీరుగా ఏడుస్తూ జ్యోతిప్రసాద్ కాళ్ళమీద పడి బ్రతిమాలివేడుకుంది

"ఏమండీ! మీరు యిన్నాళ్ళూ ఎంతప్పులు చేసినా క్షమిస్తూ వచ్చాను నా పిల్లల్ని చూసుకుని బ్రతుకుతున్నాను వారికి అన్యాయం చేయకండి మీరే నాకు ఆధారం దయచేసి వాళ్ళకి నిజం చెప్పేయండి"

"నేను చెప్పేది నిజం లలితా! నా పిల్లలమీద ప్రమాణంచేసి చెబుతున్నాను. వాళ్లెక్కడున్నారో నిజంగా నాకు తెలీదు ఎంత దుర్మార్గుడినైనా పిల్లలంటే ప్రేమ ఉంటుంది లలితా! అది నమ్ము"

ఆ మాటలు విన్నాక ఎవరికీ ఏంచేయడానికీ తోచలేదు ఆషాని వివిధ రకాల ప్రశ్నలువేసి, ఆమెకి ఈ కుట్రతో ఏమాత్రం సంబంధం లేదని తెలిసి వదిలేశారు రావ్‌ని మటుకు కస్టడీలోకి తీసుకున్నారు

రావ్‌కి నిజంగా ఏ సంబంధమూ లేకుంటే లావణ్యా వాళ్ళంతా ఏమయ్యారో అంతు బట్టలేదు జూలీ బృందానికి

కానీ సాయంత్రానికల్లా అదృష్టం వారిని వెతుక్కుంటూ వచ్చింది బెంగు ళూరునుంచి టెలిగ్రాం వచ్చింది ఎవరో వారికోసం ఎదురుచూస్తున్నారని, రావలసిందిగా అసిస్టెంట్ మేనేజర్ టెలిగ్రాం యిచ్చాడు

దాన్ని చూడగానే అందరికీ ఆనందంతో కళ్ళు చెమర్చాయి నాలుగు రోజు లుగా పడుతున్న వేదనంతా తుడిచిపెట్టినట్టుగా పోయి, మనసులో శాంతి ఫిండింది అందరికీ

మద్రాస్‌లో అమృత జాడ తెలియక లావణ్య బెంగుళూరు వెళ్ళి ఉంటుందని ఊహించారంతా వెంటనే రెక్కలు గట్టుకొని ఎగిరి వెళ్ళారు బెంగుళూరుకి

ఇంటికి వెళ్ళగానే లావణ్యా, అమృత కుటుంబంతోపాటు నూతన వ్యక్తిని చూసి ఆశ్చర్యపోయింది రాజశేఖర్ మాత్రమే ఎందుకంటే అతను ఇదివరకే జూలీ, జేమ్స్, అమృతలకు పరిచితుడు గనుక

అతను జగన్!

ఒకరినొకరు చూసుకొని వారు పొందిన ఉద్వేగాలు వర్ణనాతీతం ముఖ్యంగా లావణ్య రాజశేఖర్‌ల సమాగమం తను ట్రెయిన్‌లో చూసిన అతనే ఇలా కన బడేసరికి ఉక్కిరిబిక్కిరయ్యింది అతనలా తనను చూడటమే ఈ కథకంతటి కీ కారణమని తెలిసి విపరీతంగా ఆశ్చర్యపోయింది

ఆశ్చర్యాలనుంచి తేరుకున్నాక అంతా అసలు విషయానికి కొచ్చారు వారు తమకోసం వెదికిందీ, జ్యోతిప్రసాద్ తన కేమీ తెలియదని చెప్పిన సంగతీ శ్రద్ధగా విని జగన్ అన్నాడు

"మీరు పప్పులో కాలేశారు!" నవ్వాడు

"ఎలా?" ఆశ్చర్యంగా అంది అమృత

"అతను చెప్పిందంతా నమ్మారే గానీ, టెలిగ్రాం ఎవరిపేర యిచ్చాడో అతన్ని తెలుసుకున్నారా?"

అప్పటికిగానీ అర్థంకాలేదు, ఎవరిపేర యిచ్చాడో అని

"ఎవరి పేరిట యిచ్చాడు?" అమృత అడిగింది ఆశ్చర్యంగా

"ఎవరిపేరిటో యిస్తే తేలిగ్గా నమ్మి రావడానికి లావణ్య అంత తెలివితక్కు వది కాదు నీకూ నాకూ పరిచయం ఉన్నసంగతి జ్యోతిప్రసాద్‌కి తెలుసు అందు కని నాపేర యిచ్చాడు అలా అయితే యింట్లోవాళ్ళు నమ్మగలరని అతను ఊహించాడు అతని ప్లాన్ ఫలించింది"

"ఇడియట్! కుక్కతోక వంకర అన్నట్లు వాడి బుద్ధి ఎప్పటికీ అంతే! అతని భార్యాబిడ్డల్ని చూసిగానీ, లేకుంటే కటకటాల వెనక కూచోబెట్టుదును నిజంగా నాకు చాలా ఇన్సల్టింగ్‌గా ఉంది అటువంటి వ్యక్తిని పక్కనే పెట్టు కుని గుర్తుపట్టలేకపోవడం మన కంపెనీలో పనిచేస్తున్నాడని తెలిసి, అందరి సర్టిఫికెట్స్ పరిశీలించాను ఆఖరి నిముషంలోగానీ అనుమానం రాలేదు వెళ్ళి ఫైల్సు చూస్తే ఎ జె పి రావ్ అని ఉంది దొరికిపోయాడు దెబ్బకు" కసిగా అంది జూలి

"ఇంతకీ మీరెక్కడ కలిశారు?" జేమ్స్ అడిగాడు, లావణ్యానీ జగన్‌నీ ఉద్దేశించి దానికి సమాధానం లావణ్య చెప్పింది

టెలిగ్రాం చూడగానే నేను షాక్ తిన్నాను వదిన్నీ, అమ్మనీ ఏ పక్కింటి వారికో అప్పజెప్పి నేను ఒక్కదాన్నే బయల్దేరుదును కానీ టెలిగ్రాంలో విత్ ఫామిలీ అని ఉంది ఇచ్చిందేమో జగన్! అతను మెడ్రాస్‌లోనే పని చేస్తున్నాడని, అమృతా అతనూ పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నారని కూడా నాకు తెలుసు అందుకే ఎంతమాత్రం సందేహించకుండా బయల్దేరాను తిరుపతిలో ట్రయిన్ మారుదామని దిగితే అక్కడ జగన్‌గారు కనిపించారు నేను ఇంతకు ముందు ఆయన్ని చూడలేదు కానీ ఆయన వదిన్నీ అమృతనూ యిదివరకు చూశారుగనుక గుర్తుపట్టి నన్నెవరని అడిగారు నేను స్నేహితురాల్నని, వీరిని చూసుకుంటున్నానని చెప్పాను ఆయన తనపేరు 'జగన్' అని చెబితే నిర్ఘాంత పోయాను టెలిగ్రాం తీసిచూపిస్తే ఆయన కొయ్యబారిపోయారు ఇది ఎవరో మోసం చేయటానికి యిచ్చిందని తేలిపోయింది నాకు జ్యోతీప్రసాద్ గుర్తొచ్చాడు అతనే నా ఆచూకీ తెలుసుకుని అలా యిచ్చి ఉంటాడని ఊహించాను జగన్‌గారు కనిపించకపోతే నా బ్రతుకేమవుతుందో తలచుకుంటేనే భయం వేస్తోంది "

"అమృత పెళ్ళికి ఒప్పుకోలేదు కాబట్టి, ఇంట్లో వాళ్ళ అమ్మకైనా చెప్పి ఒప్పిద్దామని నేను బయలుదేరితే తిరుపతిలో వీరు కనిపించారు సంగతంతా తెలిశాక టెలిగ్రాం తీసిచూస్తే అది బెంగుళూరునుంచి యివ్వబడింది ఏమాత్రం సందేహం లేకుండా అది ట్రాప్‌లో పడేయడానికని తెలిసిపోయింది అందుకే వెంటనే బెంగుళూరు వచ్చాము జగన్ చెప్పాడు

జూలీకో సందేహం వచ్చింది

అవునుగానీ జగన్! మీరూ నేనూ ఆవేళ బీచ్‌లో మాట్లాడాం కదా? మరి మీరు ఆవేళ లావణ్య చెల్లెలు అమృత అంటే పలికేరు గారేం?"

మీరు పొరబడ్డారు మీరు అమృత' 'అమృత' అని మాట్లాడుతుంటే ఈవిడ గురించే అనుకున్నానుగానీ, అమృత చెల్లెలిగా లావణ్యగారు చలామణీ అవుతున్నారని నాకేం తెలుసు? బహుశా మీరు లావణ్య గురించి చెప్పినా పర ధ్యానంలో నేను విని ఉండను " అన్నాడు జగన్

"అంతే అయిఉంటుంది తల వూపింది జూలి

"ముఖ్య విషయం చెప్పటమే మరచిపోయాం లావణ్యగారు ఒప్పుకుంటే

రాజశేఖర్ ఆమెని పెళ్ళాడా లనుకుంటున్నారు మేము అసలు లావణ్యకోసం వేట సాగించింది కూడా అందుకే!" జేమ్స్ అన్నాడు

లావణ్య జేమ్స్ మాటలు విని తెల్లబోతే అమృతా జగన్ మొహాలు చూసుకున్నారు

లావణ్యా! మగవాడి అండలేని జీవితం ఎలా ఉంటుందో ఇప్పుడు ఒడి దుడుకుల పాలయిన నీ జీవితమే చెబుతుంది దయచేసి ఈ మాట తిరస్కరించకు జూలీ కంఠంలో లాలన వినపడింది

* * *

"మీకూ జ్యోతీప్రసాద్‌కూ వైషమ్యం ఎలా ఏర్పడిందో చెబితే బాగుంటుంది! జగన్ అడిగాడు

లావణ్య కొంచెంసేపు మౌనంగా ఉండి ఆ తరువాత నోరు విప్పింది

ఆడవాళ్లు మగవాళ్ళతో సమానమేనని ఎంతమాత్రం తీసిపోరని వారికి ఏమాత్రం భయపడ నవసరం లేదని తలచేవారికి నా జీవితమే ఒక ఉదాహరణ నేనూ కాలేజీలో చదువుకునే రోజుల్లో నవలలు చదివీ సినిమాలు చూసీ అలాగే భావించేదాన్ని బి ఎస్‌సి ఫైనల్ చదివేటప్పుడు నేను జ్యోతీప్రసాద్‌ని చెప్పుతో కొట్టాను అతను మొదటి సంవత్సరంనుంచీ అల్లరి చేస్తున్నా ఏం చేస్తున్నా భరించగలిగాను కానీ అది శృతిమించి రాగానపడటంతో యిక నావల్లకాలేదు ఒకరోజు కాలేజీ వదిలాక ఇంటికి వెళుతున్న నన్ను పైట పట్టుకు లాగాడు భరించలేనంత ఆవేశం వచ్చింది నాకు వెంటనే చెప్పుతీసి ఎడాపెడా బాదేశాను పదిదెబ్బలు అతను మగవాడు! నన్ను ఆపగల శక్తి ఉంది కానీ ఆపలేక పోవడానికి కారణం, అతను నా ప్రవర్తనకు షాక్ తినడమే! నేను బాగా తిట్టి యింటికి వెళ్ళిపోయాను కానీ ఆవేశంతా మనిషిని కాలేకపోయాను ఎందు కటువంటి పనిచేశానా అని భయపడ్డాను తొందరపడ్డానేమో ననిపించింది నా స్నేహితురాళ్ళంతా నన్నభినందిస్తుంటే ఆనందం కలుగలేదు సరికదా, దుఃఖం వచ్చింది

ఫైనల్ ఇయర్ పరీక్షలు మూడునెలలు ఉన్నాయి ఈ మూడునెలలు ఎలాగోలా గడవనియ్యి దేవుడా, అని ప్రార్థించేదాన్ని ఇక అప్పటినుంచి జ్యోతీప్రసాద్ మొహం చూడాలంటే వణికిపోయేదాన్ని అంతటి క్రూరంగా ఉండేవి అతని చూపులు అతనొకసారి నన్ను ఒంటరిగా కలుసుకొని చెప్పాడు 'నీ జీవితం నాశనం చెయ్యకపోతే నా పేరు జ్యోతీప్రసాదే కాదు నా ప్రాణాలు




పోయినాసరే నిన్ను సాధించటమే నా లక్ష్యం అని చెప్పాడు అప్పటినుంచి సినిమాలు షికార్లు అన్నీ మానేశాను

మా అమ్మా నాన్నా చిన్నతనంలోనే పోయారు నేను మా పెదనాన్నగారింట్లోనే ఉండి చదువుకునేదాన్ని నేను చేసిన పని మూలకంగా మా కుటుంబాన్నంతటినీ నాశనం చేయడానికి కంకణం కట్టుకున్నాడు అన్నయ్యలలిద్దరికీ పెళ్ళిళ్ళయాయి ఆ వదినలమీద ఆకాశరామన్న ఉత్తరాలు వ్రాశాడు మా అక్కయ్యలకి వ్రాశాడు నామీదా వ్రాసేవాడు ఎంతో ప్రయత్నంమీద మా అక్కయ్యలకీ మా చెల్లెలికీ (కజిన్) పెళ్ళిళ్ళు చేశారు ఇంట్లో నాకు నరకం అనుభవిస్తున్నట్టుగా ఉండేది

నాకు పెళ్ళిచేయాలని ఎంతో ప్రయత్నించారు వాళ్ళు కానీ ఏ ఒక్క సంబంధమూ కలిసి రాలేదు ఇక విసిగిపోయి నన్ను దూరపు బంధువుల యింటికి పంపేవారు అక్కడా ప్రత్యక్షమయ్యేవాడు ఎలాగోలాగ ఇలా రెండేళ్ళు గడిచాయి అతనికి పెళ్ళయిందని విన్నాను ఎక్కడో దూర ప్రాంతంలో ఉద్యోగం వచ్చిందని వెళ్ళిపోయాడని విని ఎంతో సంతోషించాను కానీ అతను ఏ రెండురోజులు సెలవుపెట్టి అయినాసరే, నేనున్న దగ్గరికి వచ్చేవాడు నేను ఎన్నో ఉద్యోగ ప్రయత్నాలు చేశాను రెండు చిన్న ఉద్యోగాలు చేసి వదిలేశాను అందుకు కారణం జ్యోతీప్రసాదేనని వేరే చెప్పనక్కరలేదు అతను పై అధికారులకి నామీద అసభ్యంగా ఉత్తరాలు వ్రాసి నా బ్రతుకు

బజారుపాలు చేశాడు తోటి ఉద్యోగస్థులంతా వెకిలిగా ప్రవర్తించటంతో మానేయవలసి వచ్చింది ఉద్యోగం చేస్తుంటే బంధువులు ఆదరించేవారు అది కాస్తా ఊడితే ఎవరు మటుకు ఎందుకు ఆదరిస్తారు జీవితంతో పోరాడలేక విసిగి వేసారిపోయాను చివరికి బెంగుళూర్లో ఉద్యోగం వచ్చే సూచనలు కనిపించాయి అప్లై చేసాను ఇంటర్వ్యూకి బయలుదేరాను గుంతకల్లులో ట్రెయిన్ మారి నపుడు నేను అనుకోకుండా రాజశేఖరంగారిని కలుసుకున్నాను ఆయన కంపె నీకే నేను ఇంటర్వ్యూకి వెళుతున్నానని నాకేం తెలుస్తుంది? ఆయన నా పేరే సజెస్ట్‌చేశారని అంతకంటె తెలీదు

ఇంటర్వ్యూకి వచ్చిన నేను జ్యోతిప్రసాద్‌ని చూసి షాక్ తిన్నాను అతని దగ్గరే స్టెనోగా చేయాలనేసరికి భయంతో వణికిపోయాను అదృష్టవశాత్తు అతను నన్ను చూడలేదు ఇంటర్వ్యూ మరోగంటలో జరుగుతుందనగా వెళ్ళి తోటలో కూర్చున్నాను అప్పుడే లావణ్యకి ఉద్యోగం వచ్చిందని అమృత వచ్చి చెప్పేసరికి ఏంచేయాలో తోచలేదు

అమృతా నేనూ మారిపోయిన సంగతి మీకు తెలిసిన విషయమే నేను నా ఉనికి గురించి మా బంధువులకి తెలియకుండా జాగ్రత్తపడ్డాను అమృత యింట్లో ఉండటం నాకు ఎంతో మనశ్శాంతి నిచ్చింది పిచ్చివదినకీ, గుడ్డి అమ్మకూ, లోకం తెలియని పసిపిల్లలకూ సేవచేయటంలో ఎంతో హాయిని పొందాను 'మా గురించి ఎవరికీ తెలియనివ్వకు భగవంతుడా!' అని ప్రార్థించే దాన్ని ఒకసారి జూలీగారు వచ్చి 'తాను అవివాహితలపై రీసెర్చి చేస్తున్నా, నని చెప్పి వరసగా ప్రశ్నలు వేసేసరికి నాకు అనుమానం తగిలినా అమృతకు వ్రాయలేకపోయాను అమృత ఎప్పుడూ ఊళ్ళో ఉండదు ఆ ఉత్తరాలు ఎవ రైనా చదివితే అని భయంవేసేది జ్యోతిప్రసాద్ దగ్గరే అమృత పనిచేస్తోం దని నాకు తెలుసు

నా గతజీవితాన్ని గురించి అమృత ఏనాడూ అడగలేదు నేను చెప్పలేదు కూడా మొత్తానికి నేనూ, అమృతా కత్తిమీద సాముచేశాము ఇన్నాళ్ళూ!" ముగించింది లావణ్య

"మీ కత్తిమీద సాముమాట ఏమోగానీ, నా దుంప తెంచారు ఇద్దరూ కలిసి మీ యింటికి వచ్చి, నీతో కలిసి మాట్లాడి కూడా నిన్ను గుర్తుపట్టలేకపోయాను అంత అమాయకంగా నటించావు నువ్వు! జూలీ అంది

లావణ్య సిగ్గుగా నవ్వింది

"జ్యోతీప్రసాద్ విషయం ఏంచేయదలచుకున్నారు?" అమృత అడిగింది

కుక్కతోక వంకరన్నట్లు అతని బుద్ధి మారదు మనం అతనిమీద జాలి చూపవలసింది ఏమైనా ఉందీ అనుకుంటే అతని భార్యా పిల్లలను చూసే అతన్ని విడిపించేసి, మద్రాసులోనే ఏదైనా ఉద్యోగం ఇప్పిద్దాం ఒప్పుకున్నాడా బాగుపడ్తాడు లేదా అతని ఖర్మ! అంది జూలి

ఎవరూ మాట్లాడలేదు

"ఇంతవరకూ అడగడమే మర్చిపోయాను జేమ్స్! మీరేదైనా జాబ్ చేస్తున్నారా? లేక ప్రశ్నార్థకంగా చూశాడు జగన్

"మిలటరీ ఆఫీసర్ జేమ్స్! సంవత్సరానికి రెండునెలలు సెలవుమీద వస్తుంటాడు " జూలీ జవాబు చెప్పింది ఎందుకో ఆమె స్వరం భారంగా ఉన్నట్లు తోచింది అందరికీ

మరునాడు రిష్టాఫీసులో రాజశేఖర్ లావణ్యలకు, జగన్ అమృతలకు పెళ్ళిళ్ళు జరిగిపోయాయి

* * *

"జేమ్స్! ఎలాగూ రాజా పెళ్ళి అయిపోయింది అతని బాధ్యత నాకు అనవసరం నువ్వుకూడా యిక్కడికి వచ్చేయకూడదూ? ఇద్దరం కలిసి బిజినెస్ చూసుకుందాం! జూలీ ప్రాధేయపూర్వకంగా అడిగింది

"నేనూ అదే అనబోతున్నాను రాజా బెంగ నీకు తీరిపోయింది నువ్వు నాతో వచ్చేయకూడదూ?

మాట్లాడలేకపోయింది జూలి ప్లేన్ మరో ఐదునిముషాలలో బయలుదేర బోతోందని అనౌన్స్ చేశారు ఆమెవైపు ఒకసారి చూసి నవ్వి, గబగబా ప్లేన్‌వైపు వెళ్ళాడు జేమ్స్ ఆమెకు చేయిఊపి లోపలికి వెళ్ళిపోయాడు

ప్లేన్ మెల్లగా స్టార్టయి ఆకాశంలోకి పరిగెత్తి చుక్కలా మారిపోయి చివరికి మాయమైపోయింది

నీళ్ళు నిండిన కళ్ళను తుడుచుకుంది జూలి



పివిబి
శ్రీరామమూర్తి




మధ్యాహ్నం పన్నెండు గంటలవుతోంది

నేను ఆఫీసునుండి ఇంటికి వచ్చేసరికి ముఖంనిండా దుప్పటి ముసుగువేసుకుని మంచంమీద పడుకుంది అమ్మ వేళకాని వేళ అమ్మ అలా పడుకునేసరికి నాకు భయంవేసింది రోజూ నేనూ తులసి ఆఫీసునుండి వచ్చేంతవరకు అమ్మ

భోజనం చేయకుండా మాకోసం ఎదురు చూస్తూ కూర్చుంటుంది మేం వచ్చిన తరువాత మా కందరికీ వడ్డించేసాక అమ్మ భోజనానికి కూర్చుంటుంది "మేం వచ్చేంతవరకూ భోజనం చెయ్య కుండా నువ్వు కూర్చోవద్దు," అని ఎన్నిసార్లు చెప్పినా అమ్మ మా మాట వినదు అంతే కాకుండా ఇంట్లో ఎంతమంది ఆడవా ళ్ళున్నా అమ్మ వాళ్ళని ఇంట్లో ఏ పనీ చెయ్యనివ్వదు సరికదా వాళ్ళపనులు కూడా అమ్మే చేసిపెడుతూ ఉంటుంది అందుకే ఒక్కోసారి అనిపిస్తుంటుంది 'అమ్మకి అందర్నీ సుఖపెట్టటం తెలుసు కాని ఎవరివల్లనూ తను సుఖపడ్డం అమ్మకి తెలియదు ' ఆలోచిస్తూ కుర్చీలో కూర్చుని బూట్లు విప్పుకుంటున్నాను ఇంతలో తులసి తువ్వాల్తో ముఖంతుడుచు కుని ఇంట్లోంచి వస్తోంది

"ఎంతసేపయింది వచ్చి?"

ఇప్పుడే పదినిమిషాలవుతుంది "

అమ్మ పడుకుందేం?

ఏమో! తులసి జవాబునాకొంచెం చిరాకు కల్గించింది 'ఆఫీసు నుండి రోజూ ఇంటికి రాగానే గాభరాపడుతూ తమ క్రింద సేవలు చేస్తున్న అమ్మ ఎందుకు పడుకుందో కూడా తెలుసు కునేపాటి కనీస బాధ్యత తులసికి ఉండక్కర్లేదూ? అని మనసులోనే అను కుని పైకి ముభావంగా ఊరుకుని అమ్మ దగ్గరికి వెళ్ళి వొంటిమీద చెయ్యివేసే సరికి అమ్మ ఒళ్ళు వేడిగా కాలిపోతోంది

"అమ్మా! పడుకున్నావేం? వొంట్లో ఎలా ఉంది?"

"ఏంలేదు బాబూ! కాస్త నలతగా ఉంటే పడుకున్నాను," అని దుప్పటి తీసేసి "నా మతి మండిపోను అమ్మా తులసీ ఎంతసేపయింది వచ్చి? కాళ్ళు కడుక్కోనిరండి వడ్డిస్తా, అంటూ అమ్మ లేవబోతుంటే నాకు కళ్ళలో ఆనందంతోనో దుఃఖం తోనో చెప్పలేను గాని గిర్రున నీరు తిరిగింది అమ్మ మాకోసం పడే తాపత్రయంలో కనీసం నూరోవం తయినా అమ్మకోసం మేం పడలేక పోతున్నామేమో ననిపించింది

"మీరు పడుకోండ త్తయ్యా! నేను వడ్డిస్తాలెండి, అంది తులసి

అయ్యో! నాకేమయిందమ్మా ఇప్పుడు? వడ్డించుకు నువ్వేం తిన గలవ్? పదపద అంటూ అమ్మ లేవబోతోంటే

"నువ్వేం లేవనక్కర్లేదు నీకోడలేం కందిపోదులే ఈ ఒక్కపూటకి పడుకుని కొంచెం విశ్రాంతి తీసుకో," అని నేను గట్టిగా కసరుకోవటంతో చేసేదిలేక పడుకుండిపోయింది భోజనం దగ్గర కంచాలు, గ్లాసులు పోట్లాడుకోవటంవల్ల తులసికి నామీద బాగా కోపం వచ్చేసి నట్లు అర్థమయింది రోజూ నవ్వుతూ

వాళ్ళ స్కూలు కబుర్లుచెప్పే తులసి మౌనంగా ఉండిపోయింది తులసిని ప్రసన్నం చేసుకోడానికి ఏదో మాట ల్లోకి దింపాలని ప్రయత్నించి ఇవ్వాళ మీ స్కూలు విశేషాలేం లేవా?" అని ప్రశ్నించాను తులసి జవాబుచెప్పకుండా ఊరుకుంది

"తులసీ! నువ్విలా మాటాడకుండా కోపంతో ముఖం ముడుచుకుని కూర్చుంటే ఎలా ఉన్నావో తెలుసా? ఇంకా అప్పుడే వికసించబోయే

"చాల్లెండి మీ వర్ణనలు అందితే పిలకా లేకపోతే కాళ్లూను కూర చాలా మరి కొంచెం వేసేదా?" అంది.

ఇన్నాళ్ళకి నీ చేత్తో వడ్డిస్తోంటే ఎలా సరిపోయిందని చెప్పగలను? అన్నాను

"నేను గరిటతో వడ్డిస్తున్నాను చూస్కోండి? చిరుకోపంతో అంది

"అమ్మో! మహంకాళీ! గరిటతో ఎక్కడ వడ్డించేస్తావ్ తల్లీ! నవ్వుతూ అన్నాను ఆ మాటతో తులసి కోపం ఎగిరిపోయి పకాలున నవ్వింది ఆమాత్రం చిటపటలు లేకపోతే సంసారంలో సారం ఏముంది చెప్పండి? మరి ఫరవా లేదనుకున్నాను

"తులసీ! అమ్మకి వొంట్లో బాగు లేదు మధ్యాహ్నం సెలవు పెట్టవూ? సాయంకాలం నేను డాక్టర్ని తీసుకొస్తా అన్నాను

"మా హెచ్చెమ్ ఏమంటాడో అసలే తిక్కవాడు

"ఫరవాలేదు నేనెళ్ళి రిక్వెస్ట్ చేస్తా లీవులెటరు వ్రాసిచ్చేసి, అని భోజనం చేసి, మధ్యాహ్నం ఆఫీసు కెళ్ళినపుడు వాళ్ళ స్కూల్లో తులసి లీవులెటరిచ్చేసి వెళ్ళిపోయాను

సాయంకాలం ఆఫీసు అవర్సు అయిన వెంటనే పనిముగించుకు బయలుదేరి నేరుగా మా డాక్టరుగార్ని తోడ్చుకుని ఇంటికెళ్ళాను ఇంటికెళ్ళేసరికి ఇల్లంతా సందడిగా ఉంది అమ్మకూడా ప్రక్కమీద కూర్చుని మా పెద్దన్నయ్య కొడుకుని ఒళ్ళో బెట్టుకుని ముద్దాడుతోంది మావాళ్ళంతా మాస్టర్లే అవటంచేత ప్రతిసంవత్సరం స్వంతఊర్లో ఉంటున్న నా దగ్గరకే వస్తుంటారు పండుగ సెలవలకి ఆ సెలవలన్నాళ్లూ హాయిగా గడిచిపోతుంది అందరం కలుసుకున్నందుకు నేనూ సంబరపడ్డాను తర్వాత డాక్టరుగారు థర్మామీటరుతో అమ్మ టెంపరేచరు చూస్తే నూటమూడు డిగ్రీల జ్వరం ఉంది ఇంజక్షన్‌చేసి టాబ్‌లెట్లిచ్చి బాగా విశ్రాంతి తీసుకోమనిచెప్పి వెళ్ళిపోయారు కొడుకులూ, కోడళ్ళూ వచ్చారన్న సంతోషంతో అమ్మ లేచి పనిచెయ్యబోతూ ఉంటే నేనూ మా అన్నయ్యలూ దెబ్బలాడటంతో విధిలేక అమ్మ మంచంమీద మేను వాల్చింది

ఆ తరువాత అన్నయ్యలూ, వది

నలూ మా తులసివాళ్ళ స్కూలు విషయాలు చెప్పుతోంటే, నేను నా ఆఫీసు విషయాలు చెప్పుకుంటూ పదకొండు గంటలవరకూ కాలక్షేపం చేసేసాం అప్పుడు మంచంమీద పడుకున్న అమ్మ మూలుగు వినిపించింది కాళ్ళు నొప్పులుగా ఉన్నాయో ఏమో అమ్మ తన కాళ్ళు తనే పట్టుకుంటోంది పెద్దన్నయ్య వదినని పిల్చి అమ్మకాళ్ళ మీదనోసారి చెయ్యి వెయ్యమన్నాడు వదిన రెండునిమిషాలు బద్ధకంగా వొళ్ళు విరుచుకుని అబ్బా, ప్రయాణబడలిక వల్ల నాకే వొళ్ళంతా నెప్పిగా ఉందండి నిద్ర ముంచుకొచ్చేస్తోంది " అంటూ అక్కణ్ణించి లేచిపోయింది తరువాత చిన్నన్నయ్య మా చిన్నవదినకి అదే విషయం చెప్పగా ఆవిడ వినీ విననట్టు వెళ్ళిపోయింది ఆపైై మిగిలింది నేను కాబట్టి మా తులసిని ప్రక్కకి పిల్చి "అమ్మకి కాళ్లు పీకుతున్నట్లుంది ఓసారి పట్టవూ? బ్రతిమాలుతున్నట్లు అన్నాను తులసకూడా కొంత సేపు తటపటాయించి చేసేదిలేక అమ్మకి కాళ్లొత్తసాగింది "అయ్యో నీకు మతిలేదా? వాడికి మతిలేదా? నాకేకాళ్ళు ఒత్తనక్కర్లే దమ్మా! వెళ్ళి పడుకో అసలే నువ్వు ఉత్తమనిషివికూడా కావాయె! జ్వర తీవ్రతచే ఆ మాటలు అనలేక ఆయాస పడుతూ ఆయాసపడ్తూ అంది అమ్మ అమాయకత్వానికీ కోడళ్ళ గడుసుతనానికీ సరిపోయిందనుకున్నాం తరువాత నేనూ-పెద్దన్నయ్యా చెరోకాలూ ఒత్తుతూంటే చిన్నన్నయ్య అమ్మ చేతులొత్తసాగాడు అమ్మ సీరియస్‌గా దుప్పటి ముసుగు తీసి చూసి, "ఏఁ(రా! మిమ్మల్ని కాళ్లొత్తమని చెప్పిందెవరు? ఇంకా చిన్నపిల్లలా మీరు? , వెళ్లండి వెళ్ళండి మీరేం నాకాళ్ళు పట్టనవసరం లేదు పోయి పడుకోండి పన్నెండవుతోంది!" కాళ్ళను దగ్గరగా కూడదీసుకుంది

"అమ్మా! మేం వింత పెద్దవాళ్ళ మయినా నీకంటే చాలా చిన్నవాళ్ళమే నమ్మా నువ్విలానే ఉండు,నీ మంచి తనాన్ని ఆసరగా తీసుకొని కొన్నాళ్ళకి కోడళ్ళు నీకు తిండికూడా పెట్టరు " చీవాట్లేసినట్లుగా అన్నాడు చిన్నన్నయ్య

"నోర్ముయ్‌రా గాడిదా! చాలు నీ కూతలు నా కోడళ్ళెవరనుకున్నావ్? బంగారు తల్లులు " అని మమ్మల్ని చీవాట్లేసి కోడళ్ళను వెనకేసుకొచ్చింది

* * *

తెల్లవారింది గోడ గడియారం అయిదుగంటలు కొట్టడంతో మెలకువ వచ్చింది రాత్రి పన్నెండుగంటలవరకు మేలొ్కని ఉండటంచేత పడుకున్న వెంటనే నిద్రపట్టేసింది బాగా అమ్మకి ఎలావుందో చూదామని మంచందగ్గర కెళ్ళాను అమ్మ లేదక్కడ వంటింట్లో గ్యాస్ స్టౌవ్ వెలుగుతూ కనిపించింది

అమ్మదగ్గర కెళ్ళాను అమ్మపై బాగా కోపం వచ్చేసింది నాకు "అమ్మా ! ఇప్పుడేం కొంప మునిగిపోయిందని? కోడళ్లున్నారుగదా ! ఆ మాత్రం పని చేయకపోరు నీ ఒంటికేదేనా వస్తే చేసేవాళ్ళు ఉందరు తరువాత నీ ఇష్టం," అన్నాను

"చాల్లేరా నీ మాటలు ! రాకరాక వస్తే వాళ్ళచేత పనిచేయించమంటు న్నావ్ ఎవరేనా వింటే నవ్విపోగలరు పో అన్నయ్యలని లేపు వెళ్ళి కాఫీ తయారయింది," అని అంటున్న అమ్మని చూసి ఏమనాలో అర్థంకాక అక్కణ్ణించి తప్పుకుని ముఖం కడు క్కోడానికి వెళ్ళిపోయాను

తరువాత తులసి ఒర్థిమనిషికాదని బోన్‌విటా, కాఫీ త్రాగదని పెద్దవదినకి పాలు మాకందరికి కాఫీలు అందిస్తున్న అమ్మను చూస్తున్నప్పుడు మాకు అనిర్వచనీయమైన ఆనందం కలిగి, ఆ తల్లికి కొడుకులమై పుట్టినందుకు మేం ఎంతో అదృష్టంగా భావించాం

పండగకి అన్నయ్యలకి ఇష్టమని మైసూరుపాక్, నాకోసం 'కోవా, ఇంకా కోడళ్ళకి, కూతుళ్ళకి ఎవరికి యిష్టమైనవి వారికి చేసిపెడుతుంటే అందరం హాయిగా కాలక్షేపం చేసాం నేనూ చిన్నన్నయ్య అమ్మ దగ్గరకెళ్ళి, "అమ్మా ! మాకందరికీ యిష్టమైనవి పేరుపేరున చేసి అందించావ్ కదా ! మరి నీ కిష్టమని ఏం చేసుకున్నావ్ ?" అని అడిగాం అమ్మ మావేపు చూసి ఓసారి నవ్వి "మీ అందరూ ఇలా ఓచోట పండుగ చేసుకోవటం, మీకేం కావాలో వాటిని చేసి మీకు పెట్టడం అదీ నా కిష్టం," అంది అమ్మ

అలా అంటున్నప్పుడు అమ్మ కళ్ళు ఎంత స్వచ్ఛంగా వెలిగాయని ! మనసు ఆ కళ్ళలో ఎంత నిర్మలంగా కనిపించిందని

* * *

"ఏమండీ !"

"ఏమండీ," తలసిని దగ్గరగా తీసుకుంటూ కొంటెగా

"మీ చిన్నవదిన అత్తయ్యను తనతో తీసుకుపోతామంటున్నారు !"

"పోనీ తీసికెళ్ళనీ," తులసిని అల్లరి పెడదామని అనిపించి అన్నాను

"అది కాదండీ మా దసలే ప్రయి వేట్ మేనేజ్‌మెంటు స్కూలు పని ఒత్తిడి ఎక్కువ అందునుంచి అత్తయ్య మన దగ్గరే ఉంటే అంటున్న తులసి మాటల్ని పూర్తి కానివ్వకుండానే, "పోనీ ఉద్యోగం అంత కష్టంగా ఉంటే రిజయిన్ ఇచ్చెయ్ రాదూ !" తులసిని కొద్దిగా ఏడిపించే రీతిలో అన్నాను

"మీరూ రిజయిన్ యిచ్చేసి కూర్చోండి బాగుంటుంది ! కోపంగా నా చేతులు విడిపించుకుని ప్రక్కకి

తిరిగి పడుకుంది తులసిని నా ప్రక్కకి త్రిప్పుకుని "ఏమమ్మాయ్ ! అమ్మకి జ్వరం వస్తే కాళ్లొత్తడానికి మీకు సిగ్గని పించింది ! మరి అమ్మకి మీ సేవలు చెయ్యటం తన్న చినం కాదూ చెప్పమ్మా !" అన్నాను

"నేను కాళ్లొత్తనన్నానా ఏం ? ప్రతి దానికి దెప్పుతారు గాని !" అందంగా ముఖం ముడుచుకుంది తులసి

సర్లే 'శ్రీమతి గారి ఆజ్ఞ ! తప్పు తుందా ? అన్నాన్నేను

తరువాత తులసి ఏదో వారపత్రిక తిరగేయసాగింది నేను 'న్యూస్ పేపరు చదవసాగాను కొద్ది పేజీలు తిరగేసే సరికి కళ్ళు బరువెక్కాయి తలుపు తెరుచుకొని మంచినీళ్ళకోసం వరండా లోకి వెళ్లేసరికి ప్రక్కగదిలోంచి విన వస్తున్న మాటలు—

"ఈ పిల్లల్తో నేనొక్కర్తినీ చాకిరీ చెయ్యలేను ఈసారి అత్తయ్యని మనతో తీసుకుపోదాం," అంటోంది పెద్దవదిన

"ఇద్దరు పిల్లలకి చెయ్యడానికే ఇంత కష్టపడిపోతుంటే అమ్మ ఈ వయసులో ఇంతమందికి ఎలా చేస్తుందో ఆలో చించు ! అంటున్నాడు అన్నయ్య

సర్లెండి ఈ భారతం కేంగాని అత్తయ్యను మాత్రం కూడా తీసు కెళ్దాం "

"అది నెమ్మదిగా ఆలోచించాల్సిన విషయం" అన్నయ్య మాటలు నాకు నవ్వు తెప్పించాయి ఆ రాత్రి చాలా సేపటివరకూ అమ్మ గురించే ఆలోచించాను

* * *

పండుగ సెలవులు ఇంకా రెండ్రోజు లున్నాయ్ అన్నయ్యలూ,అక్కయ్యలూ ప్రయాణాల సందడిలో ఉన్నారు తోడి కోడళ్లు ముగ్గురూ అత్తయ్య నా దగ్గరుంటుందంటే నా దగ్గరుం టుంద'ని అనుకుంటున్నారు తుది నిర్ణయంలాగా అక్కయ్య మధ్యలో వచ్చి 'అమ్మ నాతో వస్తుందీసారి' అంది ఇక లాభంలేదని నాలుగు చీటీలు చించి లాటరీ వేసి అన్నయ్య కొడుకు రెండవ వాడితో ఒక చీటి తీయించారు ఇదంతా చూస్తున్న మేం మాకేం పట్టనట్టు ఊరు కున్నాం

"ఒరే తమ్ముడూ ! వీళ్ళంతా అమ్మ మీద అభిమానంచేతనే అమ్మని తమతో రమ్మంటున్నా రనుకుంటున్నావా ? అన్నాడు చిన్నన్నయ్య "నన్నడుగు నేం చెపుతాను మీ పెద్ద వదిన వారం రోజులుగా రోజూ రాత్రి ఇదే పోరనుకో ఎందుకో తెలుసా ? ఆవిడకి మహిళా మండలి మీటుంగులకి వెళ్ళాలని కోరిక ఇంట్లో పని ఎక్కువ అందుకని ఇంట్లో పని చేసేందుకు ఆవిడకి అత్తయ్య కావాలి! ఇకపోతే పెద్ద మరదలి బాధ— 'అత్తయ్య చిన్న మరదలికి చేసేస్తోందే మరి తనెందుకు కష్టపడాలి? అని మరి తులసి సంగతంటే- దానికి స్కూలు, ఇంటి పని స్కూలులో ఆవిడ పనిచేసు

కుంటుంది. ఇంటి పని చెయ్యటానికి అత్తయ్య కావాలి!... ఇక అక్కయ్య సంగతి చెప్పనా... ఆవిడ తహశీల్దారు గారి భార్య. ఇంటిపని చేసుకోటానికి ఆవిడకి చిన్నతనం. అందుకంచి అమ్మ కావాలి అక్కయ్యకి... ఇదీ వాళ్ల అభిమానం!" అని పెద్దన్నయ్య ఉన్న విషయాన్ని నిర్మొహమాటంగా చెప్పేసరికి ముగ్గురం గొల్లున నవ్వుకున్నాం. వాళ్ళ తోడి కోడళ్ళలోంచి కూడా గోల వినిపించేసరికి అక్కడికి వెళ్ళాం

అమ్మ ఎవరి వాటా వచ్చిందర్రా?" అన్నాడు పెద్దన్నయ్య. మామ్మ తులసి పిన్ని దగ్గిరే ఉండాలిట" గెంతుతూ అన్నాడు వాడు. తులసి ముఖం మెరుగు పట్టిన బంగారంలాగా ఉంది, తన నంబరు లాటరీలో గెల్చినందుకు.

అమ్మా! ఈ లాటరీలో సంబంధం లేదు నీ కెక్కడుండాలని ఉంటే అక్కడ ఉండు. ఎవర్ని చూడాలని ఉంటే వాళ్ల దగ్గరికి వెళ్ళు. నీకేం అభ్యంతరం లేదు." ఖండితంగా నేను చెప్పేసాను.

"చూడండర్రా! తులసి ఉత్తమనిషి కూడా కాదు. అది పురుడయి దాని బిడ్డకు మూడోనెల వచ్చినంతవరకూ దాని దగ్గరుండి తీరాలి! తరువాత నేనే వస్తా మీ దగ్గరికి," అన్నది అమ్మ.

ఇదిగో అమ్మాయిలూ! మీరంతా వినండి. ఓ షరతు. ఈసారి కెలాగో అయిపోయింది కాని- ఇకపై అమ్మ ఎవరి దగ్గరున్నా సరే- అమ్మ యిక్కడ చీపుర అక్కడ పెట్టడానికి కూడా వీల్లేదు. పిల్లల్ని ఆడించుకుంటూ 'రామాకృష్ణా' అంటూ కూర్చోవాల్సిందే! అందు కిష్టపడిన వాళ్లే అమ్మని తీసుకెళ్ల వచ్చు. అమ్మచేత సేవలు చేయించు కొని మీరు బాతాఖానీ కొడదామనుకుంటే మాత్రం వీలులేదు." పెద్దన్నయ్య అనే సాడు.

"నోర్మూయ్‌రా గాడిదా! నలుగురూ నవ్విపోగలరు.నా పిల్లలకి...నా కోడళ్లకి నేను చెయ్యపోతే ఇంకెవరు చేస్తార్రా? గొప్ప తెలిచితేటలు సంపాయించార్లెండి. చదవేస్తే ఉన్న మతి పోయినట్లుంది. ఇదిగో అమ్మలూ! నాకంఠంలో ప్రాణం ఉండగా మరెవరూ నా క్రింద చెయ్యడానికి వీల్లేదు. ఒరేయ్! మీకూ చెప్తున్నాను. మళ్లీ ఇలా ఓసారి వాగినట్టయితే పళ్లూడగొడ్తా మీ అందరికీ. జాగర్త!... ఆహాఁ..." కోపంగా ఇటూ అటూ తిరిగేస్తూ అంది. ఇక అక్కడుండక అన్నయ్య కొడుకుని చంకన వేసుకుని వెళ్ళిపోయింది. మేం అమ్మని చూస్తూ అలానేఉండపోయాం! ఆడవాళ్లంతా కళ్ళప్పగించి ఉండి పోయారు.

అమ్మ అందరికీ కావాలందుకే!
అమ్మకీ మేం అందరం కావాలి—
అనురాగం పంచి ఇవ్వటానికి!

---




బలవంతాన భర్తచేత చొక్కా తొడిగించింది శ్యామల కాస్త దగ్గరగా జరిగి చొక్కా గుండీలు పెట్టింది

"అసలు అన్నయ్యా ఎందుకు నాన్చుతున్నా డంటారు? మనమిక ఆలస్యంచేస్తే లాభంలేదు! అవునో కాదో వెంటనే తేల్చెయ్యాలి! ఆయన అమెరికాలో కోట్లు–కోట్లు గడించాడని ఊళ్ళో అంతా చెప్పుకుంటున్నారు యెలాగైనా సరే యివాళే మీరు నలుగురు పెద్దమనుషుల్ని పిలుచుకురండి! అందరిముందు అడిగేసి, వత్తిడిచేస్తే కాదంటాడా మేనరికం? ఎవంటారు? కాలరు సవరించి అంది

నువ్వు చెప్పేదిబాగానేవుంది కానీ, ఒకాడపిల్ల తండ్రిని ?" భర్త చెయ్యి మీసాలమీదికి పోయింది

చాల్లెండి ! మీవన్నీ బడాయిలు ! ఆయనేం పరాయివాడా ? స్వయాన నాకు అన్నయ్య ! ఎంత ఆడపిల్ల తండ్రే అయినా అమెరికాలో ఆయన కోటీశ్వరుడండీ! ఆయన కున్న ఆస్తి-పాస్తులు పేరు-ప్రతిష్ఠల ముందు మన మేపాటి వారమండీ ? మీరిలా కుంటి సాకులు చెబుతూ ఆలస్యంచేస్తే, యీ అవకాశం మళ్ళీ రాదు ! యే అదృష్ట వంతులో యెగరేసుకుపోతారు ! తెలిసిందా ? కాస్త గట్టిగానే చెప్పింది శ్యామల

అంతలో బయటినుండి కిశోర్ వచ్చాడు ఈమధ్యే అతను ఎం ఎస్‌సి ఫస్ట్‌క్లాస్‌తోపాటు డిస్టింక్షన్ సంపాయించాడు అతనికే మేనరికంచేసి అమెరికాలో రిసెర్చి చేయించాలని తల్లి-తండ్రుల ఉబలాటం ! అందుకు అతను కూడా అంగీకరించాడు

మీరు త్వరగా తెమలండి ! పుల్లయ్య బాబాయినీ వెంకయ్య మావయ్యనీ రామయ్యనీ రంగయ్యనీ, శాస్త్రిగారినీ యేకంగా పిలుచుకురండి ! ఒకేసారి లగ్నపత్రిక వ్రాసేట్టుండాలి ! తెలిసిందా ? ఇక పదండి !" భర్తని మారు మాటాడనీయకుండా బయటికి సాగనంపసాగింది శ్యామల

"ఎందుకమ్మా ? పెళ్ళి సెటిల్ చెయ్యడానికా ? కిశోర్ అడిగాడు

అవున్రా ! మీ మామయ్య వచ్చి అప్పుడే వారం దాటినా యింతవరకు యే సంగతీ తేలలేదాయె ! శ్యామల అంది

అసలదేమిటమ్మా ఆయన అలా మాట్లాడుతారు ? 'మీలాగే అమెరికా వచ్చి సెటిల్ అవ్వాలనుంది మామయ్యా అంటే నావంక యెగాదిగా జూచి డోంట్ డ్రీమిట్ ! ఇటీజ్ ఇంపాజిబుల్ అన్నారు 'వైనాట్' అని నే నడిగితే మళ్ళీ సమాధానమే చెప్పలేదు ! కిశోర్ చెప్పాడు

"అన్నాడూ? నాకు తెలుసురా ! ఆయనకు మనం మనుషుల్లా కనబడుతున్నామా ? యే దేవలోకంనించో దిగి వచ్చినట్టు బిర్రబిగుసుకు నుంటున్నాడు విన్నావుటే మీ అన్నగారి నిర్వాకం ? 'అమెరికా రావడం నీవల్లకాదు పిచ్చి-పిచ్చికలలు కనద్దు' అన్నాట్ట! శ్యామల భర్త అన్నాడు

"అంతమాటే ? అయినా, నా కొడుకు అంత చాతకానివాడనా ఆయన ఉద్దేశం ? అమెరికా రావడం నీవల్ల కాదంటాడా ? ఎందుకు కాదో నేనూ చూస్తాను తన కూతుర్ని యివ్వకపోతే, ఆ సంగతే తిన్నగా చెప్పాలిగానీ, అడ్డ గోలుగా అంటాడా ? యేమైనా సరే, యీ విషయమేమిటో యీ రోజు తేల్చు

కోవల్సిందే ! ముందు మీరు వెళ్ళి వాళ్ళందర్నీ ఎలుచుకురండి ! పదండి పదండి ! భర్తని పురమాయించి పంపింది

ఎల్ల నివ్వకపోతే పోయాడు నీవల్ల కాదంటాడా ? శ్యామల ఒకటికి రెండుమార్లు అనుకొని బాధపడింది

* * *

అటు పల్లెకి యిటు బస్తీకి చెందని ఊరు రేపల్లె ! ఆ ఊళ్ళో పరపతిగల ఆసామి గోపాలరావు అతని భార్య శ్యామల వారికి నలుగురు సంతానం ఇద్దరాడపిల్లలకి ఒక మగపిల్లవాడికి పెళ్ళిళ్ళు చేశారు ఆఖరివాడే కిశోర్ స్టేట్స్‌కి వెళ్ళి రిసెర్చి చెయ్యాలన్నది అతని ఆశయం

అమెరికాలో స్థిరపడిపోయిన డాక్టర్ సుధాకరరావు శ్యామలకు స్వయాన అన్నయ్య అమెరికాలోని స్పేస్ రిసెర్చి సెంటర్‌లో మంచి సైంటిస్ట్‌గా పేరుపొందాడాయన

ఆయనకు ఒక కొడుకు కూతురు ఎప్పుడో వాళ్ళకు ఊహ తెలినపుడు ఒక్కసారి భారతదేశానికి వచ్చి వెళ్ళారు మళ్ళీ భారతదేశాన్ని వారు చూడనేలేదు అమెరికా పౌరసత్వం పొంది అక్కడే స్థిరపడిపోయారు సుధాకరరావు దంపతులు ఆయనకు భార్యంటే మహాప్రేమ ఈ మధ్యనే యెప్పుడో ఆమె పోయిందట ! కూతురు కొడుకు కూడా చదువుకుంటూ ఉద్యోగాలు చేసుకుంటున్నారట ! ఎంత కల వారి బిడ్డలకైనా యిది సహజమట ఆ దేశంలో !

ఉత్తరం ముక్కయినా వ్రాయకుండా అకస్మాత్తుగా ఊడిపడ్డాడు సుధాకరరావు వచ్చికూడా వారమైంది ఎందుకొచ్చాడో యేమిటో చెప్పలేదు యెప్పుడు వెళ్తాడో తెలీదు ముభావంగా వుంటున్నాడు ఒకసారి పాండిచేరి అరవిందాశ్రమానికి వెళ్లొచ్చాడు

ఉదయానే లేచి మార్నింగ్ వాక్ వెళతాడు వచ్చి పాలు ఆమ్లెట్ తీసుకుంటాడు స్నానంచేసి పేపర్లు పుస్తకాలు చూస్తాడు ఒంటిగంటకు భోంచేసి లైబ్రరీకి వెళతాడు నాలుగ్గంటల కొచ్చి సాండ్‌విచ్ ఓవల్‌టీన్ తీసుకొని ఓ గంట యీజీఛైర్‌లో నడుం వాలుస్తాడు మళ్ళీ అయిదుకు లేచి పొలాల గట్లకి షికారు వెళతాడు రాత్రి తొమ్మిదింటికి వచ్చి ఆమ్లెట్ పాలు పళ్ళు తీసుకొని విశ్రమిస్తాడు తానెందుకు వచ్చాడో తన అంతర్యమేమిటో ఎవ్వరికీ చెప్పలేదు పెళ్ళి విషయంగానీ తన కుటుంబ సంగతులుగానీ మాట్లాడడంలేదు అడగడానికి అవకాశం యివ్వడంలేదు అలాగని అంత గొప్ప మేనరికాన్ని ఎలా వదులుకోవడం ? అందుకే అన్నిటికీ ఓర్పు వహించి యెలాగైనా సంబంధాన్ని

ఖాయపరచాలని శ్యామల విశ్వ ప్రయత్నం చేస్తోంది

* * *

శ్యామల చెప్పినట్టే భర్త పెద్దమనుషులను శాస్త్రిగారిని వెంటబెట్టుకొచ్చాడు అందరికీ కాఫీ ఫలహారా లిచ్చారు అప్పటికే యీజీఛైర్‌లో విశ్రాంతి తీసుకుంటున్నాడు సుధాకరరావు అందరూ ఆయనున్న గదికి వచ్చి నమస్కరించి చుట్టూ కూర్చున్నారు సోఫా కుర్చీలు మోడాలమీద

తలా ఓ రకంగా పలకరించి పరామర్శించారు శ్యామల గడప కానుకొని నిల్చుంది గోపాలరావు సోఫాలో హుందాగా కూర్చున్నాడు భార్యా-భర్తలు ప్రవేశపెట్టిన పాత్రయు నాటకం ప్రారంభించాయి

కిశోర్ అమెరికాలో సెటిల్ అవ్వడం లోని వుద్దేశాన్ని విడమరిచి చెప్పారు మేనరికాన్ని విడిచిపెట్టడానికి వీల్లేదన్నారు కట్నం పుచ్చుకోకుండా పెళ్ళి చేసుకుంటానని శపథం చేసిన విద్యార్థి బృందానికి నాయకుడు కిశోర్ అని చెప్పారు కిశోర్ గుణగణాలను విద్యాభివృద్ధిని కొనియాడారు అలాంటి ఆదర్శపురుషుడు యీ అమెరికా సంబంధం చేసుకోవడం దేవతలు మెచ్చే విషయమన్నారు బ్రహ్మ లిఖితం అన్నారు ఇంకేవేవో రకరకాల పదాలు పలికారు ! ఆఖరికి శాస్త్రిగారిని లగ్నాలుకూడా చూడమన్నారు

కానీ యీ అభినయం సంభాషణం సుధాకరరావు వింటున్నాడా ? అన్న సందేహం గోపాలరావుతోపాటు మరికొందరికి కూడా కలగకపోలేదు !

సుధాకరరావు చూపులు ఎక్కడో కేంద్రీకృతమై వున్నాయి ఊ అనిగానీ ఆ అనిగానీ అనలేదు ఏమిటీ వాలకం ?

అంతలో విగ్రహం కదిలినట్లు సుధాకరరావు కదిలి కాస్త సర్దుకొని కూర్చున్నాడు అందరివంకా నిదానంగా చూశాడు అతని చూపులో గంభీరత ప్రస్ఫుటించింది బరువుగా నిట్టూర్చాడు

జలాశయంలా కనిపించేవి నిజమైన నీటిమడుగులు కావు ! అవి కేవలం యెండమావులు ! వోన్లీ మిరేజస్ !" సుధాకరరావు ప్రారంభించాడు అప్పటివరకు మాట్లాడిన వారంతా మౌనం వహించారు

"ఈ సంగతి మీలో చాలమందికి తెలిసినా యెడారిని చూసినవారికే అవి అనుభవమవుతాయి లైక్ మీ పీపుల్ ! అలాగే మనకు దూరంగా ఆకాశంలో కనిపించే ఆ తెల్లని చల్లని చంద్రుడు ప్రాణికోటి జీవించడానికి పనికివస్తాడంటారా? నాటెటాల్ యూస్‌ఫుల్ ! యెంతమాత్రమూ పనికిరాడు !




పెళ్ళి పెద్దలంతా ముఖముఖాలు చూసుకున్నారు. 'మనం ప్రారంభించిన విషయమేమిటి ? ఈయన చెప్పే దేమిటి ?...'

"ఇదంతా తెలిసికూడా, ఎవరైనా చంద్రమండలానికి 'హనీమూన్' కి వెళ్తామంటే, మన కెంత హాస్యాస్పదంగా వుంటుందో, 'అమెరికాలో సెటిల్ అవ్వాలి' అనే యువతరాన్ని చూసినా, నా కలాగే వుంటుంది !" అందరి ముఖాలవంక పరిశీలనగా చూశాడు సుధాకరరావు.

యెవ్వరికీ ఆ మాటలు రుచించినట్టు లేవు.

"భలేవారండి మీరు !" శాస్త్రి అందుకున్నాడు. "నేతి మిఠాయిని చూస్తే మాకు నోరూరుతుంది. రోజూ తినేవాళ్ళకి మొహం మొత్తుతుంది. అంతమాత్రాన మమ్మల్ని 'తినకండి' అనడం భావ్యమా ? సెలవియ్యండి తమరే !"

"బాగా చెప్పారు శాస్త్రిగారూ!" రంగయ్య అందుకున్నాడు. "అయినా అవేం మాటలు సుధాకరం బావగారూ ? ఒక్కొక్కరిదీ ఒక్కోరకమైన అభిరుచి ! మనం 'దూరపు కొండలు నునుపు' అన్నంతమాత్రాన, యువతరం వూరుకుంటుందా ? ... హిమాలయాలు సైతం యెక్కి జండాలు పాతడం లేదూ ? అంతే ! ఎటు వెళ్ళదలచుకున్నవాళ్ళని అటు పోనివ్వవలసిందే ! ఆ పైన ఎవరి అదృష్టం వారిది!"

"నిజమేనండి ! నేటి యువతరానికి మనం అడ్డుచెప్పరాదు !" సమర్థించాడు రామయ్య.

"చూడు సుధాకరం ! నీకన్నా వయస్సులో పెద్దవాడిని నేను. ఈ మాటలన్నీ అనవసరం ! ఒక్క టడుగు తానుచెప్పు! అసలు కిశోర్‌కి పిల్లనివ్వడం నీకు యిష్టమా, కాదా ?" పుల్లయ్య అడిగాడు.

ఓ క్షణం తలవంచుకున్నాడు సుధాకరరావు. భారంగా ఊపిరి తీసుకున్నాడు.

"కిశోర్‌కి మా అమ్మాయిని యివ్వడమే మీ అందరికీ ముఖ్యమనుకుంటే, నా కెలాంటి అభ్యంతరంలేదు పుల్లయ్య బాబాయ్ !" గంభీరంగా అన్నాడు సుధాకరరావు.

"అద్గదీ సంగతి !" వెంకయ్య అందుకున్నాడు. "శాస్త్రీ ! యిక చూసెయ్యవయ్యా లగ్నాలు !"

శాస్త్రి తక్షణం పంచాంగం తెరిచి, గాలించసాగాడు.

"నే నీ దేశం విడిచి పాతికేళ్ళు పైబడింది ! ఈలోగా, యింటా-బయటా కూడా అనేకరకాల మార్పులొచ్చాయి. ఎంత స్వంతమైనా, వియ్యమందుకో బోతున్నాం కనుక, నా గురించి రెండు ముక్కలు ముందుగానే మనవి చేసుకోవడం నా ధర్మం బాబాయ్ !" సుధాకరరావు అన్నాడు.

గోపాలరావు శాస్త్రివంక చూచి, 'నువ్వు కానియ్యవయ్యా!' అన్నట్టు కన్ను గీటాడు.

"రవి, సంధ్య పుట్టిన తర్వాతే మేము అమెరికాలో స్థిరపడ్డాం. !" సుధాకరరావు ప్రారంభించాడు. "ఇప్పుడు రవికి యిరవై, సంధ్యకి పద్దెనిమిదేళ్ళ వయస్సు ! రవి యింజనీరింగ్, సంధ్య మెడిసిన్ చదువుతున్నారు.

"మేము ప్రతివారం మిగతా అమెరికన్లలాగే, 'వీక్‌యెండ్స్'కి యెక్కడికైనా వెళుతుండేవాళ్ళం ! మాతోనే వచ్చి, పిల్లలుకూడా సరదాగా గడిపేవారు.

మా భోజనపు అలవాట్లు కూడా క్రమేపీ మారాయి. పళ్ళు, బ్రెడ్, చికెన్, మటన్, బీఫ్ వగైరాలు తీసుకుంటున్నాము. మా పిల్లలకి యివి బాగా నచ్చాయి. కేక్‌లు, బిస్కట్టులు రోజూ కావాలి !

అక్కడి వాతావరణాన్నిబట్టి బీరు, బ్రాందీ, విస్కీ వగైరాలు తీసుకోడం ప్రారంభించాము. పిల్లలు కూడా సిప్ చేస్తూంటారు.

వాళ్ళు పెద్దవాళ్ళయ్యేకొద్దీ, మాతో పాటు 'వీక్‌యెండ్స్'కి రావడం తగ్గించి తమ-తమ మిత్రబృందాలతో వెళ్ళడం మొదలెట్టారు. డాన్స్, సంగీతం నేర్చు

కున్నారు తరచూ నైట్ క్లబ్బులకి వెళుతుంటారు

"రవికి బాయ్ఫ్రెండ్స్‌తోపాటు గర్ల్ ఫ్రెండ్స్ కూడా వున్నారు అలాగే సంధ్యకి కూడా ఈ రోజుకి కూడా సంధ్య చీరె కట్టలేదు ! వారికి తెలుగు రాదు ! అదంటే యెందుకో యిష్ట పడదు !

క్లబ్‌లో అలవాటైందట సిగ రెట్లు కాల్చడం దానిని యిద్దరూ సరదాగా అలవాటు చేసుకున్నారు మా మాటలు వారు లెక్క-చెయ్యలేదు ! పైగా ఓ రోజు నన్ను డోంట్ బి సిల్లీ డాడీ ! అన్నారు సుధాకరరావు ఎక్కడో చూస్తూ చెప్పుకుపోతున్నాడు అతని ముఖంలో నెత్తురు యింకిపోయి నట్లు పేలవమైంది

నిజమే ! మందలించడం సిల్లీ నే మరి ! ఇది ఆధునిక యుగం ! దే ఆర్ యంగ్ అండ్ మాడరన్ ! దే ఆర్ మూవింగ్ విత్ ది మాడరన్ సొసైటీ! ఓ క్షణం ఆగి జేబురుమాలుతో ముఖం తుడుచుకున్నాడు సుధాకరరావు

శాస్త్రి పంచాంగం పేజీల మధ్య చూపుడువేలు యిరికించి మూసి నోరు తెరిచి మరీ వింటున్నాడు మిగతావారి ముఖాల్లో అల్లంముక్కను కొరికినంత ఫీలింగ్ వచ్చింది

సుధాకరరావు మళ్ళీ ప్రారంభిం చాడు

వాళ్ళ నడిగితే మేము అమెరి కన్స్ మంటారు ! తల్లి-దండ్రులు మాత్రమే యిండియన్సట ! కానీ వారు మాత్రం దరిద్రపు యిండియన్స్ కారట ! ఇది కేవలం అమెరికాలో జరిగే దుష్ప్రచార ప్రభావమంటే తప్పులేదు! ఇటీజ్ బాడ్‌లక్!

"అమెరికాలో యువతీ-యువకులు సాధారణంగా క్లబ్బులకి వొపేరాస్‌కి వెళ్ళి తిరిగి తిన్నగా యిళ్ళకు రావడం అరుదు తరచూ మిగిలిన రాత్రంతా బాయ్‌ఫ్రెండ్‌తోనూ గర్ల్‌ఫ్రెండ్‌తోను గడిపి తెల్లవారి యిళ్ళకి చేరుతుంటారు! ఇది అక్కడి యువత కున్నటువంటి స్వేచ్ఛ ! అది మనకైతే ఆక్షేపణగానీ అమెరికన్లకి కాదు !

అమ్మాయి అబ్బాయి కలిసి తిరగవచ్చు ! డాన్సులూ పార్టీలూ యింకా-యింకా వాళ్ళ కోరికలకు తగిన పనులేవైనా చేసుకోవచ్చు ! ఒకరి కొకరు బాగా నచ్చితే అప్పుడు తల్లి దండ్రుల కా సంగతి చెప్పి పెళ్ళి చేసు కోవచ్చు ! లేదనుకుంటే మళ్ళీ యింకె వరితోనైనా స్నేహం ప్రారంభించ వచ్చు !

"గర్భస్రావం అతి సూక్ష్మమైన విషయం అక్కడ ! ఆ జంటకి నచ్చక పోతే అబార్షన్ చేయించుకొని మళ్ళీ కొత్త స్నేహం చేసుకోవచ్చు ! ఇది వారి పద్ధతి ! మరి అనేక రకాల

కట్టుబాట్లతో వుండే భారతీయ జీవన విధానం దీని కెంతో విరుద్ధం ! ...

"అందుకే, డబ్బూ-చదువూ వున్న మన భారతీయులకి కూడా గుండెల్లో జవనాశ్వాలు ఎగిరెగిరి పడుతుంటే, అమెరికాలో వాటిని స్వేచ్ఛగా తిరగ నివ్వవచ్చు ! అక్కడ శీలాన్ని గురించి అంతగా పట్టించుకోరు ! మరి, 'మేము భారతీయులం కాదు, అమెరికన్లమే !' అనుకొనే భారతీయుల గురించి ప్రత్యేకంగా మీకేం చెప్పను?... నా కూతురు, కొడుకు కూడా 'మేము భారతీయులం కాదు' అంటున్నారన్న విషయం మీకు చెప్పడం నా ధర్మం !" అని కుర్చీలో వెనక్కువాలి, కళ్ళు మూసుకున్నాడు, పెద్దగా నిట్టూర్చి.

అందరి మనసులు కాస్తంత కలవర పడ్డాయి. శాస్త్రి పంచాంగం సంచీలో పెట్టి, చిటికెలేస్తూ ఆవులించి, 'నారాయణ' అనుకున్నాడు మంద స్వరంలో.

"అదేం మాటలే అన్నయ్యా ! అందరూ అలా ఎందుకుంటారు ? అగ్నిహోత్రంలాంటి వంశం మనది !" శ్యామల సమర్థించింది.

"అవునవును. ఐసుగడ్డ పెడితే సరి !" భర్త దెప్పిపొడిచాడు.

ఇవన్నీ పట్టించుకున్నట్టు లేదు సుధాకరరావు. కళ్ళు మూసుకొని గతాన్ని చూస్తున్నాడేమో, మళ్ళీ ప్రారంభించాడు.

"నేనోసారి లాస్‌ఏంజిల్స్‌కి వెళ్లాను, పనిమీద. తిరిగి రావడానికి నాల్రోజులు పట్టింది. తీరా యింటికొస్తే యిల్లు తాళంవేసి వుంది. మా ఆవిడ కనిపించ లేదు. తాళంతీసి, లోపల చూసాను. ఇల్లు రెండుమూడ్రోజులనుంచి వూడ్చి నట్టులేదు. పిల్లలు 'వీక్‌యెండ్'కి వెళ్ళి వుంటారు. మరి వాళ్ళమ్మ యెక్కడి కెళ్ళినట్టు ?

"నాకేమీ అంతుపట్టక, పక్క అపార్ట్‌మెంట్‌లో అడిగాను. కిందటి శుక్రవారం సాయంత్రం ఆమెకు 'హార్ట్ యెటాక్' వస్తే, అంబులెన్స్ వచ్చి, హాస్పిటల్‌కి తీసుకెళ్ళిందట ! తర్వాత యేమైందో తెలీదన్నారు."

"నేను గజగజ లాడిపోయాను. వెంటనే హాస్పిటల్‌కి ఫోన్ చేశాను. వారు పిడుగుపాటులాంటి వార్త చెప్పారు. నా గుండెలు బ్రద్దలయ్యాయి! నా భార్య హాస్పిటల్లో చేరిన అయిదు నిమిషాలకే శాశ్వతంగా కన్నుమూసిం దట ! నన్ను వదిలి వెళ్ళిపోయింది !"

...సుధాకరరావు కంఠం వణికింది. దుఃఖం సంతరించుకుంది. చెంపల మీదుగా రెండు కన్నీటిబొట్లు దొర్లి పోయాయి.

"ఈ ఘోరమైన విషయాన్ని వెంటనే మా అమ్మాయికీ, అబ్బాయికీ

తెలిపారట ! వారెక్కడ 'షాక్' అయి పోయారో అని భయపడ్డాను. కానీ, అలాంటిదేమీ జరగలేదు ! యేవో 'వీ యెండ్' ప్రోగ్రామ్స్ వేసుకున్నారట ! అందువల్ల కన్నతల్లి శవాన్ని తీసుకెళ్ళి క్రిమేట్‌చేసే టైమ్ లేదట ! సోమవారంగానీ, మంగళవారంగానీ వచ్చి, చూస్తామన్నారట !"

"రక్తం పంచి, జన్మ నిచ్చిన ఆ మాతృమూర్తిని చూడటానికైనా నా బిడ్డలు వెళ్లలేదు ! వాళ్లకి టైమ్‌లేదు ! ...అదే భారతీయుడైతే, కన్న తల్లే కాదు, యే బంధువైనా, స్నేహితుడైనా పోయినట్టు తెలిస్తే, అలా విడిచిపెట్టి పోతాడా ? ఆ దుఃఖంలో క్రుంగి పోకుండా వుంటాడా ? కులాసాలకి, విలాసాలకి పోతాడా ? ... తల్లి మర ణానికి రవ్వంతైనా బాధపడకుండా, వారి విలాసాలకి భంగమని భావించారు నా బిడ్డలు !"

"ఇదా తల్లిపట్ల ఓ కుమారుడి బాధ్యత ? కొడుకుచేత తల కొరివి పెట్టించుకోవాలనుకొనే భారతీయ మాతకి యిదా ప్రతిఫలం ? శవాన్ని హాస్పిటల్లో పారేసి, తమ సుఖాలకి బానిసలయ్యే పిల్లలు మనుషులేనా ?... ఇదమ్మా నా బిడ్డలు అమెరికాలో పెరిగి అలవరుచుకొన్న సంస్కారం !

"అదే యిక్కడ జరిగితే మీ రెవ రైనా అంగీకరిస్తారా ? వూరు కుంటారా? ... అంతా మా ఖర్మం!... ఆ రోజే నా భార్య శవాన్ని నేనే హాస్పిటల్‌నుండి తెచ్చుకొని, నాకు బిడ్డలే పుట్టలేదనుకొని, నేనే దహనసంస్కారం చేశాను బాబాయ్ ! నా భార్యని మన్ను చేశాను !" సుధాకరరావు రెండు చేతులతో ముఖం కప్పుకొని, భోరున యేడ్చాడు

పుల్లయ్య పై పంచెతో కళ్లు వొత్తుకున్నాడు. శ్యామల నోటికి గుడ్డ అడ్డం పెట్టుకుంది. ఆమె కన్నులు అశ్రుపూరితాలయ్యాయి.

"అంతా అయ్యాక మరునాటి వుదయం అంటే మంగళవారం, నా కొడుకు, కూతురు వచ్చారు. ఏడుస్తున్న నన్ను చూసి, 'సారీ డాడీ—సారీ' అన్నారు. సంతాపం వ్యక్త పరిచి, ధైర్యం చెప్పారు...నన్ను మళ్ళీ పెళ్ళిచేసుకోమన్నారు బాబాయ్ ! మళ్ళీ పెళ్ళాడమన్నారు, నా బిడ్డలు !... మైగాడ్ ?? నేనేం చెయ్యను ?.? ... 'చనిపోయిన తల్లిని దహనం చెయ్యాల్సిన శ్రమ తప్పించావు' అంటూ, నా బిడ్డలు 'థాంక్స్' చెప్పారమ్మా... నాకు థాంక్సుచెప్పారు శ్యామలా !..." పసిపిల్లవాడిలా విలపించాడు సుధాకర రావు.

శ్యామల కూడా ఓర్చు కోలేకపోయి, అన్నతోపాటే యేడ్చేసింది. గోపాల రావు కంగారుపడి, ఆమెను ఓదార్చడానికి ప్రయత్నించాడు.

"ఆనాటినుండి వాళ్ళ ముఖం చూడా

లంటే నాకు అసహ్య మనిపించేది ! అందుకే ఆస్తులన్నీ వాళ్ళ కప్పగించి, రెండు లక్షలు నా పేరుతో బాంక్ చేసి, శాశ్వతంగా ఆ దేశాన్నీ, వారినీ విడిచి వచ్చేశాను ! ఇప్పుడు నాకు బిడ్డలు లేరు ! బంధాలు లేవు ! నే వంటరి వాడిని ! అన్నీ కోల్పోయినవాడిని !"

"ఐహిక సుఖాలే ముఖ్యమనుకొనే దేశ మది ! ఆ దేశంలో స్థిరపడాలన్న వ్యామోహం యింకా మీకుంటే వెళ్ళండి ! అది మీ ఖర్మ ! అక్కడ మోహం తప్ప ప్రేమ లేదు! ఆశ తప్ప తృప్తిలేదు !! ఆందోళన తప్ప ఆత్మ శాంతిలేదు !!! అదే ముఖ్యమనుకుంటే వెళ్ళండి."

"సైన్సు అభివృద్ధి చెందింది ! కాబట్టి, పై చదువుల కెళ్ళండి! పరిశోధనలు చేయండి ! ఉద్యోగాలు చేయండి ! పేరు — ప్రతిష్ఠలు పొందండి ! డబ్బు సంపాయించండి ! కానీ, మీ సంస్కృతిని విడకండి ! మీ జాతీయతని కోల్పోకండి ! మీ సాంప్రదాయాలని మరవకండి !"

"అమ్మా ! శ్యామలా ! 'అమెరికా సంబంధం' గురించి నువ్వూ, బావ గారూ, యింకా మన పెద్దలూ బాగా ఆలోచించి నిర్ణయించుకోండి ! మీకే కాదు. యావన్మంది భారతీయులకి నా యదార్థ జీవితమే ప్రమాణం ! ఆలోచించుకోండి ! శాస్త్రిగారూ ! మీరు కూడా !"

సుధాకరరావు మాటలు విని, అంతా లేచారు.

"మేరేజస్ ఆర్ మేడిన్ హెవెన్ అన్నారేగానీ, అమెరికా అన్నారా శ్యామలమ్మా ? మీ అబ్బాయికి పెళ్ళాం మన దేశంలోనే యెక్కడో ఓ చోట పుట్టే వుంటుంది. ఇక ఆవిడని గాలిద్దాం! యేమంటారు ?" అంటూ శాస్త్రి బయటికి సాగాడు.

"అమెరికా సంబంధానికి ఓ నమస్కారం. వస్తామండి !" రామయ్య బయటికి నడిచాడు.

"శ్యామలా ! నీకు లక్షరూపాయలు, అరవిందాశ్రమానికి ఓ లక్షరూపాయలిచ్చి, నేను ఆ ఆశ్రమానికే వెళ్ళిపోతానమ్మా !" సుధాకరరావు అన్నాడు.

"వద్దన్నయ్యా ! అలా అనొద్దు అన్నయ్యా ! నువ్విక్కడే ఉండు ! నన్ను క్షమించన్నయ్యా !" యేడ్చింది శ్యామల.

"క్షమించు బావా ! నీ హృదయం యింతటి క్షోభకు గురైందని తెలీక నిన్ను బాధపెట్టాము. అమెరికామీదున్న వ్యామోహంకొద్దీ ఆశించామే తప్ప, నిజానిజాలు తెలుసుకోలేదు ! నీ డబ్బంతా అరవిందాశ్రమానికి యిచ్చినా ఫర్వాలేదు. నువ్వుమాత్రం మాతోనే వుండిపోవాలి !" అంటూ గోపాలరావు డాక్టర్ సుధాకరరావు చేతులు పట్టుకున్నాడు.

———



# పొట్ట కోసం

పంతుల జోగారావు

బస్సు దిగగానే నాకు తారసపడిన మొదటి వ్యక్తి అతనే.

ఆ సాయంత్రం వేళ –

దట్టమయిన మబ్బులు, రివ్వుమని వీస్తున్న చలిగాలి, చీకట్లు ముసురుకుంటున్న సమయం—ఆకాశం మెరుపులతో ఖగ్గం కలిగిస్తున్న వేళ –

బితుకుబితుకు మంటూ బస్సు దిగి చుట్టూ చూసేసరికి –

మామిడితోట. అందులోనుంచి సన్నని కాలిబాట-కొండలూ, తుప్పలూ డొంకలూ –

'రైట్'

బస్సు ధూళి రేపుకుంటూ ఆ దిక్కు-

మాలిన ప్రదేశంలో నన్నొక్కర్తినీ వదిలి వెళ్ళిపోయింది.

నాకు కళ్ళనీళ్ళ పర్యంతమయింది. కాళ్ళలో సన్నని వణుకు మొదలయింది. ఇప్పుడా ఊరు చేరడం ఎలాగ? దారీ తెన్నూ తెలీని ఆ కొత్త చోటుకి యిలాంటి వాతావరణంలో ఒక్కర్తినీ వెళ్ళగలనా ?

'భగవాన్' నా కేడు పోస్తోంది. నా పరిస్థితి తల్చుకున్న కొద్దీ దుఃఖం పొర్లుకొస్తోంది.

వెంట తమ్ముడ్ని తీసుకుని రావాల్సిందే. దురదృష్టవశాత్తు వాడి కిప్పుడే జ్వరం రావాలా ? అంత జ్వరంలోనూ వాడిని నాన్నకి అప్పగించి బయల్దేరక తప్పింది కాదు. నిజానికి యీ బస్సు ఇక్కడికి రెండుగంటల ముందే రావాల్సి ఉంది. కాని గేర్ బాక్స్ ట్రబులట... ఖర్మ! అదీ తనపాలిట శనిలాగ యివాళే దాపురించాలా?

ఒక చేతిలో బాగ్‌ని రెండోచేతిలోకి మార్చుకుంటూ నిర్జనమయిన ఆ వాతావరణాన్ని పరిశీలించబోయాను.

అప్పుడు కనపించేడతను. రోడ్డువార చెట్టుకి ఆనుకుని బీడీ నోట్లో వుంచుకుని నావేపే చూస్తున్నాడు నాదృష్టి తనమీద పడేసరికి నోట్లో బీడీతీసి తుపుక్కున ఉమ్మి 'ఎవరు నువ్వు' అనడిగేడు.

నా గుండె గుబగుబలాడింది.

అలా అడుగుతున్నప్పుడు అతని ముఖంలోకి లిప్తకాలం చూసాను. నా ఒళ్ళు ఝల్లుమంది. నా రక్తం చల్లబడిపోయినట్లయింది. నా మెదడు స్వాధీనం తప్పినట్లయింది. నా నరాలు పీక్కుపోతున్నట్టు, నేను తెలీని అగాధంలోకి అన్యాయంగా జారిపోతున్నట్టు అనిపించింది.

ఆ కళ్ళు......

ఎంత భయంకరంగా ఉన్నాయని! ఆ కళ్ళలో ఎర్రజీరలు భయం గొల్పుతున్నాయి. మాసిన జుట్టు అసహ్యకరంగా ముఖంమీద చిందరవందరగా పడివుంది. చిరుగుల బొంత భుజాలమీద కప్పుకుని ఉన్నాడు. మొత్తంమీద అతని ఆకారం మొరటుగానూ, వెగటుగానూ ఉంది.

నిప్పు కణికెల్లాగా వెలిగిపోతున్న ఆ కళ్ళలోకి చూసేసరికి నాలో పిరికితనం ప్రవేశించి, నీరసం ఆవహించనారంభించింది.

ఎవ రీ మనిషి ?

ఎంత భీకరంగా ఉన్నాడు? మరెంత అసహ్యకరంగా ఉన్నాడు? ఈ నిర్జన ప్రదేశంలో అతను నాకేదైనా హాని తలపెడితే ? ఆకులా వజవజ లాడిపోయాను.

సన్నని ఇల్లు మొదలయింది. మెరుపులు ఉధృత మయాయి. ఎక్కడో ఫెళఫెళమంటూ పిడుగుపడింది.

'ఎవరు నువ్వని అడిగితే పలకవేం మొద్దులాగా?'

నాకు అంత చల్లని వాతావరణం లోనూ గొంతు తడారిపోసాగింది. అతని స్వరం-గరుకు గచ్చుమీద డబ్బారేకుతో గీచినట్టు—ఎంత కరుకుగా ఉంది!

భయంచేత కాబోలు, చేతిలో హేండ్ బాగ్ రెట్టింపు బరువై పోయినట్లయి చెయ్యి లాగేస్తోంది.

చెట్టుక్రింద వర్షపు జల్లు పడనిచోట నిల్చుని మరో బీడీ అంటించుకో బోయా డతను. గాలి అతని ప్రయ త్నాన్ని కొనసాగనివ్వలేదు. ఒక చెడ్డ తిట్టుతో గాలిదేవుడ్ని తిట్టి, బీడీ జేబులో వ్రదేసుకున్నాడు.

'మూగిపిల్లవా ?'

వదిలేలా లేడు. ఏదో చెప్పాలి. గొంతు పెగుల్చుకుని జవాబిచ్చాను. 'పరిశిపాడు వెళ్ళాలి ... నన్నక్కడ టీచరుగా వేసారు.'

'పంతులమ్మ వన్నమాట!' నవ్వేడు. అతను నవ్వితే వెక్కిరించినట్టుగానూ, మాట్లాడితే మీదపడి కొట్టినట్టుగానూ ఉంటోంది తలూపేను.

'మాటలురాని మూగపిల్లలా వున్నావు-పిల్లకాయలకు నువ్వేం పాఠాలు చెబుతావు!' నవ్వేడు నా కతనిమీద బలే కోప మొచ్చింది. జవాబు చెప్పలేదు.

'పద-నేనూ అక్కడికే— నే నుండేదీ పరిశిపాడులోనే' అని బయలుదేరాడు. ఈ దుర్భర వాతావరణంలో నాకు తోడుగా వచ్చేది-మృగంలాంటి యీ మనిషా ! నేను నిల్చున్నచోటునుంచి కదలకపోవటంతో ఆగి వెనుతిరిగి చూసే డతను. ఆ కళ్ళు నావేపు చూసేసరికి అప్రయత్నంగానే గబగబ ముందుకు నడిచాను.

దారంతా గతుకులమయం. అడుగు తీసి అడుగువెయ్యడం దుర్భరమై పోతోంది. చేతిలో యీ బరువొకటి. ఛ! నా పరిస్థితి నాకే జాలికలిగిస్తోంది.ఎన్నో ప్రయత్నాలమీద-ఎందరికాళ్ళో పట్టుకుని ఎన్ని అవమానాలో భరించి, ఎన్ని అవహేళనలో సహించి, సంపాదించు కున్న ఉద్యోగం! వచ్చిన ఉద్యోగాన్ని ఎలాజారవిడుచుకోగలను? కష్టమయినా, నష్టమయినా—ఎన్ని బాధలకయినా ఓర్చు కుని పరిశిపాడు వెళ్ళి జాయినవక తప్పదు. సింగిల్ టీచరు స్కూలు. జాయినయి కొంతకాలం పనిచేస్తే కాస్త మంచి ఊరికి ట్రాన్స్ఫర్ చేస్తానమ్మా అని నచ్చచెప్పి పంపించేసారు బి డి.ఓ. గారు. నాన్న బట్టలకొట్లో గుమస్తా. పండగ సీజను కావటంతో అతనికి ఒక్క క్షణం తీరిక దొరకటంలేదు. తమ్ముడ్ని తోడుగారమ్మందామంటేవాడు మంచానపడ్డాడు. ఒక్కర్తినీ బయలు దేరక తప్పిందికాదు. కొత్త ప్రదేశం ...దారి తెన్నూ తెలీదు.

ధైర్యంచేసి బయలుదేరినందుకు—

బయలుదేరి నప్పటినుంచీ అన్నీ అవాంతరాలే. బస్సు దిగేక ఆ ఊరి వాళ్ళెవరయినా సహాయంగా దొరకకపోతారా అనుకుంటే తనకు దొరికిన తోడు— ఈ మనిషి......

'చేతిలో సంచీ బరువుగా ఉందా అమ్మాయ్...ఇలా తే, నేను మోస్తాను.'

ఈ మనిషి అప్పుడే తనపనికి నాందీ గీతం పాడుతున్నాడు... ఈ బాగ్‌లో తన చీరెలు, గొలుసు, కొంచెం డబ్బు ఉన్నాయి—ఇవన్నీ వీడు దోచుకుపోతే తన గతేంకాను? దుఃఖం పెల్లుబికి గొంతులో గరగరలాడింది. ఏమీ చెయ్యలేని అశక్తతతో వెన్నెముక కృంగిపోతున్నట్టనిపించసాగింది.

'ఫరవాలేదులే' అన్నాను. నా గొంతు నాకే విచిత్రంగా నూతిలోనుంచి మాట్లాడినట్టుగా ఉంది.

"ఏమిటి ఫరవాలేదు నీ ముఖం — యిలా తే నేను మోస్తాను—మోసినందుకు అర్ధరూపాయి యివ్వు చాలు."

అతని కళ్ళు నన్ను దహించేస్తున్నట్టు—జ్వలిస్తూ వణుకుపుట్టిస్తున్నాయి. ఆ గొంతులోని కాఠిన్యం, ప్రభుత్వం నన్ను నిస్తేజపరుస్తున్నాయి. యాంత్రికంగా బాగ్ అందించాను. అతను దాన్ని భుజాలమీద పెట్టుకున్నాడు.

*　　*　　*

ఊరి సివార్లకి చేరేసరికి వర్షం మర్నింత ఎక్కువయింది. తడిసి ముద్దయిపోతున్నాంయిద్దరమూ. నరాలలోనుంచి సన్నని వణుకు పుట్టుకొస్తుంది.

'ఎక్కడికెళ్తావు?'

అవును! ఎక్కడికెళ్ళాలి...ఆఁ... ప్రెసిడెంట్‌గారిని కలవాలి ముందు. అదే అన్నా నతనితో.

అతను పెద్దపెట్టున నవ్వేడు.

'సెబాష్...వాడింటికా? వాడో వింత పశువు పంతులమ్మా! వాడి పెళ్ళాం చచ్చి రెండేళ్ళయింది...ఊర్లో ప్రతి ఆడకూతురూ వాడి కళ్ళకి పెళ్ళాంలాగానో, సానిపాపలాగానో కనిపిస్తారు—నీ యిష్టం ఆ పైన.'

నాకు తల దిమ్మెత్తి పోయింది. ప్రళయం వచ్చి ప్రపంచమంతా తుడిచి పెట్టుకుపోతే—ఓ వ్యక్తి మిగిలితే—అతను కూడా నా అంత వంటరిగా, నిస్సహాయంగా, ఏకాకిగా అయిపోయినట్లు చలించిపోడేమో! ఇప్పుడేం చెయ్యడం దేవుడా! నాకు దారేది? ఈ ఉద్యోగం చెయ్యాల్సిన అగత్యమే లేకపోతే యీరో జీ నరకం తప్పేదికాదూ ?

'వెళ్తావా?'

అతను ముందుకు అడుగువేసాడు.

నేను ఆగిపోయాను. నా కాళ్ళు మరి ముందుకి సాగలేదు. తడిసిపోయిన చీర ఒంటికి అతుక్కుపోయి చలికి శరీరం కుంచుకుపోతోంది.

'బాగా తడిసిపోయేవు — ఇదిగో




ఇక్కడే నేనుండేది. పద, యీ రాత్రి కిక్కడ తలదాచుకుందువుగాని' అంటూ ఓ గుడిసెలోనికి దారితీసాడు.

ఎన్నో భయాలతో, ఆరాటంతో అవాక్కనై నిల్చుండిపోయాను. కళ్ళ ముందు జరుగుతున్నదంతా పీడకలలాగా తోచింది. తుఫాను బీభత్సంలో చిక్కుపడిపోయిన వంటరి నావలాగా చలించి పోయాను

రావేం-రా పంతులమ్మా '

ఆ ఎర్రజీరల కళ్ళు నన్ను రమ్మని శాసిస్తున్నాయి వాటి తీక్షణతకి తట్టుకోగలిగే శక్తి నాకు లేకపోయింది

లోపలికి వెళ్ళాను అతను లాంతరు వెలిగించాడు

'డబ్బులివ్వు.' అర్ధరూపాయితీసిఅతని చేతిలో ఉంచాను. 'చాలదు - మరో రూపాయి యివ్వు' అన్నాడు. ఈ పీడ వదిలిపోడానికి పదిరూపాయలయినా యివ్వడానికి నేను సిద్ధమే.ఓ రూపాయి నోటు తీసి యిచ్చాను. కంపుగొడ్తున్న చింకి తువ్వాలు నా కందించి 'తల తుడుచుకో- జలుబుచేస్తుంది- నేను వెళ్ళి తినడానికేదయినా తెస్తాను' అని వెళ్ళి పోయాడు

చుట్టూ చూసాను ఛీ! ఏం కొంప యిది ఎక్కడి వస్తువులు అక్కడే చిందరవందరగా పడేసి ఉన్నాయి కుక్కి నులకమంచం దానిమీద మాసిన బొంత అట్టకట్టిన తలదిండు రెండు

మూడు సిల్వరు పాత్రలు-వర్ష మంతా ఆ యింట్లోనే వుందన్నట్టు యిల్లంతా కారిపోయి తడిసి ముద్దయిపోయి ఉంది.

తల తుడుచుకుని, బట్టలు పిండుకుని సరిచేసుకునేసరికి అతనేదో ఓపొట్లమూ-గ్లాసుతో టీ తీసుకుని వచ్చేడు.

'ఇంద — కుడుం తీసుకొచ్చాను, చల్లగా ఉంది. చచ్చినోడు ఎప్పుడు చేసి వుంచాడో ఏమో-ఏదో తినాలికదా? కడుపు కాల్చుకుని పస్తుపడుకోలేవుకదా' అన్నాడు.

నా చేతిలో పొట్లాం వుంచాడు. ఆకు మూతవేసి తెచ్చిన టీగ్లాసు ప్రక్కన వుంచాడు. చిల్లరపైసలు చేతికిచ్చాడు. అతని నోటివెంట నాటుసారా కంపు నా ముక్కుపుటాల్ని బద్దలు కొడుతోంది. వెర్రిదానిలా అతనివేపు చూసాను.

'తిని పడుకో-టీలో తీపి సరిపో యిందో లేదో చెప్పు-సరిపోకపోతే ఆ నా కొడుకుని నరికి పోగులు పెట్టొస్తాను—' నేను మాట్లాడకుండా అయిష్టంగా ఓ ముక్క కొరికాను.

అతను బొంతతీసుకుని గుడిసె బయటికి వెళ్ళి గడపలో పడుకున్నాడు.

'తలుపేసుకో.' అరిచాడు పైనుంచి.

ఎంత విచిత్రమయిన వ్యక్తి!

* * *

మర్నాడు ఉద్యోగంలో జాయిన యేను ఆ వ్యక్తి నాకు చేసిన సహాయాన్ని తలుచుకుంటే ఆశ్చర్యం వేస్తోంది. అతని సహాయం లేకపోతే తన్నూరు ఆ రాత్రి వర్షంలో, చీకట్లో ఎలా చేరగలిగేదో? అతని గురించి ఎంత నీచంగా ఆలోచించింది తను! అతను మనిషి ఎలాంటివాడయినా కావచ్చు-మాట కొంచెం కరుగ్గా ఉండొచ్చు-కానీ ఆ రాత్రి నా పట్ల అతను ప్రవర్తించిన తీరు మాత్రం ఎంత ఉన్నతంగా ఉంది!

ఓ యిల్లు అద్దెకి తీసుకుని, శలవు పెట్టి విజయనగరం వెళ్ళి మరికొంత సామానుతోపాటు తమ్ముడ్ని వెంట తీసుకుని వచ్చేను.

రోజులు గడుస్తున్నకొద్దీ ఆ వాతావరణం అలవాటయిపోయింది.

ఈలోగా ఆ వ్యక్తి గురించి విచిత్రకరమయిన విషయం ఒకటి తెలిసి ఆశ్చర్యపోయాను!

అతనికి చిల్లంగి, చీడ పెట్టగలిగే క్షుద్రశక్తి ఉందిట!...నా కలాంటివాటి పట్ల విశ్వాసంలేదు. కాని ఆ చిన్న గ్రామంలో మాత్రం అలాంటి మూఢ నమ్మకాలు చాలా జాస్తిగా నాటుకొని వున్నాయి.

అదురుష్టం బాగుందితల్లీ-ఆడి సేతిల బడి-రేత్రంతా ఆడి కొంపలోతొంగుండి మీకేదీ కానేదంటే దేవుడు కాసేడనే అనాల పంతులమ్మగోరూ — ఆడి కళ్ళు సూసినారుకద? నుప్పుకణికెల్లాగ-ఆడు చిల్లంగెడతాడమ్మా - మాం ఆడి పీడ పడనేక సత్తన్నాం—ఆడు ఎవరిమీద




కోపగించుకుంటే ఆళ్ళు నాశినివయి పోవాల—అంతే' అని పాలూ, పెరుగూ యిచ్చే నరిసింహులు తాత చెప్పేడు. స్కూల్లో పిల్లలుకూడా ఆ మనిషి గురించీ — చిల్లంగి పెట్టడం గురించే మాట్లాడుతూ ఉంటారు.

వాళ్ళకి ఎలా బోధపర్చాలో తెరీక ఊరుకున్నాను.

* * *

రానురాను ఆ వ్యక్తిమీద గ్రామంలో వ్యతిరేకత ఎక్కువ కాసాగింది.అతడ్ని గ్రామం నుంచి తరిమేయాలన్న పట్టుదల గ్రామస్థులలో హెచ్చుకాసాగింది. నాకు తెలిసినంతవరకూ అతనిలో లోపం కనిపించలేదు అతనెవరికీ వ్యక్తిగతంగా హాని చేసినట్లులేదు అతనికెవరూ పని చెప్పరు. ఎవరూ అతనితో మాట్లాడరు, భయంకొద్దీ. అతనుకూడా ఆ రకం జీవితానికి అలవాటు పడిపోయినట్లు కనిపిస్తాడు. గంభీరంగా—ఎప్పుడూ ఎవరిమీదో కోపంగా వున్నట్లుంటాడు.

గ్రామంలో ఒకటిరెండు కుటుంబాలలో పిల్లలు—ఓ వయసుమీరిన వ్యక్తి—హఠాత్తుగా మంచానపడి అంతు తెలియని జబ్బుతో తీసుకుని చనిపోవడంకూడా జరిగింది. దీనితో గ్రామంలోని వారికి అతనిమీద పట్టరాని ఆగ్రహం చెలరేగింది. అతన్ని హతమార్చాలన్న పట్టుదల వారిలో ఎక్కువకాసాగింది. నాలో తీవ్రమయిన భావ సంచలనం కలిగింది ఇలాంటి మూఢనమ్మకాలంటే నాకు గిట్టవు గ్రామంలో మరణాలకి—

అతనికీ ఏమీ సంబంధంలేదని వీళ్ళ కెలా నచ్చచెప్పటం? చెప్తే అర్థంచేసు కుంటారా? నన్నో పిచ్చిదానిలా చూడరూ?

ఇదిలా వుండగా నిన్నరాత్రి నుంచీ తమ్ముడికికూడా ఒంట్లో ఏమీ బాగో లేదు. జ్వరతీవ్రతతో రాత్రంతా ఒకటే పలవరింతలు... చాలా భయంవేసింది. అందుబాటులోవున్న వైద్యం చేయించాను. తగ్గకపోతే విజయనగరం తీసుకుపోవాలి రాత్రంతా వాడు పలవరిస్తూ ఉళ్ళిపడి లేవటం-వెర్రిచూపులు చూడటం-నాకు చాలా గాభరాగా ఉంది.

అదృష్టవశాత్తు ఉదయానికి బాగా నిమ్మళించింది. చుట్టుపక్కలవాళ్లొచ్చి చూసివెళ్లారు. 'మీకు తెల్దు మేష్త్రమ్మ గోరూ! ఆ ఎదవ మీ తమ్ముడికి చిల్లం గెట్టేసినాడు-అందుకే పాపం, యీ బాబు యిలా బెదిరి బెదిరి పడుతున్నాడు...' వాళ్ళమాటలు ఓ ప్రక్క భయాన్నీ, మరోప్రక్క చిరాకునీ కలిగిస్తున్నాయి.

తమ్ముడికి కాఫీ కాచి యిచ్చి స్కూలుకి బయలుదేరాను. దారిలో ఆ గుడిసెదగ్గరికి వచ్చేసరికి అతను అరుగుమీద కూర్చుని చొక్కాకి చిరు గులు కుట్టుకుంటూ కనిపించాడు. పలక రింపుగా నవ్వేడు.

'ఇలారా' పిలిచేను. ప్రశ్నార్థకంగా నావేపు చూసి 'ఏం?' అన్నట్లుగా తలెగ రేసాడు. 'నీతో కొంచెం మాట్లాడాలి— అలా స్కూలువేపుకి పద' అంటూ నడిచాను. అతను వెంటవచ్చాడు స్కూలు సమీపానికి వచ్చేక- 'నే నొకటి అడుగుతాను—నిజం చెబుతావా?' సూటిగా అడిగాను.

విసురుగా తలెగరేసాడు. నేను లక్ష్య పెట్టదల్చుకోలేదు. రాత్రితమ్ముడి పరిస్థితి నా మనసుని చాలా వ్యాకుల పరిచింది. 'ఇవాళ ఓ సంగతి తేల్చి పారెయ్యాలి.' దృఢంగా నిర్ణయించు కున్నాను.

'గ్రామంలో అంతా నీకు చిల్లంగి పెట్టడం తెలుసుననీ — నీకలాంటి నీచ శక్తులున్నాయనీ అంటున్నారు-ఊళ్ళో యీమధ్య చావులకికూడా నువ్వు కారణం అంటున్నారు - నాకిలాంటి వాటిలో నమ్మకం లేదు— కాని నిజం చెప్ప- నీకలాంటి శక్తి ఉందా? అసలు చిల్లంగి పెట్టడం అనేదంటూ జరుగుతుందా? అని అడిగాను.

అతను నిర్లిప్తంగా నిట్టూర్చాడు జవాబు చెప్పడం యిష్టంలేనట్లు ముఖం చిట్లించాడు. మళ్ళీ ఏమనుకున్నాడో స్వరం తగ్గించి యిలా అన్నాడు 'నువ్వడిగేవు కనుక చెప్తాను పంతు లమ్మా—నిజానికి నాకు చిల్లంగీ తెలీదు చీడా తెలీదు-నా కళ్లు మొదటినుంచీ యిలాగే వుంటాయి ... ఏదో జబ్బని పెద్దాసుపత్రిలో చెప్పారు. వైద్యం చేయించుకునేందుకు నాదగ్గర డబ్బెక్క డుంది గనక? పొట్ట చేత్తోపట్టుకుని యీ

ఊరొచ్చాను – మలమలమాడిపోయానే తప్ప నాకెవ్వరూ పనివ్వలేదు. కారణం నాకళ్లు!– నాకేదో చిల్లంగి పెట్టగలిగే శక్తి ఉందని వీళ్ళంతా నమ్మేరు– అందుకే నన్ను చూస్తే వీళ్ళందరికీ బెదురు...బ్రతుకుతెరువుకోసం వాళ్ళ భయాన్నీ, తెలివితక్కువతనాన్నీ వాడుకుంటున్నాను. ఏ గడపముందుకు వెళ్ళి అడిగినా లేదనకుండా నూకలో, బియ్యమో తెచ్చి యిచ్చేసి–భయంతో తలుపులేసుకుంటారు ఆడంగులు... ఏమయితేనేం? నాకు చేతిలో పనిలేక పోయినా, రోజూ వుడకేశుకు తినడానికి యిన్ని గింజలు దొరుకుతున్నాయి– వాళ్ళని భయపెట్టాలని నే ననుకోలేదు పంతులమ్మా...వాళ్ళే బెదిరి పారిపో తున్నారు...నేను చేస్తున్నది తప్పం టావా?...చెప్పు...' ఆగి ఊపిరి పీల్చు కున్నాడతను.

ఆశ్చర్యంతో అతని మాటలు విని నిశ్చేష్టురాలనై పోయాను ... జానెడు పొట్టకోసం – యీలోకంలో ఎన్ని మాయలు? ఎన్ని కుతంత్రాలు?!

బెల్ మ్రోగింది. 'ఈ విషయాలన్నీ మనసులో వుంచుకో పంతులమ్మా– ఎవరితోనన్నా అన్నావో –నా పొట్టకొట్టి నట్టే–' అనేసి అతను వెళ్ళిపోయాడు.

*   *   *

మునసబుగారి అబ్బాయి–పదేళ్ళ వాడు–మంచాన పడటంతో గ్రామంలోని పరిస్థితి అదుపుతప్పింది. ఉద్రేకంగా అంతా చేతికర్రలు తీసుకుని అతని మీదకు బయలుదేరారు. నేను వారించ డానికి ఎంతగానో ప్రయత్నించాను. నాప్రయత్నం ఫలించలేదు.తరతరాలుగా వాళ్ళలో పాతుకుపోయిన అంధ విశ్వాసాలని నాకున్న కొద్దిపాటి విజ్ఞానం జయించలేక పోయింది.

నా కళ్ళఎదురుగానే

ఒకనాటి దుర్భరమయిన కాళరాత్రి నన్నాదుకుని కాపాడిన ఆ వ్యక్తిమీద వందచేతులు పందకర్రలతో మూకుమ్మ డిగా దాడి చేసాయి...

ఆ రాత్రి–దిక్కూ మొక్కూ లేక బితుకు బితుకుమంటూ పస్తుపడుకో వలసిన నాకు–యింత సాపాటుఅమర్చిన ఆ చేతులు – యిప్పుడు అమానుషంగా తనమీద పడుతున్న దెబ్బల్ని అడ్డుకో డానికి విఫలప్రయత్నం చేస్తున్నాయి...

దీనంగా అరిచే అతని ఆక్రోశాన్ని వినలేక బాధతో విలవిలలాడిపోయాను.

పెద్దగా రోదిస్తూ, రక్తసిక్తమయిన దేహంతో–వారి మూఢనమ్మకాలకి బలి పశువైపోయి–దారుణంగా హింసించబడి– దిక్కుతోచని విధంగా పారిపోవటం ప్రారంభించాడు.

అతని వెనుక——

రాళ్లు విసురుతూ ... బూతులు తిడుతూ... వాడి పీడ తమ గ్రామానికి శాశ్వతంగా వదిలిపోతోందన్న సంతో షంతో – అతన్ని వెంటతరుముతూ– పెద్దలూ...పిన్నలూ...

———

# పెళ్లానికో ఉత్తరం

రేడియో స్టేషన్‌లో పనిచేసే ఓ ఎనౌన్సరు పురిటికి పుట్టింటికి వెళ్ళిన తన భార్యారత్నానికి ఇలా ఉత్తరం రాశాడు:

శక సంవత్సరం 1898.
**మాఘం 12,**
**అ**నగా 1976 వ సంవత్సరం డిశంబర్ 5వ తేదీ ఉదయం—

ప్రియమైన భార్యారత్నానికి...

నేను క్షేమంగానే ఉన్నాను నీ ఆరోగ్యం ఎలా ఉంటోంది ?...ప్రతి స్త్రీకీ మాతృత్వం అనేది దేవుడిచ్చే దివ్యమైన వరం !... అదొక అందమైన అనుభూతి !! ఆ అనుభూతి నీకు త్వరలోనే కలుగబోతోంది...ఆరోగ్యం జాగ్రత్త...

ఇహపోతే, నువ్వులేని ఇల్లు-ఎనౌన్స్‌మెంటు లేని కార్యక్రమంలా అయోమయంగా ఉంటోంది ... మూడురోజుల క్రితం పనిమీద విజయవాడ వచ్చి — అట్నుంచి మీ ఊరు కూడా రావాలని అనుకున్నాను ... కాని అనివార్య కారణాలవల్ల కార్యక్రమంలో అంతరాయం కలిగినందుకు చింతిస్తున్నాను...

ఇక్కడ వాతావరణంలో చెప్పుకోదగిన మార్పులు ఏమీ లేవు ... గాలిలో తేమమాత్రం మూడు శాతం ఉంటోంది. ...మీ ఊళ్ళో చెదురుమదురుగా జల్లులు పడుతున్నాయని విన్నాను ... వానలో తడిసేవ్ జాగ్రత్త !...

ఇప్పుడు సమయం పదకొండు గంటలు కావస్తోంది ... మరికొన్ని క్షణాల్లో నేను డ్యూటీకి వెళ్ళాలి... విశేషాలు మళ్ళీ ఉత్తరంలో ముచ్చటించుకుందాం...

అంతవరకూ శలవా మరి ?...

నీ

..............."

*జీడిగుంట రాజ్యలక్ష్మి*




## 13

"పెద్దపాపా ! రైలుకి టైమ్ అవుతోంది ! మీ తాతయ్యకి చెప్పి, త్వరగా బయలుదేరండి. వెళదాం." వెంకట్రామయ్య చుట్ట వెలిగిస్తూ అన్నాడు.

పెద్దపాప, తర్వాత పిల్లలు అప్పటికే, తలలు దువ్వుకుని, ప్రయాణానికి సిద్ధం అయి, సంచీ పట్టుకుని ఉన్నారు.

"నిన్నే ! దీపపు సెమ్మెలా అట్టా నుంచుంటావే ! వెళ్ళు. మీ నాన్నకీ, మీ తాతయ్యకి చెప్పిరా." మేనమామ కసిరాడు.

పెద్దపాప అడుగులో అడుగు వేస్తున్నట్లుగా, ముసలాయన దగ్గరికి వెళ్ళింది.

"వెళ్తున్నాం." ముక్తసరిగా అనేసి వెనక్కు తిరిగింది.

ఇదంతా భవానీప్రసాద్ వింటూనే ఉన్నాడు.

అతను ఆ గదిలోనే బట్టలు సర్దుతున్న శారద దగ్గరికి వచ్చాడు.

"శారదా !"

శారద చేస్తున్న పని ఆపేసి, తల ఎత్తి చూసింది.

అతను ఏదో చెప్పాలని ప్రయత్నిస్తున్నట్లుగా, మళ్ళీ చెప్పలేనట్టుగా, మొహమాటంగాను ఆగిపోయాడు.

"ఏం కావాలి ?"

"ఆ పిల్లలున్నారే – వాళ్ళని వెళ్ళొద్దను. ఇక్కడే ఉండమను. ఇక్కడే ఉంటారని ఆయనకి చెప్పు." గబగబా అనేసాడు.

శారదకి విచిత్రంగానూ, సంతోషంగా అనిపించింది.

"నేను చెబితే ఏం బాగుంటుంది ! మీరే చెప్పండి," అంది.

"ఉహుఁ ! నువ్వే చెప్పు. నేను చెప్పానని నా మాటగా చెప్పు."

శారద క్షణంసేపు తటపటాయించింది ! ఒక్క నిముషం తదేకంగా అతనివైపు చూసింది. తర్వాత, ఏమనుకుందో ఏమో, చేస్తున్న పని వదిలేసి చలపతిరావుగారి మంచం దగ్గరికి వచ్చింది.

వెంకట్రామయ్య చుట్ట పొగ గుప్ గుప్ మని వదులుతున్నాడు.

పిల్లలు సంచీ పట్టుకుని ఓ పక్కగా, వధ్యశిలకి వెళ్తున్న మేకల్లా దీనంగా, అమాయకంగా, మూగగా చూస్తూ నిలబడి ఉన్నారు. వాళ్ళ కళ్ళలో నీళ్ళు కాస్త సందుదొరికితే యివతలకి ఉరకటానికి సిద్ధంగా ఉన్నట్టున్నాయి.

శారద వెంకట్రామయ్యతో చెప్పింది. "పిల్లల్ని ఆయన ఉంచమంటున్నారు."

చుట్ట పొగ వదులుతున్న వెంకట్రామయ్య శారదని ఎగాదిగా చూసాడు.

చుట్టని పళ్ళమధ్య పట్టి "ఏ ఆయన" అన్నాడు.

"పిల్లల తండ్రి. ప్రసాదుగారు."

"పిల్లల తండ్రి. ప్రసాదు." ఆయన విరగబడి నవ్వాడు.

"తండ్రా ! తండ్రినని చెప్పుకుంటున్నాడా !" ఆయన యింకా నవ్వాడు.

శారద అర్థంగానట్టు తికమకగా చూసింది చలపతిరావు కోపంగా చూసాడు.

"నవ్వుతా వెందుకు?"

"వాడు వీళ్ళకి తండ్రి నంటుంటే నవ్వు వచ్చింది. ఏనాడయినా వాళ్ళని అసలు చూసాడా ? వాళ్ళు బ్రతికి ఉన్నట్టు గుర్తుందా ?"

"అదంతా యిప్పుడెందుకు ? ఎప్పుడో జరిగిపోయినవి, యిప్పుడు తవ్వుకోవటం దేనికి !"

"ఎప్పుడో జరిగిపోయిందని, మీరు మర్చిపోయారయ్యా ! తోడబుట్టిన వాడివి నేనెలా మర్చిపోతాను ! నాకు ఒక్కగా నొక్క చెల్లెలు. దాని బ్రతుకు అట్లా అర్థాంతరంగా అయిం

దంటే మీ మూలంగా కాదూ ! మీ తండ్రికొడుకులు కారణం కదూ !"

"వెంకట్రామయ్యా ! నీకు పుణ్యం ఉంటుంది ! వాడి ఆరోగ్యం యింకా పూర్తి చక్కబడలేదు కూడా ! అవన్నీ ఎత్తకిప్పుడు !"

"అంత ఆరోగ్యం బాగా లేనివాడు, యింకా యీ పిల్లల్ని ఏం చూస్తాడులే!" వెంకట్రామయ్య పై పంచ దులుపుకుని లేచాడు.

"అదీ నిజమే ! నేను చూడబోతే మంచంలోనుంచి లేవలేను. ఈ పిల్లల్ని చూసేవాళ్ళు యిక్క దెవ్వరున్నారు. నువ్వు తీసుకువెళ్ళటమే మంచిది !" ప్రసాదు గుమ్మంలోకి వచ్చాడు.

అతను వెంకట్రామయ్యవైపు చూడ లేదు. తండ్రితో అన్నాడు.

"నాన్నా ! వాళ్ళు యిక్కడే ఉంటారు ! ఆయన్ని వెళ్ళమను !" ఎవరో తరుముకు వచ్చేసినట్టుగా అనేసి, గిరుక్కున వెనక్కు తిరిగి వెళ్ళిపోయాడు.

వెంకట్రామయ్య ఎట్టెట్టా అన్నట్టు కనుబొమ లెత్తి చూసాడు.

"వెంకట్రామయ్యా ! వాడేదో తెలివి లేకుండా అంటున్న మాట అది ! వాడేం మాట్లాడుతాడో వాడికే తెలియదు. ఆ తెలివిమాలిన మనిషి మాటలు పట్టించు కోకు. నువ్వు వాళ్ళని తీసుకువెళ్ళు !"

ప్రసాద్ తండ్రి మాటలు విన్న ట్టున్నాడు. గభాల్న తిరిగి వచ్చాడు. అతని ముఖంలో ఆవేశం పొంగులా ఉంది. గుమ్మం పట్టుకుని చెప్పాడు, "నాన్నా ! నేను ఒంటిమీద తెలివిలేకుండా అంటున్న మాటలు కాదు ! నిజంగానే చెబుతున్నాను. వాళ్లు యిక్కడే ఉంటారు. ఆయన్ని వెళ్ళమను." అతను ఆవేశంగానే వెంకట్రామయ్యవైపు చూసాడు. వెంకట్రామయ్య ప్రసాద్‌ని తదేకంగా చూసాడు.

ప్రసాద్ యీసారి భయపడలేదు ! తీక్షణంగా చూసాడు. మరుక్షణంలో వెనక్కు తిరిగి వెళ్ళిపోయాడు. శారదకి ఆ నిముషంలో ప్రసాద్‌ని చూస్తూంటే, ఎవరో ఒక కొత్త వ్యక్తిని చూస్తు న్నట్టుగా ఉంది ! అతని కళ్ళలో తీక్షణత్వానికి చకితురాలయింది !

ప్రసాద్ శారదతో అన్నాడు. "ఆ పిల్లలను అక్కయ్య వచ్చేవరకూ చూసే బాధ్యత నీది !" అనేసి వెళ్ళిపోయాడు.

ప్రసాద్ చర్యకి, మాటలకి వెంక ట్రామయ్య కూడా తెల్లబోయిన ట్టున్నాడు. కొద్దిసేపటివరకూ అలాగే నిలబడ్డాడు. ఆ తర్వాత భుజంమీద ఉన్న తువాలు తీసి, దులిపి మళ్ళీ వేసుకున్నాడు. "సరే ! ఉంచమంటే మధ్యలో నాదేం పోయింది ! ఉంచే వెళ్తాను."

అతను శారదని చూస్తూ, చూపుడు

వేలుతో బెదిరిస్తూ అన్నాడు, "ఇదుగో అమ్మాయీ ! నేను అప్పుడప్పుడూ వస్తాను. ఆ పిల్లలు కనక నాతో ఎవరైనా కొట్టారనిగాని, తిట్టారనిగాని చెప్పారా – ఈ యింట్లో అందరి ఒంటి మీద తోలు ఒలిచేస్తాను. ఆ! జాగ్రత్త! నేను వెళ్తున్నా. ఇదుగో - పెద్దపాపా," ఆయన కేకపెట్టాడు. వీధి గుమ్మంలో బిక్కముఖంతో నిలబడ్డ ఆ అమ్మాయి వచ్చింది.

"మీరు యిప్పటికి యిక్కడే ఉండండి ! నేను మళ్ళీ వచ్చి తీసుకు వెళ్తాను. ఇదుగో చూడు ! మీ కేదయినా కావాల్సి వస్తే యీ శారదని అడగండి ! లేకపోతే, ఆకలేస్తే మీరే వంట యింట్లోకి పోయి, కావాల్సింది తీసుకు తినండి. మొహమాట పడకండి! బెదిరిపోయి, ఓ మూల కూర్చోకండి ! ఆ ! ఇది మీ యిల్లు ! మీరేం భయ పడకండి ! మిమ్మల్ని ఎవరైనా ఏదయినా అంటే నాకు ఉత్తరం వ్రాయండి. నేను వచ్చి మిమ్మల్ని అన్నవాళ్ళని ఉతికేస్తాను. తెలిసిందా ! జాగ్రత్త !" ఆయన జేబులోనుంచి అయిదు రూపాయిల కాగితం తీసి ఆ అమ్మాయి చేతికి యిచ్చాడు.

"ఇదుగో, ఇది ఉంచుకో ! నీకు డబ్బు కావాల్సివస్తే, యీ ముస లాయన్ని అడుగు ! ఈ ముసలాయన మీ తాతయ్య !" అంటూ అప్పగింతలు పెట్టాడు.

పెద్దపాప తల ఊపింది !

వెంకట్రామయ్య వెళ్ళిపోయాడు !

సాయంత్రం కవిత, కల్పన కాలేజి నుంచి వచ్చేసరికి, పిల్లలు యింట్లోనే ఉన్నారు.

"ఇంకా ఆ మృగం వెళ్ళిపోలేదా ? యిక్కడే ఉన్నాడా ?"

కల్పన వెంకట్రామయ్యని ఉద్దేశించి అడిగింది.

వేణుగోపాల్, జరిగిన దంతా చెప్పాడు.

"ఏమిటీ !" కల్పన నిర్ఘాంత పోయింది

"అసలు తాతయ్య ఎలా ఊరు కున్నాడు ?" కవిత చిరాకుపడింది.

అక్కచెల్లెళ్ళిద్దరూ తాతగారి దగ్గరికి వచ్చారు.

"తాతయ్యా ! అమ్మ లేకుండా చూసి, యింట్లో యీ సంతంతా ఏమిటి ! నువ్వెలా ఊరుకున్నావు అసలు ?" అంది కల్పన.

"నేనేం చేయలేనమ్మా! వాడు వచ్చి ఆ మాట అనేసాడు. ఆయన యిదే సందు అని వాళ్ళని వదిలేసి వెళ్ళాడు."

"మామయ్యా, మా మ య్యా." కల్పన అరుస్తూ పిలిచింది.

ప్రసాద్ పక్కగదిలోనే ఉన్నాడు.

యీ మాటలన్నీ వింటూనే ఉన్నాడు. కానీ పలుకలేదు.

కల్పనే చరచరా అక్కడికి వచ్చింది.

"ఏమిటి ! ఆ పిల్లల్ని యిక్కడ ఉంచమన్నావుట ! ఎవరు చూస్తారు వాళ్ళని ?"

"శారద చూస్తుంది." చాలా తగ్గు స్వరంలో భయపడుతున్నట్టుగా అన్నాడు.

"శారద చూస్తుందా ! శారద ఎల్ల కాలం మన యింట్లో ఉంటుందా ?"

"పోనీ అమ్మ వచ్చేవరకు."

"అమ్మ అసలు ఊరుకుంటుం దను కుంటున్నావా ?"

"నేను చెబితే కాదనదు, అను కున్నాను."

"చాలా తెలివిగల పనిచేసావు ! నీతోనే మేం పడలేక చస్తున్నాం! ఈ కోతులు కూడానా మా ప్రాణానికి ! అసలు యిదంతా ఆ శారదే చేసి ఉంటుంది. ఆ శారదే నీకు యీ సలహా చెప్పి ఉంటుంది "

"శారదని ఏమీ అనకు !" అన్నా డతను కంగారుగా.

"ఎందుకనను ! ఈ క్షణమే యింట్లోంచి వెళ్ళగొడ్తాను. శారదా, శారదా." కల్పన అరుస్తూ వంట యింటివైపు వెళ్ళింది.

"ఏమిటి?" వంటయింట్లో చేస్తున్న పని వదిలేసి వచ్చింది.

"ఆ పిల్లల్ని ఉంచమని మామయ్యకి నువ్వేనా చెప్పింది ?"

కల్పన కోపం శారదకి అనుభవమే ! మాటకి మాట జవాబు చెప్పినకొద్దీ ఆ అమ్మాయి రెచ్చిపోతుంది ! ఒళ్ళు తెలియకుండా నోటికి వచ్చినట్టు మాట్లాడుతుంది !

శారద అందుకే మౌనంగా నిలబడి పోయింది.

"నిన్నేం ! మాట్లాడవేం ? అమ్మ నిన్ను మా యింట్లో పనిచేయటానికి ఉంచి వెళ్ళింది కాని, మా యింటి విషయాల్లో జోక్యం చేసుకోమని కాదు !"

ఇంతలో ప్రసాద్ అక్కడికి రానే వచ్చాడు.

"కల్పనా ! ఇందులో శారద ప్రమేయం లేదని చెప్పానా ?" వారిస్తూ అన్నట్టు అన్నాడు.

కల్పన ప్రసాద్ మాటలు వినిపించు కోలేదు.

"నువ్వు చేసిన ఘనకార్యాలతో, మేం ఛస్తున్నాం ! యిక చాలుగాని, నువ్వు మీ హాస్టల్‌కి దయచేయ్ ! తక్షణం వెళ్ళు. ఊ !" అంటూ గద్దించింది.

తమ మూలంగా శారదకి తిట్లు తగుల్తున్నాయనే భయంతో పిల్లలు బెదురు చూపులు చూస్తూ నిలబడ్డారు !

"వెళ్లు. నిన్నే "

"కల్పనా! శారద వెళ్ళదు! అక్కయ్య ఫారెన్‌నుంచి వచ్చేవరకూ యిక్కడే ఉంటుంది."

"ఉండటానికి వీల్లేదు! నేను చెబుతున్నాను! అమ్మ యింటిసంగతి నాకు అప్పచెప్పి వెళ్ళింది! శారద వెళ్ళాల్సిందే!"

"శారద ఉంటుంది! నేను చెబుతున్నాను! ఇది నా యిల్లు!"

"ఏమిటీ!" కల్పన ప్రసాద్ తెగింపు చూసి చకితురాలయింది.

"ఏమన్నావు నువ్వు?"

అప్పటికే చలపతిరావుగారు, వేణుగోపాల్ సాయంతో లేచి అక్కడికి వచ్చాడు. "కల్పనా! ఊరుకోమ్మా! అమ్మకి నేను ఉత్తరం వ్రాస్తాను! యిప్పటికి ఊరుకో! ఆ మతిలేనివాడితో పాటు నువ్వు కూడా నోరు పారేసుకోకు! అమ్మ ఉత్తరంలో ఎలా చేయమంటే అలాగే చేద్దాం. కవితా, కల్పనని అవతలకి తీసుకువెళ్లు," అన్నారాయన.

కవిత కల్పనని బలవంతంగా అవతలికి లాక్కెళ్ళింది! ప్రసాద్, ఏదో తప్పుచేసి, పశ్చాత్తాపపడుతున్న వాడిలా తికమకగా చూసి, అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

* * *

## 14

శారద సాయంత్రంవేళ మొక్కల్లో పనిచేస్తోంది!

పిల్లలు కూడా శారద వెంటే తిరుగుతూ, శారదకి సాయం చేస్తున్నారు.

పైన గదిలో పడుకుని ఉన్న భవానీ ప్రసాద్‌కి వాళ్ళ మాటలు, నీళ్లు పడ్తున్న పైప్ ధ్వని వినిపిస్తోంది!

శారద అడుగుతోంది.

"పెద్దపాపా! నీ పేరేమిటి?"

"పెద్దపాపే!"

"అది ముద్దుపేరు! అసలు పేరు ఉంటుందిగా!"

"ఏమో నాకేం తెలియదు! నన్ను అందరూ పెద్దపాపా అని పిలుస్తారు. చిన్నపాప, చంటి, యివే మాకు పేర్లు. యింకే పేర్లు లేవు."

"అలాగా! ఉండు. ఆ మొక్కకి కాస్త కుదురుచెయ్యాలి."

"శారదా, శారదా, నేను తవ్వుతాను." చిన్నపాప అంది.

"జాగ్రత్తగా తవ్వుతావా?" చేతి మీద వేసుకోవుగా.

"ఊహు! మాకు అలవాటే? మా అత్తయ్య, మాచేత తవ్విస్తుందిగా! పాదులకి తవ్వకపోతే అన్నం పెట్టదు."

"యింకా, ఏమేమి పనిచేసేవాళ్ళు అక్కడ?"

గొడ్లపాక ఊడ్చేవాళ్ళం! పేడ తీసి, పిడకలు చేసేవాళ్ళం! పొలం

ఇదిగో రేడియో సెట్ - ఇదిప్పుడు జనతా పార్టీది - దానికి మనకి ఋణం తీరింది..!!

వెళ్ళి గడ్డికోసి తెచ్చేవాళ్ళం! గిన్నెలు తోమేవాళ్ళం! పెద్దపాపేమో, చెరువు నుండి నీళ్ళు తెచ్చేది! అత్తయ్య మంచిదికాదు! మామయ్య లేకపోతే మాకు అన్నం పెట్టేదికాదు! మా అమ్మ చచ్చిపోవటం, తన చావుకు వచ్చిందని తిట్టేది"

ప్రసాద్ దిండులో ముఖం దాచుకున్నాడు.

"మీ అమ్మ మీకు గుర్తులేదా?" శారద అడిగింది.

"ఉహూ! మా అమ్మ మా చిన్నప్పుడే చచ్చిపోయింది!"

"ఎలా పోయింది? జ్వరమా?"

"ఉహూ? కాదు! మా నాన్న చంపేసాడుట!"

"ఛీ, ఛీ! ఎవరు చెప్పారు?"

"మా అత్తయ్య."

"అన్నీ అబద్ధాలే! మీ అమ్మ జ్వరం వచ్చి చచ్చిపోయిందిట! మీ తాతయ్య నాకు చెప్పాడు," అంది శారద.

భవానీప్రసాద్ మంచంమీద చివాల్న లేచి కూర్చున్నాడు. అతని ముఖమంతా చూస్తుండగానే చిరుచెమటలు అలుముకున్నాయి.

"మా నాన్న పిచ్చివాడుట కదా?" పెద్దపాప అంది.

"అదికూడా అబద్ధమే! మీ నాన్నకి అప్పుడప్పుడు తలనొప్పి వస్తుంది, అంతే!" శారద నచ్చచెబుతున్నట్టుగా అంది. (సశేషం)




రామారావు మనసు మరుగుతున్న నీటిలా ఉంది.

అతను తేలు కుట్టిన దొంగలా తెగ బాధపడిపోతున్నాడు.

యిప్పుడు తనేం జేయాలి ... ఏం జేయాలి...ఎలా ... ఎలా — అసలు నిజంగానే యిలా జరిగి ఉంటుందా? స్వర్ణ యిలా చేయగలుగుతుందా? చేస్తే తనేం చేయగలడు...స్వర్ణను ఉద్యోగం చెయ్యి, ఉద్యోగం చెయ్యి అని బలవంతంచేసి చేసి తీరా తను తప్పే చేశాడా?

స్వర్ణ నిజంగానే యిలా చేస్తే తను ఆ నిజాన్ని భరించగలడా? ఆమె నీడ

నైనా తనమీద పారనివ్వగలడా. ఆమెతో యింకా 'యీ కాపురాన్ని కొనసాగించగలడా.

నో. నో—

ఆ ఊహనే భరించలేడు తను. స్వర్ణే గనుక అలా చేసినట్టు-చేస్తున్నట్టు తను స్వయంగా చూచి తెలుసుకోగలి గితే-ఆమెను ముక్కలు ముక్కలుగా నరికి, చిత్రవధ చేసి, కసి తీర్చుకుని-

మంచు ముక్కలున్న గాజుగ్లాసుపైన ఆవిరి క్రమ్ముకొచ్చినట్టు రామారావు ముఖమంతా చెమటలు పొంగుకొచ్చాయి.

లేచి కిటికీనుండి ఎటో చూస్తూ నిలబడ్డాడు కాస్సేపు మళ్ళీ అసహనంగా వెనక్కి గిరుక్కున తిరిగి గదిలో అటూ యిటూ పచార్లు చేశాడు. చటుక్కున ఆగి సర్రున అగ్గిపుల్ల గీసి సిగరెట్టు వెలిగించుకున్నాడు. మళ్ళీ చటుక్కున సిగరెట్టును నేలకేసి విసిరికొట్టాడు ఖలంగా—

ప్చ్-ఏమీ తోచడంలేదతనికి. మెద డంతా చీమలు కొరుకుతున్న బెల్లంలా ఉంది.

విసుగ్గా వాలుకుర్చీలో కూలబడి నిన్న సాయంకాలం తన ఆఫీసు అడ్రస్‌కు పోస్ట్‌లో వచ్చిన కవరును జాగ్రత్తగా జేబులోనుండి బయటికి తీశాడు. కొద్దిగా ముందుకు వంగి చూచి యింట్లో స్వర్ణ లేదనీ, ఆమె బాత్‌రూంలో స్నానంచేస్తున్నదని నిర్ధారించుకుని కవరులోనుండి కాగితాన్ని తీసి—

మళ్ళీ అతని గుండెలు ఉదకడం ప్రారంభించి—

చూపులు అక్షరాల వెంట రేసు గుర్రాల్లా పరుగెత్తుతున్నాయి.

"శ్రీ రామారావుగారికి,

నమస్తే

నే నెవరినో మీకు తెలియదు తెలి యాల్సిన అవసరం కూడా లేదనుకుం టున్నాను. కాని మీ శ్రేయస్సును కోరి యీ ఉత్తరం రాస్తున్నాను ఎందుకంటే కొన్ని జీవితాలు నా కళ్లెదుటే నాశనమై పోతూంటే నేను చూస్తూ ఊరుకోలేను. నా మనసు మంచుగడ్డలాంటిది ఊరికే ఏ చిన్న స్పందనకైనా కరిగి తల్లడిల్లు తుంది. సరే – అసలు విషయాని కొద్దాం

స్వర్ణ మీ భార్య ఆ విషయం నాకు తెలుసు. ఆమె మొన్న మొన్ననే కొత్తగా డి.పి ఐ లో యల్డీసీగా అపాయింటయింది అది కూడా నాకు తెలుసు. ఆమె ఉద్యోగం చేస్తూండడం వల్ల మీరూ సంతోషంగా ఉండి ఉంటారు. ఆ సంగతి కూడా నేను ఊహించగలను అయితే స్వర్ణ యీ పదిరోజుల్లో ఓ చేయకూడని పనిని చేయడానికి సిద్ధమై మెల్లమెల్లగా ఆ సముద్రంలోకి దిగబోతోంది ఆమెలో

మీరు ఊహించని మార్పు వచ్చి మీ సంసార నౌకనే ఛిన్నాభిన్నం చేయ బోతోంది

అసలు సంగతేమిటంటే ... ఆమె ఎదురుగా రాజేష్ అనే కొత్తగా వచ్చిన ఓ యువగుమాస్తా ఉంటాడు. అతనూ, ఈమే ప్రౌఢ స్తమానమూ చూపులతో పరస్పరం కొరుక్కు-తింటూ, యికిలించుకుంటూ, సకిలించుకుంటూ, అక్కర ఉన్నా లేకున్నా ఒకరిదగ్గరికి ఒకరు ఏదో ఫైలు పట్టుకుని వస్తూ పోతూ మాట్లాడుకుంటూ ప్రేమాయణం సాగిస్తున్నారు. యీ కథ యిలాగే సాగి సాగి పక్షులు కంచికి ఎగిరిపోయేలా ఉన్నాయి. యీ సంక్లిష్ట స్థితిలో మీకు అసలు సంగతిని తెలియజేస్తే వీలుంటే మీ తంటా లేవో మీరు పడతారని ఓ పావలా ఖర్చుపెట్టుకుని యీ ఉత్తరం రాస్తున్నాను. యిక మీ యిష్టం. సెలవు.

—మీ శ్రేయోభిలాషి."

క్రింద పేరు లేదు. శ్రేయోభిలాషి అన్న పదం ప్రక్కన ఓ పూవు గుర్తుంది.

బాత్‌రూంనుండి స్వర్ణ వస్తున్నట్టుగా చప్పుడైంది. చకచకా కాగితాన్ని మడచి జేబులో కుక్కుకున్నాడు.

మళ్ళీ ఆలోచనలు గుండుసూదుల్లా కురుస్తున్నాయి మెదడులో.

ఓ పదినిముషాల్లో స్వర్ణ బట్టల దుకాణాలలో ఉండే షోకేసులలోని బొమ్మలా అందంగా ముస్తాబై వచ్చింది. వచ్చి ఫ్లాస్క్‌లోని కాఫీని చెరో కప్పులోకి వంచి ఒకటి రామారావుకు అందిస్తూ "అలా ఉన్నా రేమిటి" అంది అతనితో.

"ఎలా ఉన్నాను."

"ఏదో పోగొట్టుకున్నట్టు-"మామూలుగానే అంది.

నిన్నే పోగొట్టుకుంటున్నాను - అని అనుకుని "తల నొప్పిగా ఉంది" అన్నాడు అప్రయత్నంగా.

"అమృతాంజనం తేనా?"

"అవసరంలేదు. కాఫీ తాగుతున్నాం గదా తగ్గుతుందేమో–"

ఆమె ఓ లిప్తపాటు అతని ముఖంలోకి సూటిగా చూసి "అసలు మీరు నిన్న సాయంకాలంనుండే అదోలా ఉంటున్నారు" అంది బాధగా.

"నా మనసేమీ బాగుండలేదు స్వర్ణా...యివ్వాళ లీవ్ పెడదామనుకుంటున్నాను. నువ్వు నీ ఆఫీసు కెళ్ళిపో - యిప్పటికే ఆలస్యమైపోతోంది నీకు."

"అయితే నేను కూడా లీవ్ పెట్టి యింటిదగ్గరుండి మిమ్మల్ని చూసుకుంటాను."

"అలా బాగుండదు. నువ్వు కొత్తగా ఉద్యోగంలో చేరావు. లీవ్ పెట్టడం బాగుండదు. నువ్వెళ్ళు."

"నా మనసంతా మీ దగ్గరే ఉంటుంది ప్రొద్దంతా."




నా దగ్గరెందు కుంటుంది. ఎదుటి సీట్లో చిక్కుపడిపోతుంది, నీ మనసు ఆఫీస్ కెళ్ళగానే అనుకుని "తప్పదు మరి ... కమాన్ నువ్వు బయలుదేరు మరి. నేనూ మా ఆఫీస్ కెళ్ళి లీవ్‌లెటర్ పారేసొస్తాను."

యిద్దరూ లేచి బయటికొచ్చి యింటికి తాళం వేసి నడిచారు నిశ్శబ్దంగా బస్‌స్టాండ్ వైపు.

"మీరు ఎందుకో అదోలా ఉంటున్నారు. చెప్పరా నాతో. వెధవ ఉద్యోగమని నా కొకటి అంటగట్టారు. లేకుంటే ఇంట్లో ఉండి మిమ్మల్ని కంటికిరెప్పలా చూసుకుందును—యింకా ఏదో అంటోందామె. యింతలోకి బస్ వచ్చేయడం... ఆమె యాంత్రికంగా ఎక్కేయడం—అది కదిలి తుఫానులా వెళ్ళిపోవడం ఓ క్షణంలో జరిగిపోయాయి.

"నం ...గ ... నా... చి" అనుకున్నాడు కసిగా రామారావు.

యివ్వాళ లీవ్ పెట్టిందెందుకు – నీ సంగతి స్టడీ చేయడానికేనాయె ... సర్రున సిగరెట్టు వెలిగించుకున్నాడు.

యింకో అయిదు నిముషాల తర్వాత మరో బస్ వచ్చింది స్వర్ణ ఆఫీస్ రూట్ లోదే. గబగబా ఎక్కేసాడు. డిటెక్టివ్ నవలల్లో దొంగలను ఫాలో చేసి కూపీని బయటికి లాగబోయే హీరోలా ఫీలయ్యాడు తనకు తాను.

స్వర్ణ ఆఫీస్ ముందర దిగి సరిగ్గా ఆఫీసుకు ఎదురుగా ఉన్న ఇరానీ కేఫ్‌లో కూర్చున్నాడు టీకి ఆర్డరిచ్చి.

యింతకుముందు స్వర్ణ ఎక్కిన బస్ ఎందుకో లేటై అప్పుడే వచ్చింది స్టాప్‌లోకి. స్వర్ణ హంసలా దిగి—

అదిగో ఆమె వెంటనే ఎవడో

కుర్రాడు...ఎర్రనివాడు ... ఉంగరాల జుత్తువాడు, అందమైనవాడు కూడా దిగి... వాడు నడుమ ఎక్కాడా ఎక్కడైనా?...అసలెవడు వాడు ?

"గుడ్‌మార్నింగ్" అన్నాడు వాడు—

"..." స్వర్ణ ఏదో అంది నవ్వుతూ. పువ్వులా నవ్వుతూ... నవ్వుతూ ఎందుకనాలి.

అతనూ, ఆమే నవ్వుతూ, ప్రక్క ప్రక్కనే నడుస్తూ వెళ్ళిపోతున్నారు లోపలికి గేట్‌లోనుండి.

ఎందు కలా ప్రక్క ప్రక్కనే నడవాలి. యీమె అతని వెనకాలో, కాకుంటే కాస్త ముందో ఎందుకు నడువకూడదు?

• రాంగ్ రాంగ్—

యిద్దరూ కలిసి మెట్లెక్కి వరండాలో పెట్టి ఉంచిన రిజిష్టర్‌లో సంతకాలు పెట్టి సీట్లలోకి వెళ్ళిపోయారు.

బేరర్ తెచ్చిన టీని గబగబా తాగి పైస లిచ్చేసి చరచరా స్వర్ణ పని చేస్తున్న ఆఫీసు లోకి నడిచి ఫస్ట్‌ఫ్లోర్ పైకెళ్లి వరండాలో నిలబడితే – క్రింద స్వర్ణ పనిచేస్తున్న సీటూ, ఆమె చుట్టు ప్రక్కలున్న సెక్షన్ కనబడుతోంది దొంగచాటుగా ఆమె కదలికలను గమనిస్తూ ఉండిపోయాడు

స్వర్ణ లేచి తన కెదురుగా ఉన్న ఎర్రయువకుని దగ్గరకు వెళ్ళింది చేతిలో ఏదో ఫైలుతో. ఏదో అడిగి ఓ చిరునవ్వు నవ్వి మళ్ళీ వచ్చి కూర్చుంది. యింకా స్సేపటికి వాడు ఏదో కాగితాన్ని పట్టుకుని ఆమె దగ్గరికొచ్చి ఏదో మాట్లాడి – యింతలో ప్యూన్ టీ పట్టుకొచ్చినట్టున్నాడు. అందరికీ కప్పులందిస్తున్నాడు. యింతలో స్వర్ణకు అటు ప్రక్కసీట్లో కూర్చున్న ఎవడో కొలీగ్ ఏదో జోక్ వేసినట్టున్నాడు. అందరూ ఊకుమ్మడిగా నవ్వి – స్వర్ణ కూడా నవ్వుతోంది ఎగిరెగిరిపడి.

యీమె ఎందుకంత విచ్చలవిడిగా నవ్వుతోంది ... నవ్వకుంటే పని నడవదా.

ఆ శ్రేయోభిలాషిగాడు రాసిన ఎదుటి సీట్‌వాడు ఆ ఎర్రయువకుడేనా. స్వర్ణ వానితోనే–

ఇక ఆలోచించలేకపోయాడు. ఇంకో సిగరెట్టును నోట్లోపెట్టుకుని కసిగా అగ్గిపుల్ల గీశాడు.

అలాగే మధ్యాహ్నందాకా ఆమె సెక్షన్‌లో ఆమె ప్రతి కదలికనూ భూతద్దం పెట్టి గమనించినట్టు గమనించి – విసిగి ఎటో కాస్సేపు వెళ్ళిపోయి...మనసును యింకా కెలికిన పుండులా చేసుకుని మళ్ళీ సాయంత్రం ఆమె ఆఫీసుకు వచ్చి యింకాస్సేపు మళ్ళీ కదలికలను పరిశీలించి–

ఆఫీసుఅయిపోయిఆమె బస్‌స్టాండ్‌లో నిలబడ్డప్పుడు ఆమె ప్రక్కనే ఆ ఎర్రవాడూ, యింకో యు. డి సీ. ఎవడో

కూడా నిలబడి–ఏదో మాట్లాడుతున్నారు నవ్వుతూ, ఎంతో ఫ్రీగా. యింతలో బస్ వచ్చేసింది. గబగబా ఎక్కేసారు అందరూ.

బరువుగా నిట్టూర్చి బయటపడ్డాడు రామారావు అక్కడినుండి.

యింటికి రాగానే - స్వర్ణ కమలంలా నిర్మలంగా తయారై కాఫీ కప్పుతో ఎదురై "ఎక్కడి కెళ్ళారండీ ఒంట్లో బాగులేదని" అంది నొచ్చుకుంటూ.

నం ...గ ...నా ...చి —— అను కున్నాడు మళ్ళీ కసిగా.

ఆమెను ఎన్నో తిట్లు తిట్టాలనీ, ఏవేవో మాటలనాలనీ, తన కోపాన్నీ, కసినీ తీర్చుకోవాలనీ- యింకా యింకా మాటల కందని ఏవేవో పనులు చేయాలనీ అనిపించిం దతనికి. కాని ఎలా అంటాడు. ఏ ఆధారం తన దగ్గరుందని అంటాడు. ఏ సాకును చూపించి అంటాడు.

విసుక్కుంటున్నాడు లోలోపల.

కాఫీ త్రాగాక కప్పును పట్టుకెళ్ళింది. వంటచేసింది. యింటిని సర్దింది. పడక గదిలో అన్నీ సవరించింది–చీకటి పడ్డాక కాస్సేపు మామూలుగా ఏవేవో కబుర్లు చెప్పి ... యిద్దరికీ భోజనం వడ్డించి తినడం ముగించిన తర్వాత-

రాత్రి పడకల పైకి చేరుకున్నాక – స్వర్ణను ముట్టుకోవాలంటే ఏదో మచ్చల పాము ను ముట్టుకోబోతున్నట్టుగా అనిపించసాగిం దతనికి. పైకి కప్పువంక చూస్తూ ఉండిపోయాడు అచేతనంగా.

"మనసు బాగోలేదా" అంది స్వర్ణ అనునయంగా.

"........."

"ఎందుకు - ఆ ఉత్తరం వచ్చి నందుకేనా?"

ఉలిక్కిపడి ఆమెవైపు తిరిగా డతను.

"ఓ ఆడది ఉద్యోగం చేస్తూంటే ఆమెపై ఎవరైనా ఎన్నో పుకార్లను పుట్టించవచ్చు. ఎన్నో అపవాదులను సృష్టించవచ్చు. అలాంటప్పుడు మనం పుకార్లకు లొంగని స్థిమితతను అల వరచుకోవాలి. మన వ్యక్తిత్వాల సంగతి మనకు తెలియాలిగాని ఎవరో ఏదో అంటే మన సంగతి మనకు తెలియ కుండా పోతుందా చెప్పండి. యీ విష యమే మీకు తెలియాలని ఆ ఉత్తరాన్ని నేనే మీకు రాశాను. క్రింద పూవు గుర్తుంది కదూ. యివ్వాళ దొంగ కారణంతో ఆఫీసుకు లీవ్ పెట్టి నన్ను ప్రొద్దంతా ఫాలో అయి ఎందు కనవ సరంగా మనసును పాడుచేసు కున్నారు?" స్వర్ణ తొణకకుండా చెబుతోంది.

ఆమెవంక పసివానిలా చూస్తూ ఉండిపోయాడు రామారావు.

———

# కె.వి.వి. బ్రహ్మానందరావు

# బొమ్మ




“గుడ్ ఈవినింగ్ సార్ ! మీ రీవేళ ఆఫీసునుండి ఆలస్యంగా వచ్చారేం'' అంది ఉమ, గదితాళం తీస్తున్న నన్ను చూచి.

ఉమ మాటకు చిన్నగా నవ్వి “ఒకరి క్రింద పనిచేసేటప్పుడు టైమ్ అంటూ పెట్టుకుంటే ఎలా?'' అన్నాను.

“భలే చిత్రంగా మాట్లాడుతారు మీరు. ఎంత ఒకరి చేతిక్రింద పని చేసినా, ఆఫీసు అన్నాక టైమ్ అంటూ

లేకపోతే ఎలాగండీ బాబు ... అన్నట్టు మీకు ఉత్తరాలు వచ్చాయి, తెస్తానుండండి" అంటూ లోపలికి వెళ్ళింది.

గది తలుపు తెరిచి లోపలకు అడుగు పెట్టేసరికి ఉమ రెండు ఇన్‌లాండ్ కవర్లు, ఒక వారపత్రిక పట్టుకు వచ్చింది. వాటిని టేబిల్‌మీద పెట్టి "పత్రికలో మీరు వేసిన బొమ్మ అచ్చయిందండి. పోస్టుమన్ పుస్తకం చేతికి యివ్వగానే మీ బొమ్మ ఏదైనా అచ్చయి ఉంటుందని ఊహించి చూసాను. బొమ్మ బాగా వచ్చిందండి. ఐ లైకు వెరీమచ్" అంది.

"థాంక్యూ" అన్నాను.

ఉమ గది గుమ్మందగ్గర నిలబడి ఉంది. ఆమె వెడితే బాగుణ్ణు, చొక్కా విప్పి కాస్త ముఖం చేతులు కడుక్కో వచ్చు ననుకున్నాను. ఆడపిల్ల ముందు చొక్కా విప్పాలంటే అదోరకమైన సంకోచం. నా ఆలోచన గమనించినట్టు ఉమ "మీరు బట్టలు మార్చుకోండి. అయిదు నిమిషాలలో టీ పట్టుకొస్తాను" అంది.

"వద్దు—వద్దు నేను అలా బయటకు వెళ్ళి ఏకంగా భోజనంచేసి వస్తాను."

"వర్వాలేదులెండి. మీకోసం ప్రత్యేకంగా పెట్టడంలేదు. మీతోపాటు నేనూ త్రాగుతానంది. మరో మాటకు ఎదురు చూడకుండా లోపలకు వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళింతరువాత పుస్తకంలో అచ్చుఅయిన నేను గీసిన బొమ్మను చూసుకుంటూ చాలాసేపు ఉండిపోయాను. గీసిన బొమ్మ అచ్చయితే చూసుకోవడం చాలా సరదా నాకు. అదొక వెర్రి ఆనందం—తృప్తి. యీ క్రేజి గొప్ప చిత్రకారుడికి ఉండకపోవచ్చుగాని అప్పుడే చిత్రలేఖనంలో ప్రవేశించిన నా బోటివాళ్ళకు అచ్చుఅయిన బొమ్మను, ఆ బొమ్మక్రింద పేరును చూసుకుని మురిసిపోవడం అదో ముచ్చట.

బట్టలు మార్చుకుని మిత్రులదగ్గర నుండి వచ్చిన ఉత్తరాలు చదివేసరికి ఉమ చేతిలో కప్పుతో గదిలోకి అడుగు పెట్టింది. ఆమె చేతిలోని కప్పు నందుకుని "శ్రమ తీసుకొన్నారు" అన్నాను.

నా మాటకు "శ్రమ ఏముందండి యిందులో. ఆడపిల్లను ఈమాత్రం పనిచేయలేనా ?" అంది అందంగా నవ్వుతూ.

టీ త్రాగుతూ "ఎవరూ లేరా ? ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది."

"లేరండి. మా నాన్నగారు గుడివాడ వెళ్ళారు."

"మరి మీ అమ్మగారు."

"గుడికి వెళ్ళారు."

"మరి మీరూ వెళ్ళలేకపోయారా ?" అన్నాను.

"నాకు అప్పుడే భక్తి ఎందుకు సార్. యింకా మూడొంతుల బ్రతుకు ముందుంది" అంది. తల ఎత్తి చూసాను

ఆమె కళ్ళలో మెరుపు, ఆకర్షణ తలుక్కున మెరిసాయి. నేను టీ త్రాగిం తరువాత కప్పు తీసుకుని లోపలకు వెళ్ళి పోయింది ఉమ.

ఉమ మా యింటి ఓనరుగారి అమ్మాయి. అందమైనది. గుండ్రని కళ్ళు, సూదైన ముక్కు, సన్నటి పెద వులతో ఆకర్షణీయంగా కనిపిస్తుంది. మనిషిలోని మంచి, మర్యాద ఆమె మాటలలో ఎప్పుడూ తొంగిచూస్తుం టాయి. ఎప్పుడూ ఆత్మీయంగా మాట్లాడే ఉమ అంటే నాకు అభిమానం.

ఉమ తండ్రి మూర్తిగారు మూడేళ్ళ క్రితం డిప్యూటీ తహశీల్దారుగా రిటైర్ అయ్యారు. ఆయన సంతానం ముగ్గురు ఆడపిల్లల్లోను ఉమ ఆఖరుది. పెద్దవాళ్ళిద్దరకు ఆయన సర్వీసులో ఉండగా పెళ్ళిళ్ళు చేయగలిగాడు. అదీ అతి కష్టంమీద. ఉద్యోగంలో ఆయన ఒక్క పైసా కూడా వెనక వేయలేక పోయాడు. ఉమ పెళ్ళికి ఎదిగేసరికి ఆయనకు నెల నెలా వచ్చే ఫింఛనూ, ఉండడానికి యిల్లూ తప్ప మరో ఆధారం, ఆసరా కనిపించలేదు. ఆయన చేసిందల్లా పెద్దకూతుళ్లను చదివించక పోయినా ఉమను ఇంటర్ దాకా చదివిం చడం. ఆపైన చదివిస్తానని ఆయన గాని, చదువుతానని ఉమగాని అనలేదు. దానికి కారణం ఆ ఇంటి ఆర్థికపరిస్థితి. ఇప్పుడుమాత్రం ఆ కుటుంబంలో ఓ బాధ్యత ఉన్న తండ్రికి బరువుగా మిగిలింది ఉమ.

సంవత్సరంక్రితం బచ్చుపేటలో ఉన్న వారి ఇంటిలో ఖాళీగా ఉన్న గదిలో అద్దెకు దిగాను. వాళ్ళ యింట్లో దిగిన రెండువారాలకే నేను వాళ్ళింట్లో ఒక మనిషిగా మారిపోయాను. దానికి కారణం మూర్తిగారు. మూర్తిగారికి చదరంగం పిచ్చి. మంచి ఆటగాడు. ఆయన ఆటలోగాని పడితే అన్నం కూడా మరిచిపోతారు. నేను ఎప్పుడు కొంచెం ఫ్రీగా కనిపించినా ఆయన 'రావూ ఒక ఎత్తు వేద్దామేమిటి ?' అంటుంటారు. సరే ! అంటే ఆట వెంట ఆట అలా ఆడుతూ ఉండవలసిందే ! మేము అలా ఆటలోగాని ఉంటే టిఫిన్‌లు, కాఫీలు అందిస్తూ ఉమ మాతోపాటు కూర్చుంటుంది మధ్య మధ్య ఇరుపక్షాలకు తనకు తోచిన సలహాలు యిస్తూ...

నేను హోటల్‌లో రెండు మెతుకులు తిని రూంకొచ్చేసరికి కాంపౌండులో మూర్తిగారు కనిపించారు. పడకకుర్చీలో కూర్చుని చేతులు రెండూ తలక్రింద పెట్టుకుని ఆకాశంకేసి చూస్తూ ఉన్నారు. చూపెక్కడో చుక్కలమీద స్థిరంగా నిలిచినట్టు చూపులో తదేకత. సాధారణంగా ఆయన ఎప్పుడోగాని అలా కనిపించరు, ఏదో తెగని ఆలోచన మనస్సులో ఉంటేతప్ప.

నా అడుగుల చప్పుడుకు తల ఎత్తి 'రావుజీ భోజనం అయ్యిందా ?' అని పలకరించారు.

ఆయన మాటకు 'అయ్యింది' అన్నట్టు తల ఊపాను.

కాళ్ళ దగ్గరున్న స్టూలు ప్రక్కకు లాగి 'కూర్చోవోయ్' అన్నారు.

కూర్చుంటూ 'మీరు ఊరు వెళ్ళారని ఉమగారు చెప్పారు. ఎప్పుడొచ్చారు ?' అన్నాను. నా ప్రశ్నకు ఆయన ముఖంలో స్పష్టమైన అలసట కనిపించింది. దానివెంట నిట్టూర్పు వినిపించింది. భుజంమీద తువ్వాలును సరిచేసుకుని 'వెళ్ళడం రావడం కూడా అయ్యింది. మా ఉమకు గుడివాడలో సంబంధం ఉందంటే చూద్దామని వెళ్ళాను. బి.కాం. ప్యాసై కోపరేటివ్ బ్యాంకులో క్లర్కుగా పనిచేస్తున్నాడు. మనిషి బాగానే ఉన్నాడు. మన ఉమకు కూడా అన్నివిధాల నచ్చుతాడనే నమ్మకం ఉంది. అయితే వాళ్ళకు కట్నాలమీద మోజు ఉన్నట్టుంది. దానికి కారణం చూచాయగా చెప్పారు. వాళ్లకో పెళ్ళి కావలసిన అమ్మాయి ఉందట. ఆ అమ్మాయిని కట్నంలేకుండా ఎవరైనా పెళ్ళిచేసుకుంటే ఈ అబ్బాయికి కట్నం తీసుకోరట. కాని... కట్నం పుచ్చుకోకుండా పెళ్ళి జరుగుతుందంటావా ? యివ్వడం, పుచ్చుకోవడం నేరమే అయినా కట్నం యివ్వకుండా ఆడపిల్ల పెళ్ళి జరగదు. పోనీ ఏదోరకంగా జరుగుతుందిలే అని కాలహరణచేయడానికి యిప్పటికే ఆలస్యమైంది. ఎదిగిన ఆడపిల్ల యింట్లో తిరుగుతుంటే చూడ్డానికి చాలా బాధగా ఉంటుంది" అన్నారాయన బాధగా.

"నిజమే సార్ కట్నం తీసుకోవడం నేరం అని తెలిసికూడా కట్నంకోసం ఆశించడం, అలా తీసుకోడానికి కుటుంబ కారణాలు చెప్పడం, ఈనాడు ప్రతివారికి అలవాటు అయిపోయింది. ప్రభుత్వం వరకట్నం నిషేధించి ఎంత గట్టిగా శాసనాలు చేసినా యిచ్చి-పుచ్చుకునే వారిద్దరిలో ఈ విషయం ఉన్నంత వరకు మరో మూడో మనిషికి తెలిసే అవకాశం లేదు. వరకట్న పిశాచానికి ఎందరి జీవితాలు బలి అవుతున్నాయో మనకు తెలియంది కాదు. నూటికి ఎవరో ఒకరిద్దరు ఆదర్శయువకులు ఉన్నంత మాత్రాన ఈ సమస్య పరిష్కారం కాదు. ఈనాడు కట్నాల ముసుగులో తండ్రులచాటున దాక్కుంటున్న యువకులలో మార్పురావాలి. మొత్తం యువతరం ప్రాతినిధ్యం వహించిననాడే ఈ సమస్య రూపుమాపబడుతుంది. అప్పుడే సమాజంలో సాంఘికంగా పరివర్తన వస్తుంది. ఆ మార్పు రావడానికి కొంత కాలం పడుతుంది. అంతదాకా ఈ బాధ తప్పదేమో'' అన్నాను...

నా మాటకు ఆయన 'నిజమే'

అన్నారు. అంతకుమించి ఆయన మాట్లాడలేదు. చూపును శూన్యంలో ముడివేసారు. మనసులోని తీవ్రమైన అలజడితో ఆయన సమస్యల ఊబిలో కూరుకుపోయిన మనిషిలా కనిపించారు. ఆయన ఆలోచన అంతా ఉమ పెళ్ళి గురించి. ఎదిగిన ఆడపిల్ల యింట్లో తిరుగుతుంటే కన్న తల్లిదండ్రులకు చాలా యిబ్బందిగా ఉంటుంది. కూతురికి యింకా పెళ్ళి చేయలేక పోయామని మనస్సులో బాధ కాలుస్తూనే ఉంటుంది. ఎవరో ఒక మనిషి చేతికి కూతురు బాధ్యత అప్పజెప్పేవరకూ గుండెలోని బరువు తగ్గదు. మధ్యతరగతి కుటుంబాలలో ఆడపిల్లలను కన్న తల్లి దండ్రులకు ఈ బాధ అంత సులువుగా తప్పేదికాదు !

అయినా మూర్తిగారు ఉమ గురించి అంతగా ఆలోచించవలసిన అవసరం లేదు. అందమైన ఉమ మనస్సు ఉన్నత మైంది ఏ మనిషితో జీవితం పంచు కున్నా అవతల మనిషిని సుఖపెట్టి తను సంతోషపడుతుంది. ఎప్పుడూ నవ్వుతూ మాట్లాడే ఆమె మాటలలో ఆత్మీయత జల్లు, అనురాగపు పొంగు కనిపిస్తాయి. ఆమెను పెళ్ళిచేసుకునే వాడు తప్పకుండా అదృష్టవంతుడే అయ్యుండాలి !

మూర్తిగారి దృష్టి ఆకాశంమీది నుంచి కదలలేదు. ఆయన ఆలోచనలలో ఆయనను వదిలి 'గుడ్‌నైట్' చెప్పి నా గదిలోకి వచ్చి పడుకున్నాను.

మరునాడు ఉదయం-నిద్రలేచి బాత్ రూంవైపు వెడుతుంటే వరండాలో ఉన్న స్తంభానికి ఆనుకుని తలంటుపోసుకున్న జుట్టును చిక్కు తీసుకుంటుంది ఉమ. నుదుట ఎర్రని తిలకం. కాటుక దిద్దిన కళ్లు. తెల్లనిచీర- అదే రంగు బ్లౌజులో కడిగిన ముత్యంలా ఉంది. తడి ఆరని కురులవల్ల ఆమె బ్లౌజు వెనకభాగం చాలామట్టుకు తడిసిపోయింది.

నన్ను చూసి 'గుడ్‌మార్నింగ్ ... ఈ రోజు ఆలస్యంగా లేచినట్టున్నారు. రాత్రి నిద్రపట్టలేదా ?' అంది చనువుగా.

ఆమె మాటలకు నవ్వి 'నిద్రపట్టక పోవడంకాదు. కొంచెం అతిగా నిద్రపోయాను.'

'అదృష్టవంతులు' అంది. నవ్వుతూ..

ఆమెను దాటిపోతుండగా 'ఏమండీ' అని పిలిచింది నెమ్మదిగా.

ఎందుకు అన్నట్టు చూసాను. ఉమ అటు యిటు చూసి తలదించి, కాలి వ్రేళ్లతో నేలను రాస్తూ 'మరి ... మరి ... మీతో కొంచెం మాట్లాడాలి. సాయంత్రం అయిదున్నరకు లైబ్రరీ దగ్గరున్న పార్కుకు రాగలరా ?' అంది గబగబా.

ఆశ్చర్యపోయాను.విషయం ఏమిటో ఎందుకు పార్కుకు రమ్మంటుందో

ఆలోచిస్తుండగా 'వస్తారు కదూ' అంది నెమ్మదిగా. నేను ఏదో చెప్పబోయాను. అంతలో ఉమ తల్లి అటుగా రావడం–ఉమ మాట్లాడ వద్దని కళ్ళతో వారించడం ఒకేసారి జరిగాయి.

నేను మాట్లాడకుండా 'వస్తానని తల ఊపి ముందుకు నడిచాను. ఉమ పార్కుకు ఎందుకు రమ్మంది ? ఏ విషయం గురించి మాట్లాడాలందీ నాకు బోధపడలేదు. కాస్సేపు ఆలోచించాను. ఏ విషయం తట్టలేదు. సరే ! విషయం ఏమిటో సాయంత్రం తెలియనే తెలుస్తుంది కదా! అనుకున్నాను !

మంగినపూడిలో ఉన్న మా ఆఫీసు నుండి పార్కుదగ్గర బస్సు దిగేటప్పటికి ఉమ చెప్పిన టైమ్‌కన్నా అరగంట పైనే దాటింది. గబగబా పార్కువైపు నడిచాను. గేటుదగ్గర ఉమ నిలుచుని ఉంది. ఆమె అలా ఒంటరిగా నిలబడడం చూసి చాలామంది ఆమెను ఆకలిగా, ఆశగా చూస్తున్నారు. ఆడపిల్ల ఒంటరిగా రోడ్డుమీద ఎందుకు నిలబడిందో – ఎవరికోసం నిరీక్షిస్తుందో తెలుసు కోవాలనే కుతూహలం చాలామందికి ఉంటుంది. వాళ్ళ కుతూహలం ఒంటరి ఆడపిల్లను తప్పకుండా యిబ్బంది పెడుతుంది. అలా యిబ్బందిలో ఉన్న ఉమ నన్ను కొద్దిదూరంలో చూసి రిలీఫ్‌గా నవ్వింది.

నేను దగ్గరకు వచ్చింతరువాత 'అబ్బ–మీరు వచ్చారుకదా ! వస్తారో రారో అనే సస్పెన్సుతో చచ్చాను. పైగా యిక్కడ యిలా నుంచోడానికి భయంవేసింది. చూసారుగా ఒంటరిగా నిలబడ్డ ఆడపిల్లను మ్రింగేయాలని ఎన్ని మృగాలు ఆకలిగా చూస్తున్నాయో! మరో పదినిమిషాలు చూసి మీరు రాక పోతే ఇంటికి వెళ్ళిపోదా మనుకుంటు న్నాను. ఇంతలో మీరు రానే వచ్చారు,' అంది తృప్తిగా ఊపిరి పీల్చి.

'క్షమించండి. మిమ్మల్ని యిబ్బంది పెట్టాను. ఆఫీసునుండి వేగంగా బయలు దేరినా బస్సు సమయానికి వచ్చింది కాదు. అనుకోకుండా ఆలస్యమైంది...' అన్నాను బాధగా.

'ఫర్వాలేదులెండి ... మీరు వచ్చా రుగా' అంది.

ఇద్దరం పార్కు లోపలకు నడిచాం. ఏపుగా పెరిగిన పచ్చికమీద ఆమె సరసన నడవడం వింతగాను, క్రొత్తగానూ ఉంది. నాకేదో మనస్సులో భయం. ఎవరైనాచూస్తే ఏమనుకుంటారో ననే భీతి. పార్కులో కూర్చున్న చాలామంది కళ్ళు మామీదనే ఉన్నాయి. అందరికి దూరంగా వచ్చి ఒక మూలగా కూర్చున్నాం. ఎప్పుడో తడిపిన గడ్డి యింకా తడితడిగా ఉంది. మేము

కూర్చున్న చోట నున్నగా నుగు చెట్టు పువ్వులు గాలికి ఒక్కొక్కటి రాలి గడ్డి మీద పడుతున్నాయి. పార్కు నాను కున్న లైబ్రరీలోనుండి మనుష్యుల మాటలు నెమ్మదిగా వినిపిస్తున్నాయి. ఉమ నా కెదురుగా మోకాళ్ళమీద తలఆన్చి చేతిలో గడ్డిని త్రెంచుతూ ఉండిపోయింది. గాలివాటుకు ఆమె ముఖంమీద ముంగురులు పడుతూ లేస్తు న్నాయి. వాటిని చేతితో మృదువుగా ప్రక్కకు తీసుకుంటుంది ఆమె అందమైన కళ్ళలో అపురూపమైన భావమేదో తొంగిచూడడానికి విశ్వప్రయత్నం చేస్తుంది

కాస్సేపు పోయింతరువాత "ఏదో విషయం మాట్లాడాలని రమ్మన్నారు. మర్చిపోయారా ?" అన్నాను.

నా మాటకు ఉమ సన్నగా, చిన్నగా నవ్వింది. ఆ నవ్వు ఒక్కక్షణం నీటి మీద తరగలా మెరిసింది. ఒక అందమైన పువ్వు గాలికి కదిలినట్టయింది. గాలికి జారే పైటను సవరించుకుని "అబ్బే–అదేం లేదండి. ఎలా మొదలు పెట్టాలా అని ఆలోచిస్తున్నాను. అసలు విషయం చెప్పేముందు నే నొకటి అడుగుతాను. నేనంటే మీ అభిప్రాయం ఏమిటో చెప్పండి" అంది.

ఆ ప్రశ్నకు తడబడ్డాను. తొట్రుపడ్డాను. ఉమవైపు చూసాను. ఉమ కళ్ళలోనూ ఆ ప్రశ్న కనిపించింది.

"అభిప్రాయం...అభిప్రాయం ఏముంది మీరు మంచివారు – చదువుకున్నవారు అందంగా ఉంటారు" అన్నాను.

"భలేవారండి బాబూ ! ఆ విషయం వినడానికి మిమ్మల్ని యింతదూరం తీసుకురావాలా ? నేనంటే మరో అభిప్రాయం మీకు లేదా?" అంది. అలా అంటున్నప్పుడు ఆమె ముఖం రాగ రంజితమైంది. ఆమె భావమేమిటో నాకు లీలగా అర్థమైంది. అయినా ఏం చెప్పాలో అర్థంకాలేదు. మౌనంగా ఉండిపోయాను.

"పోనీ మీరు చెప్పకపోతే ... మానే యండి. మీ గురించి నా అభిప్రాయం ఏమిటో చెప్పమంటారా" అంది. చెప్పమన్నట్టు తల ఊపాను. తలను కొంచెం దించి ఓరగా చూసి "మిమ్మల్ని జీవితంలో తోడుగా పొందిన ఆడపిల్ల అదృష్టవంతురాలు. ఆ అదృష్టం నాకుంది అనుకుంటాను,"అంది వేగంగా.

ఆ మాటకు ఉలిక్కిపడ్డాను. యింత సూటిగా స్పష్టంగా ఆమె భావమేమిటో చెప్పేసరికి ఆశ్చర్యపోయాను. ఉమ అంటే నాకు అభిమానం ఉందిగాని నే నెప్పుడూ ఆ అభిమానానికి మరో అభిప్రాయం జోడించి చూడలేదు.దానికి కారణం నాకోసం ఎదురుతెన్నులు చూసే మామయ్య కూతురు ఎప్పుడూ హృదయంలో మెదలడమే!అసలు ఉమకు యిటువంటి అభిప్రాయం కలగడానికి

నేను ఎప్పుడూ ఆస్కారం యిచ్చినట్టు గుర్తులేదు. మరి యిప్పుడామె ఆలోచనకు నిర్ణయానికి ఏంచెప్పాలో అర్థం కాలేదు.

అర్థంకాక ఉండిపోయిన నన్ను "ఏమండీ ఈ ఆడపిల్ల యింత బరితెగించి అడిగిందేమిటని కదూ ఆలోచిస్తున్నారు ?" అంది

"ఛ-ఛ అదేంకాదు."

"మరైతే నేను మీకు తగినదానిని కాకపోవచ్చు. మీ ఉద్దేశ్యం, అభిప్రాయం మరోలా ఉన్నా నేను కాదనను కాని మీరంటే నాకు అభిమానం-ఆదరణ. మీ పట్ల ఆత్మీయత గుండెలో పేరుకుపోయింది నాకు తెలీయకుండానే హృదయంలో మీకో స్థానం స్థిరంగా ఏర్పడిపోయింది తెలుసుకునేటప్పటికి మీ తోటిదే జీవిత మనిపించింది అందుకనే ఈ చొరవ తీసుకొన్నాను. అదీగాక నాకు వేగంగా పెళ్ళిచేయాలని మా నాన్నగారు ఎంతో ఆరాటపడుతున్నారు ఊరురా వరాన్వేషణలో తిరుగుతున్నారు మనిషి విలువను, వ్యక్తిత్వాన్ని డబ్బుతో వెల కట్టే ఈ ప్రపంచంలో ఆడపిల్ల పెళ్ళి అంత సులువుగా జరగదు. ఆర్థికంగా అండలేని మా నాన్నగారు నాకు వరుడిని చూసి, ఆ వరుడు కోరే కోర్కెలు తీర్చి నాకీ కన్నె చెర విడిపిస్తారని ఆశలేదు. దానికి నేను బాధపడడంలేదు కాని కూతురుకు పెళ్ళిచేయలేదని ఆయన పడే బాధ నేను చూడలేను. హాయిగా వచ్చే పింఛనుతో కృష్ణా, రామా అంటూ కాలం గడపవలసిన రోజుల్లో నేను ఎదిగి ఆయన శాంతి, సుఖం పెళ్ళిపేరుతో హరించేస్తున్నాను. ఆయనకు ఈ బాధ తప్పించాలని భగవంతుని వేడుకుంటుండగా మీరు కనిపించారు. మీ మీద ఆశలు పెంచుకున్నాను అందుకే మొహమాటపడకుండా ఈ విషయం మీతో చెప్పాను. మరి మీ అభిప్రాయమేమిటో చెప్పండి" అంది పొడిగా.

"సారీ ఉమ" అన్నాను ఒక్కసారిగా

నా మాటకు ఉమ వెలవెలబోయింది. క్షణంలో తేరుకుని "నాకు తెల్సండి. మీ మౌనం ముందే మీ మనస్సులోని మాటను పైకి చెప్పింది. నన్ను చేసుకోలేనంటారు – కాకపోతే నన్ను ఎప్పుడూ ఆ దృష్టితో చూడలేదంటారు. అంతేగా."

"నిజం ! మిమ్మల్ని ఎప్పుడూ నేను ఆ దృష్టితో చూడలేదు మీరంటే నాకు యిష్టం. అభిమానం అంతమాత్రాన ఆ యిష్టాన్ని, అభిమానాన్ని మరో రకంగా అన్వయించి చెప్పలేను."

బైదిబై మీకు చెప్పటం మరచిపోయాను. నాకోసం మా మావయ్య కూతురు సిద్ధంగా ఉంది ఆమెను నేను డిజప్పాయింట్ చేయలేను ఈ విషయం

మీకు చెప్పడానికి ఎప్పుడూ అస్కారం రాలేదు. మీ నాన్నగారితో ఒకసారి మాటల సందర్భంలో మా యింటి సంగతులతోపాటు నా పెళ్ళి విషయం చెప్పాను మీకూ ఈ విషయం తెలుసుననుకున్నాను ... మిమ్మల్ని కష్టపెడితే క్షమించండి "...

"నో, నో ... యిందులో మీరు చేసింది ఏముంది నేనే పొరపాటు పడ్డాను పరిస్థితులు నన్ను తొందర పెట్టాయి. చెప్పకుంటే చేయి అందిస్తారని మనస్సు విప్పి మాట్లాడాను దేనికైనా అదృష్టం ఉండాలిగదండి... పోనీలెండి... ఈ రోజున్నా మీ నోటి వెంట ఆ సంతోషవార్త విన్నాను మై కంగ్రాట్స్ !" ఆ మాట అంటున్నప్పుడు ఉమ గొంతు గాద్గదికమైంది. ఆమె కళ్ళలో చెమ్మరిల్లిన కన్నీటిని నేను చూడకూడదని కాబోలు తలను ప్రక్కకు త్రిప్పింది ఆ పరిస్థితిలో ఆమెను చూస్తే హృదయం జాలితో నిండిపోయింది అనవసరంగా ఒక ఆడపిల్లను యిబ్బందిపెట్టా ననిపించింది. మరేం మాటలు సాగలేదు. చీకటి మా చుట్టూ పరుచుకుంది మౌనం యిద్దరినీ యిబ్బంది పెట్టింది.

పార్కు బయటకు వచ్చింతరువాత "నాకు బజారులో కొంచెం పని ఉంది కృష్ణ కిషోర్ టాకీసు దగ్గర బస్సు ఎక్కిస్తాను యింటికి వెళ్ళిపోండి" అన్నాను

ఉమ తల ఊపింది.

ఇద్దరం కృష్ణకిషోర్ వైపు నడిచాం.

మరునాడు ఆదివారం. ఉదయం నుండి వర్షం కుండపోతగా కురుస్తూనే ఉంది. వర్షంలో ఎక్కడకు వెళ్ళడానికీ మనస్కరించలేదు పోనీ మూర్తిగారితో చదరంగం ఆడదామంటే ఆయనకు జ్వరం. ఏమీ తోచక ఎప్పుడో గీసిన కాన్వాసు బొమ్మ నొకదానిని పైకి తీసి స్టాండుకు బిగించాను. ఒకసారి మిత్రుడి యింట్లో రాధాకృష్ణుల చిత్రం చూసాను. అది నన్ను బాగా ఆకర్షించింది ఆ చిత్రంలో ప్రేమికుల పారవశ్యం, ప్రణయం ఉంది రాధా మాధవులిద్దరూ ఒకరి కళ్ళలోకి ఒకరు ఆరాధనగా చూసుకుంటూ తన్మయత్వంలో తేలిపోతుంటారు వారిని చూస్తున్న చెట్టుమీద ఉన్న గువ్వల జంట. ప్రక్కన ప్రశాంతంగా పారే నది. దూరాన కొండలు పచ్చని పచ్చిక. దానిలో మెరిసే రంగు రంగుల పూలు. సరిగా వేయాలిగాని ఒక గొప్ప సుందర దృశ్యం తయారవుతుంది.

పట్టుదలగా కూర్చుని జాగ్రత్తగా రంగులు కలిపాను కొన్నిగంటల అనంతరం బొమ్మ జీవకళతో ఉట్టి పడింది బోర్డరు గీస్తుండగా ఉమ నా వెనుక నిలుచోవడం గమనించాను




ఆమె ఎంతసేపటినుండి నిలుచుందో గాని అప్పుడే చూసాను నా కంటికి మామూలుగానే కనిపించింది. నిన్న జరిగిన సంఘటన తాలూకు ఛాయలు ఏమాత్రం ఆమెలో కనిపించలేదు.

ఆమెవైపు తిరిగిన నాతో "బొమ్మ చాలా బాగుందండి. రియల్లీ యిటీజ్ మార్వలెస్. మీ చిత్రలేఖనంలోని ప్రావీణ్యత అంతా ఈ బొమ్మలో కనిపిస్తుంది!" అంది.

"నిజంగానా?"

"అబద్ధాలు చెప్పడం ఆడపిల్లలకు అలవాటుండదు. అందునా పెళ్ళిగాని పిల్ల అబద్ధం చెప్పడానికి అసలే సాహసించదు"

"ఎందుకనో?"

"అది అంతే ! మీకు చెప్పినా అర్థం కాదు. సరేగాని మీరు గీసిన బొమ్మ నా కిస్తారా ? ప్రేమకు – ప్రణయానికి రాధామాధవులు నిదర్శనం అంటారు వాళ్ళెంత అదృష్టవంతులో జీవితంలో ఆశించింది అందుకుని పొందగలిగేరు. ప్రపంచంలో ప్రేమికులందరు రాధా మాధవులవుతే ఎంత బాగుండేది ! ఏమిటో మేన్ ప్రపోజస్, గాడ్ డిస్పో జస్ అని మనం అనుకునేవి అన్నీ జరుగుతాయా ? పోనీయండి, దటీజ్ ఎస్టర్‌డే ఎఫైర్ ... ఈ బొమ్మ నా కివ్వండి. యిన్నాళ్ళ మన పరిచ యాన్ని శాశ్వతంగా కళ్ళముందు నిలుపుకుంటాను" అంది ఉద్వేగంగా.

ఉమ మాటలు నన్ను కలత పెట్టాయి అమాయకంగా పాపం నామీద ఎన్ని ఆశలు పెట్టుకుంది ? ఎంతగా ఆరాధి స్తుంది. ఆ ఆరాధన వెనుక వేదనలో నలిగిన గుండె ఎంతగా స్పందిస్తుందో!! స్త్రీ మనస్సు పడిందంటే ... ఆ మన స్సులో నచ్చినవాడికి శాశ్వతంగా పీఠం వేసి కూర్చోబెడుతుంది. తను మనస్సు పడింది కానిరోజున మనస్సులో పడే బాధకు అంతు ఉండదు అనుకున్నాను.

నా మాటకోసం ఎదురుచూస్తున్న ఉమతో. "మీ కంతగా యిష్టం అయితే తీసుకోండి" అన్నాను.

ఉమ కళ్ళు తృప్తిగా మెరిసాయి.

బోర్డరు గీసి 'విత్ బెస్ట్ విషస్' రావు అని బొమ్మక్రింద వ్రాసి ఆమె చేతికి అందించాను.

ఉమ 'థాంక్స్' చెప్పి లోపలకు తీసుకెళ్ళింది.

ఉమ వెళ్ళింతరువాత ఆమె గురించి ఆలోచిస్తూ ఉండిపోయాను.

కొన్ని సంఘటనలు ఎప్పుడూ ఊహించనివి హఠాత్తుగా జరుగు తుంటాయి అటువంటివి జరిగినప్పుడు మాత్రం మనిషికి ఊపిరి పీల్చుకో డానికి కూడా సమయం చిక్కదు. మరుసటిరోజు ఆఫీసుకు వచ్చేసరికి ప్రమోషన్‌మీద విజయవాడ బదిలీ చేసినట్టు తెలిసింది ఉత్తర్వు ప్రకారం వెంటనే వెళ్ళి జాయిన్ కావాలి. బందరు వదిలిపోతుంటే మనస్సులో బాధ.

ఇంటికి వచ్చి ఈ విషయం ఉమతో చెప్పాను ఉమ నమ్మలేనట్టు చూసింది. రెండుక్షణాలు పోయింతరువాత... "మీరు ఈ సమయంలో నానుండి దూరంగా వెళ్ళడమే మంచిది ఎందు కంటే ఈ రోజు కాకపోయిన మరో రోజైనా ... మిమ్మల్ని మరిచిపోయి నాకు ఒక తోడు జీవితంలో యిష్టానికో, అయిష్టానికో సంపాదించాలి కదా ! అది మీరుంటే సాధ్యపడదు. ఎందు కంటే మిమ్మల్ని నేను మర్చిపోలేను కనుక...అది సరే ... మీ పెళ్ళికి శుభ లేఖ పంపించండి. రాలేకపోయినా

అభినందనలు పంపుతాను ఒకవేళ- ముందే నా పెళ్ళి జరిగితే! ఏమో జరుగు తుందంటారా ?... మీరు తప్పకుండా రావాలి యు మస్ట్ కమ్ పెళ్ళి పందిట్లో తల ఎత్తేది మీకోసం ... వెళ్ళిరండి. ఐ విష్ యు ఆల్ ది బెస్ట్" అంది

జవాబు చెప్పడానికి నాకు మాటలు కరువయ్యాయి

అంతలో అటుగా వచ్చిన మూర్తి గారు సంగతి విని" యిన్నాళ్ళూ మా యింట్లో ఒక మనిషిగా మసిలావు యిప్పుడు నువ్వు వెళ్ళిపోతుంటే బాధగా ఉందోయ్ ... విజయవాడ వెళ్ళినా మమ్మల్ని మరిచిపోకు అప్పుడప్పుడు రావడానికి ప్రయత్నించు నువ్వు ఎప్పుడు రాకపోయినా ఉమ పెళ్ళికి మాత్రం తప్పకుండా రావాలి" అన్నా రాయన

అలాగే నన్నట్టు తల ఊపాను ఆ రాత్రే విజయవాడ బస్సు ఎక్కాను.

కాలం ఎవరికీ తెలియకుండా క్యాలెం డరులోని కొన్ని కాగితాలను తినేసింది ఈ మధ్యలో మూర్తిగారి పేరన రెండు ఉత్తరాలు వ్రాసాను. ఒకదానికి సమా ధానం వ్రాసారు ఆ తరువాత సంగ తులు తెలియలేదు. నేను విజయవాడ వచ్చిన మూడో నెల కనుకుంటా ఉమ పెళ్ళి అని శుభలేఖ వచ్చింది ఆ సమ యంలో అర్జంటు పనిమీద హైద్రాబాద్ వెళ్ళవలసి వచ్చి పెళ్ళికి వెళ్ళలేక పోయాను రాలేకపోయినందుకు మరోలా అనుకోవద్దని మూర్తిగారికి ఉత్తరం వ్రాసాను. అంతే ! ఆ తరువాత బందరు అక్కడ మనుష్యులు జ్ఞాప కాలలో యిమిడిపోయారు

కాలం మరి కాస్త ముందుకు కదిలింది—

ఆఫీసులో పని చూస్తుండగా పోస్టు మేన్ పెద్ద కవరొకటి తెచ్చి యిచ్చాడు. అంత పెద్ద కవరు ఎక్కడినుండి వచ్చిందో చూడ్డానికి ప్రయత్నించాను గాని దానిమీద ఫ్రమ్ అడ్రసు లేదు. ఎవరు పంపారో ఏమై ఉంటుందో అని ఊహిస్తూ కవరు చింపి లోపల మతడ పెట్టి ఉన్న కాన్వాసు క్లాత్‌ను బయటకు తీసాను ఆశ్చర్యం అది ఒకనాడు ఉమ ముచ్చటపడి తీసుకున్న రాధా కృష్ణుల బొమ్మ. దానివెంట ముత్యాల లాంటి అక్షరాలతో పసుపుపచ్చ కాగితం కనిపించింది

తీసి చదవడం ప్రారంభించాను.

"ప్రియమైన రావ్‌గారికి నమస్కారం.

చాలాకాలానికి మిమ్మల్ని ఉత్తరం ద్వారా పలకరించే భాగ్యం కలిగింది. అందుకు సంతోషంకన్నా విచారమే ఎక్కువగా ఉంది. మీరు నా పెళ్ళికి వస్తారనుకున్నాను కాని రాలేదు నిజానికి మీరు రాకపోవడమే ఒకరకంగా మంచిదయ్యింది. నా దురదృష్టంకొలది

మా వారు వట్టి అనుమానం మనిషి. కనీసం నాలుగుగోడల మధ్య నవ్వినా సహించలేని మనస్తత్వం ఆయనది. అందువల్ల నేను కలలుగన్న జీవితం ఈనాడు కలలోకి కూడా రావడంలేదు. యిక యిప్పుడు జీవితంతో రాజీ... అది తప్ప మరో గత్యంతరం కనిపించడంలేదు ... యిక అసలు విషయానికి వస్తే ... ఒకనాడు మీరు గీసిన రాధాకృష్ణుల బొమ్మను నాకు కావాలని ముచ్చటపడి తీసుకున్నాను. మీరు నాకిచ్చిన ఆ ఒక్క గుర్తు చూస్తుంటే జీవితంలో ఏం పోగొట్టుకున్నా పోగొట్టుకోలేదని భ్రాంతి కలిగేది.

ఏదో తృప్తి ఎద ఎదలో తొంగి చూసేది అనుభవం వాస్తవానికన్నా తియ్యగా, ఊహకన్న మధురంగా ఉండేది ఒకరోజు బొమ్మక్రింద నున్న మీ పేరు చూసి ఆయన 'ఎవరీ రావు?' అని అడిగారు. మనమధ్య ఉన్న అనుబంధం దాచకుండా చెప్పాను. అప్పటి నుండి ఆయన కళ్ళలో నిప్పులు, అసూయ, ద్వేషం, నా నీడమీద నిఘా నా మాటమీద అబద్ధాల అన్వయింపు ప్రారంభమైంది. క్షణ క్షణం సాధింపు ...అన్నీ భరించాను. అయినా ఆయన మనస్సు శాంతించలేదు. చివరకు ఏమన్నారో తెలుసా "ఈ బొమ్మ అయినా యింటిలోనుండి పోవాలట, లేకపోతే నేనైనా వెళ్ళిపోవాలట యిదీ నా దురదృష్టం. ఆడదాన్నిగా పుట్టినందుకు ఆశ ఉండడం తప్పంటారా? ఎలాగూ నేను యింటికి వెళ్ళి మా నాన్నగారి గుండెలమీద కూర్చునే శక్తిలేదు. చావు అయినా బ్రతుకైనా ఈ పరిధిలో యిలా యిమిడిపోవడమే? అందుకే నేను అపురూపంగా యిష్టపడ్డ ఈ బొమ్మను తిరిగి మీకు పంపిస్తున్నాను. నన్ను క్షమించండి - ఎప్పుడైనా మీ గుండెలో ఈ నిర్భాగ్యురాలు మెదిలితే ఒక్క కన్నీటిచుక్క రాల్చండి! అదే మీరిచ్చే అపురూపమైన కానుక నాకు!

సెలవ్ అంటూ చెప్పలేని
మీ ఉమ

ఉత్తరం చదివింతర్వాత కళ్ళలో నీళ్లు గిర్రున తిరిగాయి ఆ కన్నీటిలో చేతిలోని బొమ్మ మసక మసకగా కనిపించింది






సమాంతర దూరంలో పరుగిడుతున్న నల్లత్రాచుల్లా వున్న రైలుపట్టాలమీద కాలుపెట్టి, ఒకసారి చుట్టూ చూసింది సావిత్రి అమావాస్య రాత్రి. ఎలక్ట్రిక్ దీపస్తంభాలున్న ప్రదేశాల్లో తప్ప ఎటుచూసినా కటిక చీకటి-సావిత్రి మనసులోలాగే.

ఇనుప రైలుపట్టా కాలుకి ఐసులా తగుల్తోంది 'రంయ్' మని చలిగాలి తెరలు తెరలుగా వచ్చి, చెంపల్ని కోస్తోంది. నెమ్మదిగా పమిట తల మీదుగా చుట్టుకుని, కొంగు పళ్ళమధ్య కరిచిపెట్టి, ఇంకొకసారి చుట్టూ చూసి, ప్రక్కనే వున్న పెద్ద కొండరాయి మీదకు నడిచి, అక్కడ కూర్చుంది.

'ఎంత ఉన్నతకుటుంబంలో పుట్టినా చదువు సంధ్యల్లేని నాలాటి ఆడది ఈ దేశంలో మగవాడి చేతిలో నరకం

అనుభవించాల్సిందే. వెధవ బానిస బ్రతుకు' అని గొణుక్కుంది. 'ఇంటి దగ్గర బయల్దేరి పదినిమిషాలయ్యింది. ఇంకో ఇరవై నిమిషాలు' అనికూడా అనుకుంది.

వెనక దిగువలో ప్రక్కప్రక్కన వున్న విశాలమైన రెండురోడ్లు కడిగిన గచ్చులా వున్నాయి. ఆ రోడ్లకి ఇరుప్రక్కలా చలనంలేకుండా నిటారుగా నిల్చున్నచెట్లు రక్షకభటుల్లా వున్నాయి. ఎడమవైపు కొద్దిదూరంలో బాగా వెలుతురు. ఆ వెనగ్గా గవర్నరు బంగళా కనిపిస్తున్నాయి. వాటికి కొంచెం కుడి ప్రక్కగా ఇళ్ళమీదనుంచి విమానాశ్రయంనుంచి వస్తున్న లైటింగు మధ్య మధ్యలో కనిపిస్తోంది. ఆ ప్రక్కగా భయంకొల్పుతున్న 'భూత్‌బంగళా'లాంటి ఇల్లు. కళ్ళకెదురుగా దిగువలో చలనం లేని హుసేన్ సాగర్ చెరువు. చెరువుకు అటుప్రక్క వరసలో వున్న టాంక్ బండ్‌మీద ట్యూబ్‌లైట్ల ప్రతిబింబాలు నీట్లో వెండిస్తంభాలు వ్రేళాడుతూన్న భ్రాంతిని కలిగిస్తున్నాయి. కుడివైపుగా స్టేషన్నుంచి ఎఱ్ఱదీపం, దానికి కొంచెం ముందునుంచి పట్టాల పొడుగునా పాకుతూ వస్తూన్న నిగనిగలు. కుడివైపునే మరింత దూరంలో కొండ మీది పాలరాతి దేవాలయం స్వర్గాధిపతి మందిరంలా కనిపిస్తోంది.

చుట్టూ చూసి, ముడుచుకూర్చుని, కళ్ళలో నీళ్ళు వత్తుకుని, మోకాళ్ళమధ్య మొహందాచుకుంది సావిత్రి.

తన పుట్టింటివాళ్ళు, చిన్నప్పుడు తన నెంత గారాబంగా పెంచినదీ, వైభవోపేతంగా జరిగిన పెళ్ళి, పెళ్ళికాక ముందు రాధాకృష్ణ తనతో చెప్పిన ప్రేమకబుర్లూ,...అన్నీ గుర్తుకు తెచ్చుకుని బాధపడింది సావిత్రి. బీదవాడయినా రాధాక్రిష్ణనే పెళ్ళాడవలసింది తను. డబ్బున్నవాడు, చదువుకున్నవాడు అని గంగాధరానికి తనను ముడిపెట్టి గొంతుకోశారు తల్లిదండ్రులు.

తలెత్తి, స్టేషన్‌వైపొకసారి చూసి, 'ఇంక పావుగంట' అనుకుని, మళ్ళీ మోకాళ్ళమధ్య మొహందాచుకుంది.

"ఏయ్ పిల్లా...!" — భయంకొల్పే ఆజమాయిషీతో తక్కువస్థాయి గొంతుతో పిలిచిన పిలుపు.

— ఉలిక్కిపడి, తలెత్తింది సావిత్రి.

పెద్ద మీసాలతో, చింతనిప్పుల్లాంటి కళ్ళతో ఎదురుగా కండలుతిరిగిన వస్తాదులాంటి మనిషి. మోకాళ్ళమీద కూర్చుని, కళ్ళు బాగా పెద్దవిచేసి, తన కళ్ళలోకి నమిలేసేలాగ చూస్తున్నాడు. ఒకక్షణంలో నిభాయించుకుంది సావిత్రి

"ఏయ్—ఎవరివయ్యా నువ్వు?" అని కసురుతున్నట్టుగా అంది.

—ఉలిక్కిపడి చూసాడు వాడు.

తనని చూస్తూనే గుండె ఆగి చస్తుంది అనుకున్నాడు ఎవరికైనా కలలో కొచ్చే ఆకారం తనది అందులో–రాత్రివేళ, ఒంటరి ఆడది. తననీ, చేతిలో కత్తినీ చూసినా భయపడట్లేదు!!!

"అలా చూస్తావేఁవిటయ్యా? ఎవరి వంటే మాట్లాడవేం?" రెట్టించింది

"ఎవర్నా? నేనెవరో సెప్పాలా? గజదొంగ బద్రయ్య పేరెప్పుడన్నా ఇన్నావా? ఈ సుట్టుపక్కల బస్తీలన్ని టిలో నా పేరుసెప్తే పిల్లలేకాదు, పెద్దాళ్ళు కూడా పచ్చి మంచినీల్లు తాగలేరు"— మీసం మెలేస్తూ అన్నాడు

"కట్టెల అడితి పోచమ్మని పట్ట పగలు చంపి నగలు పట్టుకు పోయింది. ..."

"నేనే అయితే గుర్తుపట్టావన్న మాట"

"ఆ, అది సరే ఏవిటంటావ్ ఇప్పుడు" చిరాగ్గా అడిగింది

"ఆఁయ్. నేనెవరో తెలిసాక్కూడా నీకు బయంగా లేదా?"

"భయవాఁ? ఎందుకూ?"

"సంపేత్తానని!!" కాలుతో బలంగా నేలమీద తన్ని, ఉరిమాడు భద్రయ్య

వెటకారంగా చూస్తూ, జీవంలేని నవ్వొకటి నవ్వింది సావిత్రి

"ఏయ్! ఎందుకు నవ్వుతావు?"— కోపంగా పళ్ళుకొరుకుతూ అరిచాడు వాడు

"చంపేస్తావని భయపడాలా నేను?...భలే! చావడానికి వచ్చిన దానికి చావంటే భయం ఎందుకుంటుంది?"

అయోమయంగా చూసాడు భద్రయ్య

"ఆఁ, నేనీ ఏలప్పుడు ఇక్కడికొత్తానని నీకెలా తెల్సు?"

"చద్దామనుకున్నది నీ చేతుల్లో కాదు నీ చేతుల్లో చావడంతప్పితే ఇంక మార్గాలే లేవేమిటి? ఇంకో పదినిమిషాల్లో రైలుంది" తాపీగా అంది సావిత్రి

అంతా అయోమయంగానే వుంది భద్రయ్యకి నెమ్మదిగా బండరాతిమీద కూలబడ్డాడు

"సూడ్డానికి పెద్దింటి పిల్లలాగున్నావు సద్దావఁని ఎందుకు అనుకుంటున్నావు?" జాలి చూపిస్తూ అడిగాడు

"ఇంట్లో బాధలు పడలేక..."

"ఏం నీ మొగుడు మంచోడుకాదా?"

"ఉఁహుఁ, కాదు బాగా డబ్బుంది. కానీ నాకోసం కాణీ ఖర్చుపెట్టడు పైగా ఎప్పుడూ మా పుట్టింటినుంచి డబ్బు తెమ్మని నన్ను బాధలుపెడుతుంటాడు ప్రతిరోజూ తాగొచ్చి నన్ను కొడ్తూంటాడు ఈరోజుకూడా తాగొచ్చి బాగా కొట్టాడు ఉన్న లక్షల ఆస్తీ అతని తాగుడుకే సరిపోతోంది అందుకనే బాధలు భరించలేక చద్దామని ఇలా

వచ్చాను" అని, కళ్ళు వత్తుకుంది సావిత్రి

"మీ ఆయన దగ్గర బాగా డబ్బుందా ?" తనలోని ఆశని దాచ ప్రయత్నిస్తూ అడిగాడు భద్రయ్య

"బోల్డుంది ఇంటిదగ్గర బీరువాల్లోనే చాలా వుంది కానీ తాళాలెప్పుడూ తన దగ్గరే పెట్టుకుని, నా ఆనందంకోసం పైసా విదల్చడు పోయేటప్పుడు కూడా కట్టుకుపోగలనని అనుకుంటున్నాడు కాబోలు "

"ఇప్పుడు ఇంటికాడే వున్నాడా?"

"ఆ తాగొచ్చి, నన్నుకొట్టి, పాపం అలిసిపోయి పడుకున్నాడు. నేనిలా వచ్చేసాను "

"సావాలనుకోవడానికి బదులు నువ్వు ఏవూరన్నా పారిపోయి, సుకంగా బతకొచ్చుగా?"

"డబ్బేదీ ?"

"నీమొగుడుకా డుందంటున్నావుగా"

"ఉంటేమాత్రం? ఆడదాన్ని-అతని దగ్గర్నుంచి తాళాలు లాక్కుని డబ్బు తీసుకుని పారిపోగల బలం నాకెక్కడిది తన్నులే తప్పించుకోలేక చస్తూంటే "

"నేను సాయంజేత్తాను పోనీ మీ ఇంటిఇవరాలు అన్నీ సెప్పేవంటే-బోల్డు డబ్బు పట్టుకొచ్చేత్తాను సగంవాటా నాకియ్యాలి, సరేనా?"

"ఓ అలాగే, కానీ ఓ షరతు అతని ప్రాణానికి ఏ ముప్పూ రాకూడదు "

"శశ, ఒంటిమీద అసలు సెయ్యే య్యను సరా? తల్లోడు" అని తలమీద చెయ్యేట్టుకుని ఒట్టేసాడు ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అవుతున్నాడుకూడా

"సరే అయితే ఇలా చూడు బొమ్మ గీస్తున్నాను బాగా అర్థంవేసుకో ..ఇది హాలు ఈ ప్రక్కది బెడ్ రూము హాలు, రీడింగ్ రూముల తలుపులు వేసేసివున్నాయి నువ్వు ఈ ప్రక్కగా పోయి, పెరటివైపునుంచి ఈ బెడ్ రూములో ప్రవేశించు నేను వచ్చేటప్పుడు ఈ తలుపు తీసుకుని వచ్చి, బయట గొళ్ళెం పెట్టాను అర్థమయిందా? ఇంక లోపలికి వెళ్ళాక బెడ్ రూంలోంచి స్టోర్ రూంలోకి అక్కణ్ణుంచి ఒక చిన్న గదిలోకి దావుంది ఆ చిన్నగదిలో రెండు బీరువాలున్నాయి వాటిల్లో వుంది బోలెడు డబ్బు" అని వ్రేలితో రాయిమీద బొమ్మలు గీసి చెప్పింది సావిత్రి

"నేనొక్క అరగంటలో పని ముగించుకు నొచ్చేత్తా నువ్విక్కడే వుండు" అని లేచాడు భద్రయ్య

"నీకంతా తొందరే తప్పితే బుర్ర లేదు అసలు తాళాలెక్క డుంటాయో తెలుసుకున్నావా ?" అజమాయిషీగా అంది

"ఆఁ, అవును మర్చిపోయా సెప్పు "తొందరపాటుని ఒప్పుకున్నాడు.

"తాళాలుఆయనజేబులోనేవున్నాయి

ఇప్పుడే బయటనుంచి వచ్చేడుకదా బయటకెళ్ళేటప్పుడే జేబులో వేసుకుని పోతాడు పైగా అతనికి ఎటువంటి అపాయం కలగనివ్వనని మాటిచ్చావు. అతనుకూడా నీలాగే బలంగావుంటాడు. ఆ మనిషి ఎంత తాగున్నా-నువ్వు ఒక్తి చేతుల్తో ఎలా సంపాదించగలవు తాళాలు?"

"అవును. అదీ నిజవేఁ. ..ప్పుడూ అడ్డొచ్చినవాళ్ళని నరికి పారెయ్యడమే గాని, సునాయాసంగా ఏదీ సెయ్యలేదు. నువ్వేసెప్పు-ఏంసెయ్యమంటావోమరి."

"మీదగ్గర మత్తుమందు రుమాళ్ళూ అవీ వుంటాయికదా?"

"ఆఁ బాగా సెప్పావు. ఈ దౌనులో నాకు తెలిసిన సాయబ్బొకడున్నాడు. ఆడిదగ్గర అన్నీ వుంటాయి. ఇప్పుడే సిటికలో అన్నీ తీసుకొత్తాను" అంటూ లేచి పరిగెట్టబోయాడు భద్రయ్య.

"ఏయ్ ఏయ్ ఆగు. నీ సంగతి బాగానేవుంది. మరి నన్ను బతకమని ఆశకలిపించావుకదా! ఈ రాత్రివేళ ఇలాంటిచోట ఒక్కర్తినీ ఎలా వుండను? ఎవడైనా పీకపిసికి చంపేస్తే?"

"మరైతే ఎట్టా? నాతో వత్తావా గూడెంలోకి?"

"అబ్బెబ్బే...రాను."

"మరైతే ఏటంటావు?"

"సరే ఇక్కడే వుంటాలే.త్వరగా రా. ఆ కత్తిలా పడెయ్యి దగ్గరుంచుకుంటా, ఎందుకన్నా మంచిది "

కత్తి అందించి, భద్రయ్య గబగబా హుసేన్ సాగర్‌వైపు డౌన్‌లోకి దిగిపోయేడు.

చేతిలో కత్తి పదనువైపు ఒకసారి చూసి, నేలమీదరాసి పదును పెడుతూ, రైలుస్టేషన్‌వైపుచూస్తూ,"ఇంక అయిదు నిమిషాలు" అనుకుంది సావిత్రి. ఆమె గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. నెమ్మదిగా ఒక్కొక్కటే చెమటబిందువులు ఆమె మొహంమీద పొటమరిస్తున్నాయి. నాలిక తడారిపోతోంది. కత్తిని బాగా నూరి పదునుచూసి, తృప్తిగా నిట్టూర్చింది, సావిత్రి. స్టేషన్‌వైపు ఇంకొకసారి చూసింది. పచ్చలైటు వెలిగింది.

"మత్తుమందు, తాళ్ళు, నోట్లో కుక్కడానికి గుడ్డలూ గట్రా తెచ్చేసుకున్నా. ఇక నువ్వు మీ ఇల్లెక్కడో సెప్పడవేఁ తరవాయి" అన్నాడు భద్రయ్య పరిగెట్టుకునివచ్చి,వగురుస్తూ.

"ఇదిగో ఇలా నా ముందుకు రా. కూర్చో. బాగా వంగి ఆ సందులో రెండు చెట్లమధ్యగా చూడు. మేడ కనిపించట్లేదూ?"

సావిత్రిముందు మోకాళ్ళమీద కూర్చుని, ఆమె చూపించిన దిశగా కన్ను పొడుచుకు చూస్తున్నాడు, భద్రయ్య.

"చెట్లు అడ్డొస్తున్నట్లున్నాయి నీకు. బాగా వంగితేనేగానీ కనిపించదు. మనెదురుగా కనిపించే కిటికీ క్రింది గదిలోనే మా ఆయన వున్నాడు."

భద్రయ్య ఇంకా వంగాడు. కళ్లు బాగా పెద్దవి చేసుకుని చూస్తున్నాడు.

—రైలు కూత, ఝుక్ ఝుక్ మనే శబ్దం బాగా దగ్గరలో వినిపించాయి.

"అయ్యోరామ! సరిగ్గా చూడవయ్యా. ఇంక వేరేవిధంగా గుర్తులు చెప్ప డానిక్కూడా లేదు. అక్కడున్నవన్నీ మేడలే. ఇదిగో—ఈ కొసకొచ్చి వంగి చూడు. బాగా కనిపిస్తుంది" అంది సావిత్రి, పెదవులు తడిచేసుకుని మొహంమీది చెమటను తుడుచుకుంటూ.

కొసకి వచ్చి, బాగా వంగి, తిన్నగా చూస్తున్నాడు భద్రయ్య.

రైలు కూత మరీ దగ్గరగా వినిపించింది.

"ఎక్కడా......" అంటూ ఏదో అనబోయిన భద్రయ్య పెద్దగా దిక్కులు పిక్కటిల్లేలాగ కేకపెట్టడం, కేకపెడు తూనే ఆ కొండరాయి మీదనుంచి దిగువ లోకి రాలిపోవడం జరిగిపోయేయి.

అతని కంఠంలో బలంగా కత్తి దిగబడిపోయింది.

"చవటవెధవా ! నా సమస్యకి పరిష్కారం నువ్వట్రా చెప్పేది! నువ్వు దొంగతనంచేసి నా యింట్లో —ఆ డబ్బుతో పారిపోయి – 'డబ్బు పట్టుకు పారిపోయింది దొంగముండ' అని నాకు చెడ్డపేరు తెప్పించడానికిట్రా? పైగా వాడ్ని మించిన దుర్మార్గుడివి నువ్వు. వాడు నా కొక్కతికే శత్రువైతే నువ్వు దేశానికే శత్రువివి. నువ్వు బ్రతికుండడం సమా జానికే లోటు. నీలాగే వాణ్ణి ఏ నిద్రో తున్నప్పుడో చంపెయ్యొచ్చు. కానీ వాడు చావకూడదు. అందుకనే నా తల్లి దండ్రులకీ, తెలిసున్నవాళ్ళందరికీ నా చావుకారణం ఏమిటో ఈరోజే ఉత్త రాలు రాసిపడేశాను. ఊళ్లోవాళ్ళంతా 'పెళ్ళాన్ని చంపిన వెధవ' అని మొహం మీద వుమ్మేస్తూంటే వాడు ఆజన్మాంతం కుళ్ళికుళ్ళి ఏడుస్తూ బతకాలి. అదే మా సమస్యకు పరిష్కారం. చచ్చేముందు నీలాంటి దుర్మార్గపు వెధవని నాశనం చెయ్యగల అవకాశం యిచ్చినందుకు ఆ భగవంతుణ్ణి మనసారా అభినంది స్తున్నాను," అని, అతివేగంగా వస్తూన్న రైలుకి—పట్టాలమధ్యగా చేతులు చాచి నిల్చుని, ఆప్యాయంగా ఆహ్వానం పలికింది సావిత్రి.






పేపరు చదువుదామని తీసిన సుజాతకు అందులో ఒక కవరు కన్పించింది. పైన అడ్రసు రాసిలేదు. క్లోజ్ చేసి కూడా లేదు. అది కృష్ణమూర్తి రాసిన కథ. పోస్టు చేయాలనుకుని మర్చిపోయి నట్టున్నాడు.

సుజాతకు వెంటనే ఒక చిలిపి ఆలోచన వచ్చింది. డైరెక్టరుగారికి పోవాల్సిన ఒక అర్జెంటు ఫైల్లో ఆ కవరు పెట్టి పంపించింది.

మర్నాడు కృష్ణమూర్తి వచ్చి తన కథ కోసం వెతుక్కోవడం చూసి నవ్వుకుంది సుజాత.

ఆఫీసు ఫైల్సు స్టెనో సుజాత ద్వారా డైరెక్టరుగారికి వెళ్తాయి. అందుకని ఆమెను గూడా అడిగాడు కృష్ణమూర్తి.

“మీరు కథలు రాస్తారా?” అంది సుజాత ఆశ్చర్యంగా.

“అప్పుడప్పుడూ......” అన్నాడు కృష్ణమూర్తి.

“ఫైల్స్‌లో అలాంటి కవరు వున్నట్టు లేదండీ. అయినా ఫైల్స్ బాస్ ఇంటికి వెళ్ళాయి” అంది.

కృష్ణమూర్తి మతిపోయినవాడిలా చూశాడు. డైరెక్టరుగారు చంద

ప్రచండుడు. ఆఫీసులో పనిచేస్తున్నావా? లేక కథలు వ్రాస్తూ కూర్చుంటున్నావా? అని మండిపడక మానడు అనుకున్నాడు.

కృష్ణమూర్తి అంటే ఇష్టం సుజాతకి. ఈ విధంగానైనా అతనిలో చనువు పెంచుకుని మనసు దోచుకోవాలని ఆమె ఆశ.

డైరెక్టరుగారితో కృష్ణమూర్తికి చీవాట్లు తప్పవు అనుకుంది సుజాత.

కానీ అనుకున్నది జరగలేదు ఆ రోజంతా డైరెక్టర్‌గారు కృష్ణమూర్తిని పిలవనేలేదు.

అతనికిమాత్రం గుండెల్లో రైళ్ళు పరుగెత్తసాగాయి, ఏ క్షణంలో పిలుపు వస్తుందో నని.

డైరెక్టర్‌గారినుంచి ఫైల్స్ అన్నీ వచ్చేశాయి. తను కథ వుంచిన ఫైల్ కూడా వచ్చింది కానీ అందులో కథలేదు. గమ్మత్తుగా వుందే అనుకుంది సుజాత.

ఆ సాయంత్రం ఇంటికి వెళ్ళబోతూ డైరెక్టర్‌గారు కృష్ణమూర్తిని పిలిచి "నాతోపాటు మా యింటికి రావోయ్," అన్నాడు.

కృష్ణమూర్తి ముఖం పాలిపోయింది. ముచ్చెమటలు పోశాయి. ఇంటికి తీసుకెళ్ళి తీరిగ్గా తిడతాడు కాబోలునని హడలి పోయాడు.

డైరెక్టర్‌గారు కృష్ణమూర్తిని కార్లో ఎక్కించుకుని పోవడం చూసి సుజాత సంతోషించింది, ఇంట్లో చీవాట్లు తప్పవు అనుకుంది.

మర్నాడు ఆఫీసుకు వచ్చాక ఏం జరిగిందో అడగాలనుకుంటుండగానే కృష్ణమూర్తే వచ్చి "చూశారా ! నేను అనుకున్నట్టే జరిగింది. ఫైల్స్‌లో ఆ కథ డైరెక్టరుగారికి వెళ్ళిపోయింది మీరు సరిగా చూడలేదు." అన్నాడు.

సుజాత నవ్వుకుని "అలాగా! ఇంతకీ ఆయ నేమన్నారు ?" అంది

"నా అదృష్టంలెండి. ఆ ఫైల్స్ చూస్తున్న సమయానికి వాళ్ళమ్మాయి అక్కడే వుందిట. ఆయన నా కథచూసి 'చూశావా అమ్మా ఈ కృష్ణమూర్తి ఆఫీసుపని మానేసి కథలురాస్తూ కూర్చుంటున్నాడు. ఇక పనేం చేస్తాడు, అని రిమార్కు చేశాడట. వాళ్ళమ్మాయికి కథల పిచ్చి. ఎన్ని కథలు రాసి పంపినా అవి పత్రికలవాళ్ళు అర్జంటుగా తిప్పి పంపేస్తున్నారట. ఆమె నా కథ చదివి నా పేరు చూసి నాతో మాట్లాడాలని పట్టుబట్టిందట. అందుకే డైరెక్టర్ గారు నన్ను వాళ్ళింటికి తీసుకెళ్ళారు," అన్నాడు కృష్ణమూర్తి.

సుజాత నీరుకారిపోయి "అలాగా" అంది.

తర్వాత కొన్నాళ్ళకి డైరెక్టర్‌గారి అమ్మాయి సుమతికి,కృష్ణమూర్తికి పెళ్ళి జరిగింది.

కృష్ణమూర్తి పెళ్ళికి పరోక్షంగా తను మధ్యవర్తిగా ఉపయోగపడినందుకు తనను తాను తిట్టుకుంది సుజాత.

---

గుత్తుల భాస్కరరావు

# కలిసీ కలియని మనసులు



అంతకంతకూ విష్ణుమూర్తి పరిస్థితి ఆందోళన కలిగించసాగింది. అతను ఉదయం పదింటికి మొదలెట్టిన పిచ్చి పనులు, ఉన్మాద చేష్టలు సాయంత్రం ఆరైనా మానలేదు.

గిన్నెలు విసిరాడు. చెంబులు విసిరాడు. అందర్నీ కసిరాడు. పుస్తకాలు ఎగరేసి చిందర వందర చేశాడు. బీర్వాల్లో బట్టలు కెలికి గచ్చుమీద పారేశాడు. అడ్డొచ్చినా నోరెత్తినా చెల్లెళ్ళని తమ్ముళ్ళని చితక బాదేశాడు. దెబ్బలు తిని స్వతంత్రంగా వాళ్ళని ఏడ్వనివ్వ

కుండా అరిచి నోరు నొక్కేశాడు. తలుపుని తన్ని గడ విరగ్గొట్టాడు. ఇంకుసీసా విసిరి నేలమీద చిత్రకళ సృష్టించాడు. పెన్ను మూత తీసి పాళీ వంగిపోయేలా నిలువుగా వదిలాడు. భోజనానికి పిలిస్తే "మీరే తిని చావండి" అని ఎగిరాడు. బతిమాలగా చివరికి భోజనం ముందు కూర్చొని "ఇది వంకాయ వేపుడా-వల్లకాడు వేపుడా" అని కంచం ఎత్తి గిర్వాటేశాడు. ఇంకా ఎన్నో......

'చిన్నాడా...చితకాడా... కాలేజీలో చదువుతున్నాడు కూడా" అని బుగ్గలు నొక్కుకున్నారు నైబర్లు.

విష్ణుమూర్తి తల్లిదండ్రులకి గాభరా కలిగింది. "ఇది పిచ్చిగాక మరేమిటి" అని భయపడ్డారు. రమణయ్యగారు యిక లాభం లేదనుకుని రిక్షా పిలిపించారు. యిరుగు పొరుగు సాయంతో కొడుకు రెక్కలు విరిచికట్టి రిక్షాలో పడవేశారు. "కొత్తపేట పోనియ్" అన్నాడు. పిచ్చాసుపత్రిలో డాక్టరుచేసి రిటైరయిన తెలిసినాయన ఒకాయన కొత్తపేటలో ఉంటున్నాడు. గింజుకుని గింజుకుని విష్ణుమూర్తి అలుపొచ్చి రిక్షా బాడీలో లొంగి పడుకుని చొంగ కార్చసాగాడు.

సోలిపోయిన కొడుకుని రిక్షావాడి సహాయంతో డాక్టరుముందు హాజరుపరిచారు రమణయ్యగారు

డాక్టర్-విష్ణుమూర్తి కట్లు విడిపించి కదిపి కుదిపి నిల్చోబెట్టి కూర్చోబెట్టి పడుకోబెట్టి-వంగోబెట్టి-చొక్కా విడిపించి మళ్ళా తొడిగించి-ఉన్నట్టుండి లాగి లెంప పగలేసి - యిలా రకరకాలుగా పరీక్షించి,

"దోషమేమీలేదు. ఇతను ఆరోగ్యంగా ఉన్నాడు," అని ప్రకటించాడు.

రమణయ్యగారు నిరుత్సాహపడి "అది కాదు సార్" అంటూ కొడుకు పొద్దుట్నుంచీ కదను తొక్కిన విధానం కళ్లకు కట్టినట్టు చెప్పారు.

డాక్టరు చివుక్కున కళ్ళజోడు లాగి "ఐ సీ" అన్నాడు. అటూ ఇటూ తల పంకించాడు. నోరు తెరిచి కళ్ళజోడు కాలు పళ్లమీద మీటుకుని "యితను ఎప్పట్నుంచి అలా ప్రవర్తించాడు" అని ప్రశ్నించాడు.

"ఉదయం సుమారు పదిగంటల్నుంచి"

"అపుడు ఏదో సంఘటన జరిగింది. దాని ప్రభావం యిది."

"ఏవీ జరిగినట్టు లేవండి."

"బాగా గుర్తు తెచ్చుకోండి. మీ కుర్రాడితో ఆ సమయంలో ఎవరైనా మాట్లాడారా ?"

"లేదండి పోస్టుమన్ మాత్రం వచ్చాడు "

బాలల కోసం ప్రభుత్వం ఓ సినిమా తీస్తుందట-
మంత్రులందరూ అందులో నటిస్తారు !!



"పోస్టుమన్ వచ్చాడా ? మీకు ఉత్తరాలు ఎక్కడెక్కడ్నుంచి వచ్చాయి ?"

"ఉత్తరాలేం రాలేదండి."

"ఉత్తరాల్లేకుండా పోస్టుమన్ మీ గుమ్మం ఎందుకు తొక్కినట్టు?"

"నిజమే సర్. మాకూ తట్టలేదు".

"కాబట్టి ఏవో ఉత్తరాలు వచ్చాయి. మీ వాడు చదివి దాచేశాడు."

"ఆ రకం మనిషి కాదండీ "

"లవ్ లెటర్ కావచ్చు. ఏ అమ్మాయో మీ వాడికి మొండిచెయ్యి చూపించి ఉంటుంది."

"శివశివా. ఆడశబ్దానికి వాడు ఆమడ దూరాన్నుంటాడండి."

"అలాగా.........పోనీ మీ వాడికి కథలు రాసే అలవాటుందా ?"

ఈ ప్రశ్నకి ఆ తండ్రి మొహంలో ఫ్యూజ్ కొట్టేసినపుడు పుట్టే వెలుతురు కనిపించింది. "అవునండోయ్. కథలూ అవీ గెలుకుతుంటాడు."

"పోయి చూసుకోండి మీ వాడి కథేదో తిరిగి వచ్చింది" అన్నాడు వెనక్కివాలి.

ఆ ఫళాన రమణయ్యగారు కొడుకునీ డాక్టరినీ వదిలి యింటికి పరిగెత్తి చూస్తే ఏముంది ?.........

పరుపుకింద-తిరిగొచ్చి-ఏమీ ఎరగనట్టు పడుంది-కొడుకు రచన "కలిసీ కలియని మనసులు" కాటా వేస్తే కేజీ తూగుతుంది. హామీ పత్రంకూడావుంది. "యిది నా సొంత రచన. దేనికీ కాపీ కాదు. నన్ను నమ్మండి. ఒట్టు! " అంటూ.




ఇంటర్వెల్ అయింది.

జనం బిలబిలమంటూ బయటకొచ్చారు.

ఆ జనంలో జనార్ధనం ఒకడు !

నలుగురితోపాటు థియేటర్ మూలకెళ్ళి చల్లనినీళ్లు ఓ గ్లాసెడు తాగి, సిగరెట్ కోసం 'కౌంటరు' దగ్గర నిలబడ్డాడు.

ఎదురుగా అద్దం కన్పిస్తోంది.

అందులోంచి తన ప్రతిబింబం అసలు రూపాన్ని పరిశీలించింది.

అప్పటికే అతని శరీరం – ఉత్సాహోద్రేకాలతో పొంగి ఉంది.

జీవకణాలు కొత్త శక్తితో చలిస్తున్నాయి.

కళ్ళు సరికొత్త కాంతితో మెరుస్తున్నాయ్.

బ్రూస్‌లీ !

నిజంగా మనిషా–మహాశక్తా ?!

అదంతా ట్రిక్ ఫొటోగ్రఫీ కాదు గద !

సిగిరెట్ అందుకుని వెలిగిస్తూ–అంతరంగంలో అలజడి చేస్తున్న ప్రశ్నలకి ఉక్కిరిబిక్కిరవసాగేడు. సిగిరెట్ రెండు దమ్ములు లాగి అటుయిటు పచార్లు చెయ్యసాగేడు. ఆవరణలో అతికించిన వాల్‌పోస్టర్లనీ, బ్రూస్‌లీ చిత్రాలతో ఉన్న బోర్డుల్నీ ఆపేక్షగా చూడనారంభించేడు.

తను కూడా 'కరాటే'లో ప్రావీణ్యం పొంది 'బ్రూస్‌లీ' కాగూడదా !

అబ్బ ... ఎంత వేగం ! ఏమి చాకచక్యం...!

ఎంత మనోనిశ్చలత ! ఏమి సాహసం !

మనసులోనే చేతులు జోడించాడు జనార్దనం.

సినిమా పునఃప్రారంభం కాబోతున్న సూచనగా 'బెల్' మోగింది.

జనం ఆదరాబాదరా లోపలికి పరుగెడుతున్నారు.

జనార్దనం కూడా సిగిరెట్ సాంతం తాగకుండానే దూరంగా పారేసి థియేటర్లోకి వెళ్ళాడు.

సినిమాలో అతను పూర్తిగా నిమగ్నమై పోయాడు.

'స్టంట్ సీన్' వచ్చినప్పుడల్లా ఉద్రేకంతో ఊగిపోతున్నాడు.

అప్రయత్నంగా గుప్పిళ్లు బిగుసుకుంటున్నాయ్.

విద్యుత్‌లాంటి చైతన్యం ఏదో శరీరంలో ప్రవేశించి తాండవమాడుతున్నట్లు ఫీలయ్యాడు.

సినిమా పూర్తయ్యేవరకు అతనీ పరిస్థితిలోనే మునిగి తేలాడు.

థియేటర్‌లోంచి బయటికొచ్చాక బ్రూస్‌లీ శక్తులన్నీ అతనిలోకి పరకాయ ప్రవేశం చేసినట్లనుభూతి చెందసాగేడు

రోడ్డుమీద ఛాతీ విరుచుకుని నడవటం ప్రారంభించేడు.

కండలు పొంగి గట్టిపడినట్లనిపిస్తోంది !

అరచేతులు కత్తుల్లాగ పెట్టి అడుగులు వేస్తున్నాడు జనార్దనం.

నడుస్తూనే ఉన్నాడు. ఇప్పుడెవ రొచ్చినా చిత్తుగా తన్నెయ్యగలడు !

ట్రాఫిక్‌లోంచి, హోటళ్లు, దుకాణాల పక్కనుంచీ ఇంటివైపు వేగంగా

నడుస్తున్నాడు

నడుస్తూనే టైము చూసుకున్నాడు

తొమ్మిదింబావు కాబోతోంది

వేగం మరికాస్త పెంచాడు

ఇంటిదగ్గర అర్ధాంగి ఆలస్యానికి ఆగ్రహించగల 'ప్రివిలెజ్'తో ఎదురు చూస్తుంటుంది.

'ఐ లీస్ట్ కేర్,' అనుకున్నాడు.

ఆలస్యం కాకుండా టైముకి ఇంటి దగ్గ రుండటానికి తనేమైనా బడి పిల్లాడా ?

తనిష్టం,

ఎక్కడెక్కడో తిరుగుతాడు. అలా తిరుగుతున్నందుకు చెవి 'కీ'లు, తాడపాశాలు ఆర్జించుకునే రోజులు దాటిపోయ్యాయి.

ఇప్పుడు తను బాధ్యతగల తండ్రి !

ఒకరిచేత చెప్పించుకోవాల్సిన అవసరం లేనేలేదు.

"మాస్టారూ ! టైమెంతయింది ?" ఎవరో బాటసారి ప్రశ్న.

జనార్దనం ఆలోచనలు తెగిపోయాయి.

"తొమ్మిదిన్నర" అని జవాబిచ్చి మళ్ళీ తన ఆలోచనల్లోకి మళ్ళాడు.

అతని మనసుళ్ళోకి పదే పదే సినిమాలో దృశ్యాలే ప్రవేశిస్తున్నాయి.

మళ్ళీ సినిమా చూస్తున్న అనుభూతికి లోనయ్యాడు.

అతను ఆ అనుభూతిలోని ఆనందం అనుభవిస్తుండగానే ఇల్లు వచ్చేసింది

"రాజ్యం రాజ్యం " తలుపు కొట్టాడు

"వచ్చే "అడుగులుదగ్గరవుతున్న శబ్దం.

తలుపులు తెరుచుకున్నాయి.

దారి కడ్డం తొలిగి జనార్దనం లోపలికి రాగానే తలుపు వేసింది. జనార్దనం నేరుగా ఇంట్లోకి వెళ్ళాడు. భార్యనుండి ప్రశ్న లేమీ విననందుకు ఆనందించాడు.

పిల్లలు మధ్య గదిలో ఆదమరిచి నిద్రపోతున్నారు

కాళ్ళు, చేతులు కడుక్కొని బట్టలు మార్చుకొచ్చాడు, జనార్దనం.

భార్య భోజనానికి పిలుస్తుందేమోనని నిరీక్షించాడు. ఆ సూచనలేం లేవు !

ఎదురుగా తేదీల క్యాలెండరు ముప్పై ఒకటి చూపిస్తోంది.

'రేపు జీతాలు కాబోలు,' అనుకున్నాడు.

అంతలో రాజ్యం చిన్న గిన్నెలో 'స్పూన్' వేసి తీసుకొచ్చింది.

"ఏమిటిది ? పరమాన్నమా ?"

"కాదు—మజ్జిగన్నం !"

అతను నివ్వెరపోయేడు

"అదేమిటి ?" అనా డు అటుపైన మాటలు రాక.




"ఈ రోజు మధ్యాహ్నం వరకే వెచ్చాలు సరిపోయ్యాయి. రాత్రి కేమీ లేకపోతే మధ్యాహ్నం మిగిలిన దాంట్లోనే పిల్లలకి సర్దిపెట్టాను. ఈ మజ్జిగలో కొద్దిగా అన్నంవేసి మీకోసం ఉంచాను..."

జనార్దనంలో అంతవరకు కాపురం చేసిన మహాయోధుడు "బ్రూస్‌లీ" పలాయన మంత్రం పఠించాడు !

అతని శరీరంలోని పొంగులన్నీ చల్లారి మామూలు మనిషయ్యాడు.

రాజ్యంకేసి చూస్తున్నాడు.

ఆమె మొహంలో తనపట్లగల అనురాగాన్ని కొలుస్తూ తన్మయత్వం చెందుతున్నాడు.

"రాజ్యం ! మధ్యాహ్నంనుంచీ నువ్వేమీ తిన్లేదు కదూ? నిజం చెప్పు..."

"ఇప్పుడా ప్రశ్నలన్నీ ఎందుకండీ... పొద్దుపోయింది. యీ మజ్జిగరసం పుచ్చఆని పడుకోండి. మళ్ళీ తెల్లవారితే కుఫీసు హడావిడీ."

నవ్వేడు జనార్దనం.

"రాజ్యం ! ఎంతటి మహాయోధుడైనా దారిద్ర్యం ముందు దాసోహ మనాల్సిందేనని యిప్పుడే తెల్సుకున్నాను. దాన్ని మించిన నిజం మరోటి ఏమిటో తెలుసా ? సృష్టిలో ప్రేమని మించిన శక్తిలేదు ... రా ... యిద్దరం కలిసే ఈ మజ్జిగన్నం తిందాం... బలవంతాన సమీపానికి జేర్చుకున్నాడు భార్యని.




గాంధీపార్కు ఆ రోజు జనంతో కిటకిట లాడుతున్నది.

మామిడి చెట్ల క్రింద యువకులు గుంపులు గుంపులుగా చేరి నిరీక్షిస్తూ వున్నారు. శనగప్పు, బఠానీలు అమ్మే కుర్రాళ్ళు హడావుడిగా బేరసారాలు సాగిస్తున్నారు. నాలుగయిదు వూర కుక్కలుసందడిగా అటు ఇటు తిరుగుతూ వున్నాయి. బాగా ఎండ ఎక్కింది.

'నేషనల్ సర్వీస్'లో యువకుల్ని చేర్చుకోవటానికి ఆ రోజు సెలక్షన్ జరుగుతుంది. అఖిలభారతస్థాయి 'సెలక్టు కమిటీ' అధ్యక్షుడయిన డోంగ్రేగారు రావాలి. ఆయన హైదరాబాదునించి ఏక్షణాన్నయినా రావాలి. ఆయనకోసమే ప్రాంతీయ కమిటీ మెంబర్లు 'కాన్ఫరెన్సు హాలు' లో కూర్చుని నిరీక్షిస్తూ వున్నారు. ఆయన ఏక్షణంలోనయినా

వచ్చి ఈ సెంటర్లో పని ముగించుకుని రేపటికల్లా వైజాగు సెంటరుకి వెళ్ళిపోతారు అనుకుంటున్నారు.

అందువలన అందరూ ఆయనకోసం ఎదురు తెన్నులు చూస్తూ వున్నారు.

ఇంకా ఆయన రాలేదు మరి!

ఆ అందరికీ కాస్త ఎడ్డంగా కూర్చుని తనూ నిరీక్షిస్తున్నాడు సుబ్బారావు. సుబ్బారావు ఐదుసంవత్సరాల క్రితమే బి.ఏ. పాసయ్యాడు. సుబ్బారావుకి పర్సనాల్టీ లేదు. అందగాడు కాదు, మాటకారీకాదు. సుబ్బారావుది పెద్దకుటుంబం. అతను అందర్లోకి చిన్నవాడు. అతని అన్నలందరూ పెళ్ళిళ్ళు చేసుకుని వుద్యోగాల్లో వున్నారు. సుబ్బారావు బి.ఏ. అయేటప్పటికి అతని తండ్రి రిటయిరయి చితికిపోయాడు. పెరిగిన ధరలకు, వచ్చే పెన్షను రాళ్ళు, సరిపోక తిండి గడవటమే భారంగా అయింది. అందువలన నిరుద్యోగిగా తిరుగుతున్న సుబ్బారావుని అతని తండ్రి— బాధతోనే అయినా — తూష్ణీకరించి మాట్లాడటం సాగించాడు. తల్లి దిగులుపెట్టుకుంది. సుబ్బారావుకి వుద్యోగం గగనకుసుమమే అయింది.

'నేషనల్ సర్వీస్' కేవలం సేవాభావంతో మొదలయిన సంస్థ. రోడ్లు వెయ్యటం, మురికివాడలని తొలగించటం నిరక్షరాస్యతా నిర్మూలన, వ్యాధిగ్రస్తుల సేవ వంటి కొన్ని ముఖ్యమయిన వృత్తికళ్ళాలని కలిగినది. ధర్మనిరతిని గలిగిన ఐశ్వర్యవంతుల విరాళాల వలన కార్యక్రమాన్ని నడుపుతూ, కార్యకర్తలను మెయింటెయిన్ చేస్తూ స్వల్పంగా మాత్రమే ప్రతిఫలం ముట్టచెప్తుందని అక్కడ చేరిన అందరితోబాటు సుబ్బారావుకి తెలుసును. ప్రళయ రాక్షసిలాగ విజృంభించిన నిరుద్యోగ సమస్యకి బలిఅయి, ఆత్మగౌరవంతో పాటు అస్తిత్వాన్నికూడా కోల్పోయే విపరీత పరిస్థితి నుంచి తప్పించుకోవాలన్న సంకల్పంతోనే అక్కడికి వచ్చిన ప్రదేశంలోని యువజనం ఆత్రుతగా ఎదురుచూస్తున్నారు.

అంతలోనే కలకలం చెలరేగింది. జనంలో ఆత్రుత పెరిగింది.

ఒక కారువచ్చి కాన్ఫరెన్సు హాలు ముందు ఆగింది. నలుగురు పెద్దలు దిగి లోపలికి వెళ్ళారు. ఇంటర్వ్యూ మొదలయిందనుకుంటున్నారు యువకులు కంగారుపడ్తూ.

సరిగ్గా అప్పుడే—

ఒక బవిరిగడ్డంవాడు, బక్కచిక్కినవాడు, లోతుకనులవాడు, ఎముకల పోగువంటి ఒకభిక్షకుడు అడుక్కుంటూ కళ్ళుతిరిగి పడిపోయాడు. ఆ యువకులందరిమధ్యా.

సుబ్బారావు అది చూసి అతనివద్దకు పరుగెత్తుకుని వెళ్లాడు. అతన్ని లేపి కూర్చోబెట్టాడు. ఆ ప్రక్కనేవున్న

పైపుదగ్గర్నుంచి నీళ్లుతెచ్చి మొహాన్న చల్లాడు. కాసినినీళ్ళు తాగించి తనజేబులో వున్న ఒక రొట్టెముక్కని తినిపించాడు, అతనిచేత.

మిగతా యువజనం అంతా ఎవరి గొడవలో వారున్నారు. ఆ దృశ్యాన్ని అంతా చూసినా ఎవరికీ పట్టించుకునే ఓపికలేకపోయింది. డోంగ్రేగారు వచ్చారంట. ఇంటర్వ్యూలు మొదలయాయి! సెలక్టవాలి! ప్రతి యువకుడూ ఇదే ఆదుర్దాలో మునిగిపోయాడు.

కాసేపటికి కళ్ళుతెరిచి, ఆ ముసలాడు సుబ్బారావుని తేరిపార చూసాడు. కృతజ్ఞతగా నవ్వాడు. నవ్వి—

ఆప్యాయంగా 'వాట్ ఈజ్ యువర్ నేమ్?' అని అడిగాడు. సుబ్బారావు కొంచెం ఆశ్చర్యపడి తన పేరు చెప్పాడు. సంభాషణ అంతా ఇంగ్లీషులోనే నడిచింది. ఆ ముసలాడు సుబ్బారావుకి థాంక్స్ చెప్పి, అక్కడ వాళ్ళంతా ఎందుకు జమయింది వివరాలన్నీ తెలుసుకున్నాడు. అతనూ నిరుద్యోగే నట! ఇరవయి సంవత్సరాల్నుంచి ప్రయత్నించి ఉద్యోగం దొరక్క ఇలాగ అడుక్కుతిని బ్రతుకుతున్నాడట. అంతా చెప్పి—

'థాంక్స్ బ్రదర్. పోతున్న ప్రాణం నిలబెట్టావు. కాని ఈ ముసలిశరీరం రాత్రిళ్లు చలికి తట్టుకోలేకపోతూంది' అంటూ నిట్టూర్చాడు. సుబ్బారావు జాలిపడి తన పైమీది కండువా అతని కిచ్చాడు.

అది పుచ్చుకుని, 'వెరీ మెనీ థాంక్స్ తప్పకుండా ఇంటర్వ్యూకి వెళ్ళు, నీకు జయమవుతుంది.' అని ఆశీర్వదించి వెళ్ళిపోయాడు ముసలాడు. ఆ సంగతి అప్పుడే మర్చిపోయాడు సుబ్బారావు.

సుబ్బారావుకి ఇంటర్వ్యూ అయే సరికి రాత్రి ఏడుగంటలయింది. అతను లాస్టు కాండిడేట్! ఆ రాత్రే—పదకొండు గంటలకి బయల్దేరుతున్న 'ఈస్టుకోస్టు'లో డోంగ్రేగారి ప్రక్కనే కూర్చునివున్నాడు సుబ్బారావు, వైజాగు వెళ్తూ. డోంగ్రేగారి భుజాలచుట్టూ, సుబ్బారావు కప్పిన 'పైకండువా' వ్రేలాడ్తూవుంది. ఆ సెంటర్నించి నేషనల్ సర్వీస్‌కి సెలక్టయింది సుబ్బారావు ఒక్కడే!






# దరిద్రుడిందానిస-2

ఒకరోజు ఉదయం అలీ షార్ ఇంటి నుంచి, జుముర్రుద్ తయారుచేసిన తివాసీ తీసుకుని బయలుదేరాడు. అతను దుకాణాల బజారుకు వెళ్ళి, దాన్ని అమ్మే ఉద్దేశంతో దళారికి ఇచ్చాడు. దళారి దుకాణాలముందు అది అమ్మకానికున్నట్టు కేకలు పెడుతూండగా ఒక క్రైస్తవుడు అటుగా వచ్చాడు. అలాటివాళ్ళు చాలామంది దుకాణాలముందు మూగి, అమ్మే వాళ్ళకూ, కొనేవాళ్ళకూ సహాయం చేయ జూస్తుంటారు

ఈ క్రైస్తవుడు అలీ షార్‌నూ, దళారినీ సమీపించి, ఆ తివాసీని అరవై దీనార్లకు కొంటానన్నాడు. కాని అలీ షార్‌కు క్రైస్తవులంటే అప నమ్మకం అదీగాక, జుమ్రుద్ సలహా కూడా జ్ఞాపకం వచ్చింది. అందుచేత అతను తివాసీని క్రైస్తవుడికి అమ్మ ననేశాడు. ఆ మీదట క్రైస్తవుడు నూరు దీనారాలిస్తానన్నాడు. అంత మంచి అవకాశం పోగొట్టుకోవద్దని దళారి అతని చెవిలో ఊదాడు. ఇలా సలహా ఇయ్యమని దళారికి క్రైస్తవుడు అదివరకే పది దీనారాలు లంచం పెట్టి ఉన్నాడు. దళారి ఎంత నమ్మబలికాడంటే, అలీ షార్ చిట్టచివరకు నూరు దీనారాలకు తివాసీని అమ్మటానికి ఒప్పుకున్నాడు. అతను జంకుతూనే డబ్బు పుచ్చుకుని వచ్చేశాడు.

ఇంటికి వచ్చే దారిలో అతను చుట్టూ కలయజూసి, క్రైస్తవుడు తనని అనుసరించి వస్తూండటం గమనించాడు. అతను ఆగి, "క్రైస్తవుడా, మీ వాళ్ళు ఎవరూ లేని ఈ పేటలో నీకేం పని ?" అని అడిగాడు.

"క్షమించండి, బాబూ. నాకు ఈ వీధి చివర కొంచెం పని ఉన్నది. అల్లా తమకు మేలు చేయాలి !" అన్నాడు క్రైస్తవుడు.

అలీ షార్ ముందుకు సాగాడు. అతను తన నివాసంముందు వచ్చి నిలబడే సమయానికి, పక్కసందులో నుంచి క్రైస్తవుడు తనకేసి వస్తూండటం కనపడింది.

"ఎందుకిలా నా వెంటపడ్డావు, క్రైస్తవ పిశాచమా ?" అని అలీ షార్ కోపంగా అరిచాడు.

"క్షమించండి, బాబూ. నేనిక్కడికి కావాలని రాలేదు. దాహంగా ఉన్నది, కాసిని మంచినీళ్ళిప్పించండి. అల్లా మీకు మేలు చేస్తాడు," అన్నాడు క్రైస్తవుడు.

పిచ్చికుక్కకైనా నిజమైన ముసల్మాను తాగటానికి నీరు నిరాకరించడనుకుని అలీ షార్, ఇంట్లోకి వెళ్ళి, నీటిపాత్ర తీసుకుని, క్రైస్తవుడివద్దకు పోబోతూండగా జుమ్రుద్ తలుపు తెరిచిన చప్పుడు విని అతనివద్దకు వచ్చి, అతన్ని ముద్దుపెట్టుకుంటూ, "ఇవాళ ఇంత ఆలస్యమయిందేం?" అని అడిగింది. ఆమె తివాసీ అమ్ముడయిందా అనీ, దాన్ని కొన్నవాడు పరువుగల వర్తకుడా, కొత్తవాడా అనీ అడిగితే అలీ షార్ దుకాణాలవద్ద రద్దీ జాస్తిగా ఉన్నందున ఆలస్యమయిందనీ, ఘరానా వర్తకుడే దాన్ని కొన్నాడనీ చెప్పాడు.

జుమ్రుద్ మనసులో ఏదో ఆందోళన కలిగింది. ఆమె అతని చేతిలో ఉన్న నీటిపాత్ర చూసి, అదేమిటని అడిగింది.

"నాతో వచ్చిన దళారికి దాహంగా

ఉందట," అన్నాడతను. కాని ఈ మాటకూడా ఆమె మనసుకు శాంతి చేకూర్చలేదు.

అలీ షార్ క్రైస్తవుడివద్దకు తిరిగి వచ్చేసరికి, అతను వీధిలోనుంచి లోపలి పంచలోకి వచ్చాడు. అలీ షార్ కళ్ళు చీకటి అయిపోయాయి, "గాడిదా, నా అనుమతి లేకుండా లోపలికి ఏమని ప్రవేశించావు ?" అన్నాడు.

"క్షమించు, బాబూ. నిలవటానికి కాళ్ళలో సత్తువలేక లోపలికి వచ్చాను. తల వాకిలి వెలపలకూ, లోపలకూ పెద్ద తేడా ఏముంది ? కాస్త శ్వాస పీల్చుకుని వెళ్ళిపోతాను. నన్ను గెంటకుండా ఉంటే, అల్లా నిన్నూ గెంటడు," అని క్రైస్తవుడు అలీ షార్ చేతినుంచి నీటి పాత్ర తీసుకుని, తనకు కావలసినంత నీరు తాగి, పాత్రను తిరిగి ఇచ్చేశాడు. అతను వెళ్ళిపోవటంకోసం ఎదురు చూస్తూ అలీ షార్ అక్కడే నిలబడ్డాడు, కాని ఎంతసేపటికీ క్రైస్తవుడు వెళ్ళిపోయే ప్రయత్నం చెయ్యలేదు. అలీ షార్ కోపోద్రేకంతో, "ఇకనైనా పోతావా ?" అన్నాడు.

"బాబూ, తమరికి ఉపకారబుద్ధి ఉన్నట్టులేదు. మరొకడికి మంచిచేసి ఆనందించే బాపతులాగా తమరు కనపడరు. తమ చూరుకింద నీరు తాగి దాహమైతే తీర్చుకున్నాను గాని, ఆకలి దహించుకుపోతున్నది. తమరు తినగా మిగిలినది ఒక రొట్టె తుంపు కానియ్యండి, ఉల్లిగడ్డ కానియ్యండి ఇస్తే సంతోషంగా ఆరగిస్తాను," అన్నాడు.

"మాట్లాడకు ! పో అవతలికి ! ఇంట్లో ఏమీ లేదు," అని అలీ షార్ మరింత ఆగ్రహంతో అరిచాడు.

"ఇంట్లో ఏమీ లేకపోతే, మీ జేబులో నే నిచ్చిన నూరు దీనార్లు ఉన్నాయి గద. దగ్గర ఉన్న దుకాణంలో ఒక చిన్న జున్నురొట్టె అయినా తెచ్చి పెట్టండి. మీ ఉప్పు తినకుండా మీ ఇంటినుంచి వెళ్ళిపోవటం నా కిష్టం లేదు," అన్నాడు క్రైస్తవుడు కదలకుండా.

"ఈ క్రైస్తవుడికి పూర్తిగా మతి పోయింది ! వీణ్ణి వీధిలోకి గెంటి, ఊరకుక్కల్ని ఉసిగొల్పుతాను," అనుకున్నాడు అలీ షార్.

అతను అంతపనీ చెయ్యటానికి క్రైస్తవుణ్ణి పట్టుకోబోతూంటే, వాడు, "నా ఆకలి బాధ తీర్చుకోవటానికి నేను అడిగిందల్లా ఇంత రొట్టెముక్కా, ఉల్లిగడ్డానూ. పెద్ద ఖర్చుతో కూడిన దేమీ కాదు," అన్నాడు.

అతని కోరిక తీర్చక తప్పదని అలీ షార్‌కు తోచింది. అతను క్రైస్తవుణ్ణి అక్కడినుంచి కదలవద్దని చెప్పి, తలుపుకు తాళంపెట్టి, తాళంచెవి జేబులో వేసుకుని, ఇంటినుంచి బయలుదేరాడు.

అతను దుకాణాలలో తేనెలో వేసిన జున్నూ, దోసకాయలూ, అరటి పళ్ళూ, వేడి వేడి రొట్టే కొనితెచ్చి క్రైస్తవుడి కిచ్చి, "తిను!" అన్నాడు.

"ఎంత ఔదార్యం, స్వామీ! పది మందికి సరిపడా తెచ్చారు. నాతోబాటు తమరు కూడా తిని, నన్ను అనుగ్రహించండి," అన్నాడు క్రైస్తవుడు.

"నాకు ఆకలి లేదు. నువు ఒక్కడివే తిను," అన్నాడు అలీ షార్.

"అతిథితోబాటు తిననివాడు హీన జన్ముడని చెబుతారు."

క్రైస్తవుడు ఇంతమాట అన్నమీదట అలీ షార్ అభ్యంతరం చెప్పటం మానేసి, అతని సరసనే కూర్చుని, తాను కూడా పరధ్యానంగా తిన సాగాడు. అతని పరధ్యానం ఆసరా చేసుకుని క్రైస్తవుడు ఒక అరటిపండు ఒలిచి, దాన్ని రెండుగా విరిచి, మధ్యలో నల్లమందు చేర్చిన గంజాయి పెట్టి, దాన్ని తేనెలో ముంచి అలీ షార్‌కు ఇస్తూ, దాన్ని స్వీకరించ మన్నాడు. అలీ షార్ పేచీలోకి దిగటం ఇష్టంలేక, దాన్ని తినేశాడు. అది కడుపులోకి చేరిన మరుక్షణం అలీ షార్ స్పృహ కోల్పోయి, వెనక్కు విరుచుకు పడిపోయాడు.

క్రైస్తవుడు చంగున లేచి, వీధిలోకి వెళ్ళాడు. అక్కడ కొందరు వ్యక్తులు, ఒక కంచరగాడిదతోసహా, రహస్యంగా వేచి ఉన్నారు. కంచరగాడిద పక్కన కునిష్టి ముసలాడు—జుముర్రుద్ నిరాకరించిన రషీద్ అల్ దీన్ – ఉన్నాడు. నిజానికి వాడు క్రైస్తవుడే; కాని ఇతర వర్తకులతో సమమైన హోదా ఉండగలందుకు ముస్లింలాగా నటిస్తున్నాడు. అలీ షార్‌కు ఇంతకుముందే మత్తుమందు పెట్టినవాడు వాడి తమ్ముడు. వీడి పేరు బర్సూమ్.

బర్సూమ్ తన అన్నతో తమ ఎత్తు పారినట్టు చెప్పాడు. క్రైస్తవు లిద్దరూ తమ మనుషులతోసహా అలీ షార్ ఇంట్లో ప్రవేశించి, జుముర్రుద్ ఉండే గదిలోకి జొరబడి, క్షణంలో ఆమె నోటికి గంత కట్టి, ఆమెను కంచరగాడిదమీద అడ్డంగా పడేసి, కొద్దినిమిషాలలో ముసలి రషీద్ ఇల్లు చేరారు.

ముసలాడు ఆమెను చాలా లోపలగా ఉన్న గదిలోకి తీసుకుపోయి, "అందాల జుముర్రుద్, ఇప్పుడు నువు నా చేతిలో చిక్కావు. నేను నిన్ను నా బాహు బంధంలో సుఖపెట్టేముందు నువు నీ మతం మార్చుకుని, నాలాగే క్రైస్తవం పుచ్చుకోవాలి. ఈ నా రెండు కోర్కె లకూ సమ్మతించకపోయావో నీ పాట్లు కుక్కలు కూడా పడవు," అన్నాడు.

ఆమె కళ్ళలో కన్నీరు ఉబికి, చెక్కిళ్ళమీదుగా జారింది. వణుకుతున్న పెదవులతో ఆమె, "రాక్షసుడా నువు నన్ను ముక్కలు ముక్కలుగా కోసినా




సరే, నేను నా మతం వదులుకోను. నువు బలాత్కారంగా నా శరీరాన్ని అనుభవించినా, నా ఆత్మ నీ పాపంలో పాలు పంచుకోదు. నీ దౌష్ట్యానికి ఏమి ప్రతిక్రియ చెయ్యాలో అల్లాకు తెలుసు!" అన్నది.

ముసలాడు తన బానిసలతో, ఆమెను బోర్లా పడుకోబెట్టమని, కొరడాతో దారుణంగా, వాతలు పడేటట్టు కొట్టాడు. చేతులు నొప్పి పుట్టేదాకా కొట్టి, ముసలాడు తన బానిసలతో ఆమెను వంట యింట్లో మిగిలిన బానిసలతో చేర్చమనీ, తిండీ, నీరూ ఇయ్యవద్దనీ చెప్పాడు.

* * *

అలీ షార్ మర్నాటిదాకా వసారాలోనే పడి ఉండి, ~లమందూ, గంజాయీ ప్రభావం తగ్గినాక లేచి కూర్చుని, "జుమ్రురుద్ !" అని పిలిచాడు. జవాబు లేదు. అతను లేచి నిలబడి, లోపలి గదిలోకి వెళ్ళాడు. గది నిశ్శబ్దంగా ఉన్నది. జుమ్రురుద్ బట్టలు చెల్లాచెదురుగా పడి ఉన్నాయి. ఈ దృశ్యం చూడగానే అతనికి క్రైస్తవుడు గుర్తు కొచ్చాడు. జుమ్రురుద్‌ను ఎత్తుకుపోయారని గ్రహించి, నేలమీద పడి పొర్లుతూ, నెత్తి బాదుకుంటూ, జుట్టూ, తన దుస్తులూ పీక్కుంటూ ఏడ్చాడు. దుఃఖావేశం మరీ ఎక్కువై, అతను వీధిలోకి పరిగెత్తి, రెండు రాళ్ల తీసుకుని రొమ్ములమీద కొట్టుకుంటూ, "జుమ్రురుద్ ! ఓ జుమ్రురుద్ !" అని కేకలు పెట్టసాగాడు.

త్వరలోనే కుర్రవాళ్ళ గుంపు ఒకటి

అతని వెంటపడి, "పిచ్చాడు ? పిచ్చాడు !" అని అరిచారు. అతన్ని ఎరిగినవాళ్ళు మాత్రం అతనికి పిచ్చి పట్టినందుకు విచారించి, "అతను పాపం, అలీ షార్ !" అన్నారు.

అతను ఈ విధంగా రాళ్ళతో రొమ్ము బాదుకుంటూ, అరుస్తూ తిరుగుతూండగా ఒక ముసలిది తగిలి, "నాయనా, నీకు ఎప్పటినుంచీ ఈ పిచ్చి ?" అని అడిగింది.

"నాది ప్రేమ పిచ్చి
వైద్యుడా, నన్ను ప్రశ్నించకు
గుచ్చి గుచ్చి
ఆమెను నాకు తిరిగి ఇచ్చి
అందుకో నా కృతజ్ఞతలు,
నిన్నుమెచ్చి" అని అతను పాడాడు.

ముసలిది అతనిది విరహోన్మాదమని గ్రహించి, "బాబూ, నీకు వచ్చిన కష్టమేమిటో నాకు దాచకుండా చెప్పు. నీకు సహాయపడగలందులకే అల్లా మనని తారసిల్ల జేశాడేమో," అన్నది.

అలీ షార్ ఆమెతో క్రైస్తవుడు బర్సూమ్ ఉదంతమంతా చెప్పాడు. ఆమె చాలాసేపు దీర్ఘంగా ఆలోచించి, చివరకు తల ఎత్తి, "నువు త్వరగా వెళ్ళి, వీధి వర్తకుల గంప కొనుక్కురా; తరవాత బజారుకు వెళ్ళి, దాని నిండా రంగురంగుల గాజులూ, వెండిపూత పూసిన రాగి ఉంగరాలూ, లోలక్కులలాటి ఆభరణాలూ కొనిపెట్టి తీసుకురా. నేను దాన్ని నెత్తిన పెట్టుకుని, అవసరమైన వార్త తెలిసేదాకా ఇల్లిల్లూ తిరుగుతాను. అల్లా అనుగ్రహం ఉంటే జుముర్రుద్‌ను తీసుకొస్తాను," అన్నది.

అలీ షార్ ఆనందాశ్రువులు రాల్చి, ముసలిదాని చేతులు ముద్దుపెట్టుకుని, ఆమె కోరిన వస్తువులు కొనుక్కురావటానికి వెళ్ళాడు. అతను తిరిగివచ్చే లోపున ముసలిది తన ఇంటికి వెళ్ళి, తాను తలపెట్టిన పనికి అనుగుణంగా దుస్తులు వేసుకుని, ముఖాన్ని తేనెరంగు మేలి ముసుగుతో కప్పుకుని, నెత్తిమీద కాశ్మీరు శాలువ వేసుకుని, ఒళ్ళంతా నల్లని బురఖా దిగవేసుకున్నది. తరవాత ఆమె అలీ షార్ తెచ్చిన తట్ట నెత్తిన పెట్టుకుని, చేతికర్ర పట్టుకుని, ఓపికగా ధనికుల జనానాల చుట్టూ తిరగసాగింది. ఇలా తిరుగుతూ, తిరుగుతూ ఆమె రషీద్ అల్ దీన్ ఇంటికి వచ్చింది.

ఆ సమయానికి జుముర్రుద్ వంటింట బానిసల మధ్య చేరి, ఒక చాప మీద పడుకుని, కొరడా దెబ్బల బాధతో మూలుగుతున్నది.

ముసలిది తలుపు తట్టేసరికి, ఒక బానిస తలుపు తీసింది. ముసలిది ఆమెతో, "పిల్లా, నా దగ్గిర అమ్మకానికి చాలా అందమైన సరుకులు చాలా ఉన్నాయి. లోపల కొనేవాళ్ళెవరన్నా ఉన్నారా ?" అని అన్నది.

"ఉండొచ్చు," అంటూ బానిస

ముసలిదాన్ని వంటింట్లోకి తీసుకు వచ్చింది. బానిసలందరూ ఆమె చుట్టూ మూసిరారు. ఆమె వస్తువుల ఖరీదు గురించి పట్టుదల ఏమీలేకుండా గాజులూ, ఉంగరాలూ, లోలకులూ, ఇతర నగలూ కారుచౌకగా అమ్మి, అందరినీ ఆకట్టుకున్నది. ఆమె చుట్టూ కలియజూసి, చాపమీద పడుకుని ఉన్న జుమ్ముర్రుద్‌ను గమనించి, ఆమె విషయం బానిసలకు తెలిసినంతవరకు రాబట్టింది. తాను అన్వేషిస్తున్న మనిషి ఇదేనని ముసలిదానికి తోచింది. ఆమె జుమ్ముర్రుద్‌ను సమీపించి, "బిడ్డా, అల్లా నిన్ను కాపాడుగాక. నిన్ను రక్షించటానికి ఆయనే నన్ను పంపాడు. నువు అలీ షార్ ప్రేమించిన బానిసవు. జుమ్ముర్రుద్‌వు," అన్నది.

తరవాత ముసలిది తాను వచ్చిన పని చెప్పి, "రేపు సాయంకాలం విముక్తి పొందటానికి సిద్ధంగా ఉండు. వంటింటి కిటికీవద్ద నిలబడి వీధిలోకి చూస్తూ ఉండు. నీడల్లో పొంచి ఉన్న వ్యక్తి ఈలవెయ్యగానే, సమాధానంగా నువు కూడా ఈలవేసి, నిర్భయంగా కిటికీలోకి ఎక్కి బయటికి వచ్చెయ్యి. అలీ షార్ స్వయంగా అక్కడ ఉంటాడు," అన్నది.

జుమ్ముర్రుద్ ముసలిదాని చేతులు ముద్దుపెట్టుకున్నది. ముసలిది వేగంగా అలీ షార్ వద్దకువెళ్ళి అంతా చెప్పి, రేపు సాయంకాలం కిటికీకింద వేచి ఉండు," అన్నది.

అలీ షార్ ఆమెకు ధన్యవాదాలు చెప్పి, బహుమానం ఇయ్యబోతే ఆమె తీసుకోక, తన దారిన తాను వెళ్ళి పోయింది.

మర్నాడు సాయంకాలం అలీ షార్ ముసలిది వర్ణించి చెప్పిన ఇంటికి వెళ్ళి, గోడ నీడలో కిటికీకింద కూర్చుని, సమయంకోసం ఎదురుచూడసాగాడు. అయితే రెండురోజులుగా నిద్రలేక పోవటంచేత అతనికి నిద్ర ముంచు కొచ్చింది.

ఆ రాత్రి దైవికంగా, ఒక గజ దొంగ ఆ ఇంట దొంగతనం చేసే సంకల్పంతో ఇల్లు పరిశీలించటానికి వచ్చాడు. అతను ఇంటిముందు తారాడు తూండగా అలీ షార్ నిద్రపోతూ కనిపించాడు దొంగ అతని మేలైన దుస్తులు చూసి తలపాగా, పై బట్టా కాజేశాడు. ఆ దొంగ వాటిని తాను ధరించిన మరుక్షణమే కిటికీ రెక్కలు తెరుచుకుని, ఈల వినపడింది. దొంగ తల ఎత్తి చూసేసరికి తనను రమ్మని సైగచేస్తూ ఒక స్త్రీ కనబడింది. దాని అంతరార్థం ఏమిటో తెలుసుకోకుండానే దొంగ తాను కూడా ఈలవేశాడు.

మరుక్షణం జుమ్ముర్రుద్ కిటికీ ఎక్కి వీధిలోకి దిగింది. బలశాలి అయిన దొంగ ఆమెను తన వీపుమీదికి దింపు కుని, వాయువేగంతో పారిపోయాడు.

(ఇంకా వుంది)

———




వైశాఖమాసం ఎండ చండ్ర నిప్పులు చెరుగుతున్నది. పగలు పదిగంటలు దాటితే బయటకు రావటానికి జంకు తున్నారు జనం.

ఇంట్లో అందరం భోజనాలు చేస్తుం డగా ఒగరుస్తూ సుడిగాలిలా వచ్చిన శాంతి నన్ను చూసి,

"ఎప్పు డొచ్చావేవ్ ? కులాసాగా ఉన్నావా ? మీ ఆయనకు ప్రమోషన్ వచ్చిందటగా ? నీ కూతురికి పెళ్ళె ప్పుడు చేస్తావ్ ? ఆ ! ... అన్నట్లు ఎన్నాళ్ళుంటా విక్కడ ? నాకూ పెళ్ళి కుదిరేలా ఉందేవ్, నువ్వు తప్పకుండా ఉండాలి సుమా ! లేకపోతే ఊరు కోను," అంటూ ప్రశ్నలవర్షం కురి పించి, నా సమాధానాలకు ఎదురు చూడకుండా, వచ్చినంత తొందరగానూ వెళ్ళిపోయింది.

"ఆ ! ... సంబరమే ! దాని పెళ్ళి సరే, అదీ సరే ! ఈ మధ్య సిగ్గు,

బిడియం వదిలిపెట్టికనిపించిన స్నేహితురాలికల్లా ఈ పిల్ల ఇదే ధోరణిలో చెప్పటం మొదలుపెట్టింది," అన్నది విసుగ్గా.

అమ్మ మాటలతో ఈ లోకంలోకి వచ్చిన నేను, "కుదిరిందేమోనే పాపం!" అన్నాను, కొంచెం సానుభూతిగా.

"సడేలే ! ఇన్నేళ్ళు వచ్చాకా ... ? పైగా ఈ మధ్య దాని మైండ్ కేదో అయిందని వైద్యం చేయించారు," అన్నది అన్నంలో మజ్జిగపోస్తూ !

అమ్మ మాట నిజమే ననిపించింది నాకు ఆ క్షణంలో. శాంతిని గురించి ఆలోచిస్తూనే కంచంలో చెయికడుక్కుని వెళ్ళి మంచంమీద పడుకుని పుస్తకం తెరిచాను. పుటలు ముందుకు జరుగుతున్నయ్. మనస్సు గతంలోకి పరుగెత్తింది.

శాంతి మా పక్కింటి మాష్టరుగారమ్మాయి. ఆమె, నేను ఒకే వయసువాళ్ళం. బి. ఏ. వరకు కలిసి చదువుకున్నాం. ఆఖరు సంవత్సరం పరీక్షల ముందు శాంతి తండ్రి గుండెపోటు వచ్చి హఠాత్తుగా పోయారు. దాంతో, చేతికి అందివచ్చిన కూతురు శాంతి, ఆ కుటుంబం వీధిన పడకుండా ఆఫీసులో క్లర్కుగా చేరి, కుటుంబ సంరక్షణ నెత్తిన వేసుకున్నది. తండ్రి పోయినప్పుడు వచ్చిన ప్రావిడెంటు ఫండు, ఇన్సూరెన్స్ కలసిన చిన్న మొత్తం అండగా పెట్టుకుని, తన సంపాదనతో ముగ్గురు చెల్లెళ్లు, ఇద్దరు తమ్ముళ్లు, తల్లి, తను గుట్టుగా బ్రతికేవాళ్ళు. ఆ తరువాత నాకూ పెద్దగా చదువుమీద శ్రద్ధలేక ఇంటిదగ్గరే ఉన్నాను. ప్రతిరోజూ శాంతి ఆఫీసునుంచి రాగానే, స్నానం చేసి, తెల్లని వాయిల్‌చీర కట్టుకుని, నాగుపాములాంటి వాలుజడలో ఒక్క గులాబీని అందంగా అమర్చుకుని, నాకూ ఒక గులాబీపువ్వు తీసుకొని మా ఇంటికి వచ్చేది.

ఆమె, నేను మేడమీద కూర్చుని గంటలతరబడి కబుర్లు చెప్పుకునేవాళ్లం. చివరకు కిందనుంచి అమ్మ పిలిస్తేగాని భోజనానికి టైము అయిందని తెలిసేది కాదు మాకు. మా మాటల్లో శాంతి ఆఫీసు విషయాలు, వాళ్ళ కుటుంబ విషయాలు, పిల్లల చదువులు, మా ఇంట్లో మా నాన్నగారి ప్రమోషను, అన్నయ్య అమెరికా వెళ్ళటానికి జరుగుతున్న ప్రయత్నాలు, నా పెళ్ళి సంబంధాలు, ఒకటనేమిటి అన్నీ దొర్లుతుండేవి.

ఆ రోజు శాంతి మామూలు టైముకే మా ఇంటికి వచ్చింది. కాని, ఆమె రాకకోసం మధ్యాహ్నంనించి ఎదురు చూస్తున్న నాకు ఎంతో ఆలస్యంగా వచ్చినట్లనిపించి, ఎదురువెళ్ళి, "ఇంత ఆలస్యం చేశావేం ?!" అన్నాను.

"నేను మామూలు టైముకే వచ్చాను.

కావాలంటే ప్రైము చూడు" అన్నది శాంతి చిలిపిగా.

ఆవేళ దాని మాటల్లో చిలిపితనం, చూపుల్లో కొంటెతనం, బుగ్గల్లో ఎర్రదనం కనిపించాయి నాకు. నా సంతోషాన్ని పంచుకునే మొదటి వ్యక్తి శాంతి. నా మనసులో సుళ్ళు తిరుగుతున్న ఆలోచనల్ని ఎలా మాటల రూపంలో పెట్టాలా అని, ఆలోచిస్తుండగానే, "నీకో ముఖ్యమైన విషయం చెప్పాలి సునీతా !" అన్నది శాంతి. అప్పటికే ఆమె చెంపలు కెంపులయ్యాయి.

"ఏమిటది ?" ఆత్రంగా అడిగాను.

"ఏంలేదులే ... !" మొహమాట పడుతున్నట్లు అన్నది.

"అంత చెప్పకూడని రహస్యమా ? పోన్లే అయితే !" నిష్ఠూరంగా అన్నాను.

"లేదు సునీతా ! ముందుగా నీకే చెబుదామని వచ్చాను. నేను...నేను... ఒక నిర్ణయానికి వచ్చాను" అన్నది.

ఆ మాటతో నాకు మరీ ఉత్సాహం వచ్చి, "ఏమిటీ, ఏమిటి నీ నిర్ణయం? త్వరగా చెప్పు," అన్నాను దాని భుజాలు పట్టి కుదుపుతూ.

" మరే ... మరి ... మా ఆఫీసులో ... "

"ఆ !...ఆఫీసులో..."

"నా కోలీగ్ సూర్యం ... మాట పూర్తికాకుండానే సిగ్గు ముంచుకు వచ్చి, కళ్ళు తళుక్కున మెరిసి, హృదయం బరువెక్కి- శాంతికి మాటలు కరువైనయ్! క్షణం నా కళ్ళల్లోకి చూసి తలదించు కున్నది.

"అమ్మ దొంగా ! ఇదా సంగతి. అయినా ఇంత ఆలస్యంగానా నాకు చెప్పటం ? ఏంచేస్తున్నా డన్నావ్ ? నీ కొలీగా ? అందంగా ఉంటాడా ?"

మౌనం వహించింది శాంతి.

"హుషారైనవాడేనా? ఆస్తిఉన్నదా? అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు ఉన్న పెద్ద కుటుంబమేనా ? " అంటూ ఊపిరాడకుండా ప్రశ్నలు వేశాను.

"చెప్పనీ సునీతా ! ఆయన నాలాగా బి.ఏ. చదవలేదు. ఒక అనాధ శరణాలయం ఆయన్ని పెంచి పెద్దచేసి యల్. డి. సి. గా తయారుచేసింది. అందం అంటావా, అంగసౌష్టవానికి లోటులేదు. ఆస్తి లేకపోయినా ఆత్మాభిమానం ఉంది. నా కెందుకో ఆయన ప్రవర్తన బాగా నచ్చింది."

"అదృష్టవంతురాలివి. నీ అంత చొరవ చెయ్యలేని నేను, అమ్మా, నాన్న స్థిరపరచిన పెళ్ళిచేసుకోబోతున్నాను" అన్నాను ఇన్ఫీరియారిటీ ఫీలవుతూ.

"చాలా బావుంది సునీతా! మనిద్దరం ఒకే సంవత్సరంలో పుట్టాం. ఒకచోటే పెరిగాం. ఇద్దరం ఒకే డిగ్రీ తీసుకున్నాం. చివరగా ఒకేసారి జీవితంలో స్థిరపడబోతున్నాం. మనిద్దరికీ ఆర్థిక





మైన వ్యత్యాసం ఉన్న మన స్నేహానికి, జీవిత విధానానికి అది అడ్డుతగల్లేదు" అన్నది మెల్లగా నవ్వుతూ.

ఆ తరువాత శాంతి నాలుగురోజుల దాకా మా ఇంటికి రాలేదు. అప్పటికే మా ఇంట్లో పెళ్ళిసందడి ప్రారంభ మయింది. ఆ నాలుగు సాయంకాలాలు శాంతికోసం ఎదురుచూసిన నేను ఇహ ఉండబట్టలేక వాళ్ళింటికి వెళ్ళాను, 'తన పెళ్ళి ఏర్పాట్లు తనే చూసుకోవాలిగదా అందుకే వచ్చి ఉండదు అనుకుంటూ. నేను వెళ్ళేసరికి శాంతి అప్పుడే ఆఫీసు నుంచి వచ్చింది. ఆ ఇంట్లో ఏ హడావిడీ కనబడలేదు. పైగా అందరి మొహ ల్లోనూ ఏదో బాధ. నన్ను చూడగానే తలదించుకుని, "అలా జాజి పందిరి దగ్గర కూర్చుందాం రా సునీతా" అంటూ రెండు కుర్చీలు తీసుకువెళ్తున్న శాంతితో, "ఈ కాఫీ తాగి వెళ్ళు" అన్నది వాళ్ళ అమ్మ.

"నాకొద్దు..." అంటూ వెళ్ళింది శాంతి.

"మా కాలంలో ఇవన్నీ తెలీ వమ్మా..." అంటూ ఇంకేవేవో సాధిం చింది ఆవిడ కూతుర్ని.

శాంతి, నేను ఒకరి కెదురుగా ఒకరం బొమ్మల్లా కూర్చున్నాం. పది నిముషాల నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ, "నేను చాలా దురదృష్టవంతురాల్ని సునీతా !" అన్నది ఏదో చెప్పటానికి నాందిగా. ఆమె బాధను బరువుగా వచ్చిన ఆ మాటలవల్లే తెలుసుకుని మౌనంగా ఆమెవంకే చూస్తున్నాను.

"నా పెళ్ళి ఆగిపోయింది " అయిదు నిముషాల తర్వాత అన్నది

"ఎందుకని ? అతను కాదన్నాడా"

"కాదన్నది అతను కాదు అమ్మ !"

"అమ్మా ?"

"అవును కులం లేనివాడికి గుణం ఉండదని, తన కూతురి సంపాదన చూసి అతను ఆశపడుతున్నాడని ఏమేమో అన్నది "

"అత నేమన్నాడు ?"

"శాంతి, నేను పెళ్ళిచేసుకున్నంత మాత్రాన మీ కేలోటూ రానివ్వమని, తాను కూడా ఇక్కడే ఉండి ఈ కుటుంబ బరువు బాధ్యతల్లో పాలుపంచు కుంటానని చెప్పాడు "

"ఇంకేం మరి ?"

"ఇద్దరు చెల్లెళ్ళున్నా చేతికి అంది వచ్చేవరకు నేను పెళ్ళిచేసుకోకూడదని అమ్మ వాదన "

"అందుకని నీ జీవితం నాశనం చేసుకుంటావా ? అంతగా అమ్మకు ఇష్టంలేకపోతే మీ రిద్దరూ రిజిష్టరు మ్యారేజి చేసుకోండి ఆవేశంగా అన్నాను

"అలా జరగదు సునీతా ! మధ్య తరగతికి చెందిన బహుకుటుంబీకులం మేం ! నేను అతణ్ణి రిజిష్టరు మ్యారేజి చేసుకుంటే అమ్మ నన్ని గడప తొక్క నివ్వదు నేనే కాదు ఆమెకు నా డబ్బు కూడా పనికిరాదు దాంతో పిల్లల చదువులు ఆగిపోతాయి గుట్టుగా నడుస్తున్న సంసారం వీధిన పడు తుంది ఈ సమస్యలన్నీ నా స్వార్థపు ఆలోచనల్లో మరుగున పడిపోయాయి చూశావా ?"

"ఇందులో స్వార్థం లేంది ఎవరికి ? అయినా ఎవరి స్వసుఖం వాళ్ళు చూసు కోవాలి గాని, ఇలా నిస్వార్థానికి, త్యాగానికి జీవితాన్ని పణంగా పెట్టకూడదు "

"అదీ ఆలోచించాను సునీతా ! స్వసుఖంకోసం నేను తెంపరితనం చూపిస్తే, అందరూ ఉండీ ఎవరూ లేని దాన్నవుతాను అతను ఎటూ ఒంటరి వాడు ! ఇది ఈనాటి సమస్య కాదు ముందు ముందు చెల్లెళ్ళ పెళ్ళిళ్ళు పెద్ద సమస్యగా తయారవుతాయి" అన్నది దీర్ఘంగా నిట్టూరుస్తూ

'ఇంత పిరికిదానివేం శాంతీ ! ? ఇవ్వాళ నీ ఇష్టంవచ్చిన పెళ్ళి నువ్వు చేసుకుంటే, ఎప్పుడో జరిగే నీ చెల్లెళ్ళ పెళ్ళిళ్ళదాకా ఈ సంగతి ఎవరు గుర్తు పెట్టుకుంటారు ? అయినా ఒకర్ని గురించి పట్టించుకొనే తీరిక ఈ సమా జాని కెక్కడిది? నీ డబ్బు మీ అమ్మకు పనికి రాకపోయినా పిల్లల చదువులకు ఉపయోగించు '

"అది అంత తేలిక కాదు సునీతా! డబ్బుగలవాళ్ళకు దాన్ని అనుభవించ



టంతో తీరిక ఉండదు. లేనివాళ్ళకు కష్టపడి సంపాదించుకోవటంతో తీరిక ఉండదు. మాలాంటి మధ్యతరగతి వాళ్ళకు ఎదుటివాళ్ళను ఏ రకంగా చిన్నచూపు చూద్దామా, ఎక్కడ అవకాశం దొరుకుతుందా వాళ్ళ చుట్టూ కథలు అల్లి వెలివేయటానికి అని ఎదురు చూస్తుంటారు. ఇంటికి పెద్దదాన్నిగా పుట్టినందుకు స్వార్థరహితంగా ఈ బాధ్యతల్ని నెత్తిన వేసుకోక తప్పదు" అన్నది భారంగా.

"మరొక్కసారి ఆలోచించుకో శాంతీ ! ఇంకో నాలుగేళ్ళ తరువాత ఇలాంటి అవకాశం మళ్ళీ రాకపోవచ్చు. మీ అమ్మగారు తన స్వార్థానికి నిన్ను ఉపయోగించుకుంటున్నారు. ఎవరి స్వార్థం వాళ్ళది. అయినా స్వార్థత్యాగం అంతిమదశలో కాని, యౌవనంలోకాదు" అంటూ లేచాను. శాంతి మౌనంగా గేటుదాకా వచ్చి నన్ను సాగనంపింది.

సంగతులు విన్న అమ్మ వారం రోజుల తరువాత మా ఇంటికి వచ్చిన శాంతిని, "ఏమిటమ్మా ! పెళ్ళిచేసుకుని

నీ దారి నువ్వు చూసుకుంటే ఆ గంపెడు సంసారం గతేంకాను ? చదువుకుని నాలుగు డబ్బులు సంపాయిస్తున్నందుకు తోడబుట్టినవాళ్ళను ఆదుకోకపోతే ఎట్లా ?" అంటూ చనువుగా మందలించింది. సమాధానం చెప్పలేని శాంతి తలవంచుకున్నది.

ఆ తరువాత నెలరోజులకు నా పెళ్ళి అయి అత్తవారింటికి వెళ్ళేటప్పుడు నాకు వీడ్కోలు ఇస్తూ నా కళ్ళల్లోకి చూసిన ఆనాటి శాంతి చూపు నాకిప్పటికీ గుర్తే !

నా కళ్ళల్లో కాంతి, తన చూపులో నైరాశ్యం.

నా మనసు నిండా కోరికలు, తన మనసులో స్తబ్ధత.

నా ఆలోచనలు కొత్త జీవితాన్ని గురించి, తన ఆలోచనలు జరిగిన సంఘటనల్ని గురించి.

నా ఊహలు విహంగాలైతే తన ఊహలు రెక్కలు తెగిన పక్షులు.

నేను తలపోస్తున్నది మెట్టినింటిని గురించి, తన బాధ పుట్టినింటిని గురించి.

ఆ క్షణంలో ఇద్దరి కనురెప్పలు మూతపడలేదు, ఇద్దరి పెదవులు విడివడలేదు మా ఇద్దరి హృదయాలు మూగగా రోదిస్తున్నాయి ఇద్దరి ఉచ్ఛ్వాస నిశ్వాసాలు వేడిగా ఉన్నాయి మా నాలుగు నేత్రాలు బరువైన కన్నీటిని దాచుకోలేక సతమతమౌతున్నయ్ !

"పదమ్మా! వేళవుతున్నది." అన్నగారి మాటతో ఈ లోకంలోకి వచ్చిన నేను త్వరత్వరగా అడుగులు వేసుకుంటూ ముందుకు వెళ్ళిపోయాను.

నాతోపాటు అడుగులువేసి నన్నందుకోలేని శాంతి అక్కడే ఆగిపోయింది

ఆ తరువాత కొన్నాళ్ళకు వాళ్ళకు బదిలీ అయి ఇంకో ఊరు వెళ్ళిపోయారు

అప్పుడప్పుడు నేను వస్తే అమ్మ చెప్పిన దేమిటంటే, శాంతి పెద్ద చెల్లెలికి పెళ్ళిచేసిందని, రెండో చెల్లెలు ఎవర్నో ప్రేమించి తనే పెళ్ళిచేసుకుందని, మూడోది పెళ్ళిమీద విశ్వాసంలేక ఎవరితోనో ఉంటున్నదని, దాని పెద్ద తమ్ముడు ఎలిమెంటరీ స్కూలు టీచరైనందున తల్లిని పోషించలేక శాంతి దగ్గర వదలితే, చిన్న తమ్ముడు అమెరికా వెళుతూ తల్లిని తీసుకువెళ్ళటానికి వీల్లేక తన కుటుంబాన్ని మాత్రమే తీసుకువెళ్ళాడని. అయితే అందరూ ఎవరి సంగతి వాళ్ళు చూసుకుంటే, అందరికీ అండగా నిల్చిన శాంతి అశాంతి పాలైంది.

పొద్దున అమ్మ చెప్పిందేమిటంటే, శాంతి రిటైరయి తల్లితోసహా ఇక్కడే ఉంటున్నట్లు, కొన్ని నెలలక్రితం




మెంటల్ ఎఫెక్టు వచ్చి కొంత కోలుకున్నా, చిన్ననాటి స్నేహితురాళ్ళెవరన్నా కనిపిస్తే, "నాకూ పెళ్ళవుతుందేవ్ ? మీరంతా వస్తారుగా ? అంటూ పిచ్చిగా మాట్లాడుతుందని. నిజమే మరి. పచ్చగా పువ్వులు పూసి, కాయలుకాసిన చెట్టును చూసి ఎంత చక్కగా ఉన్నది అని అభినందిస్తాం కాని, పూయలేకపోయిన దాన్నిగురించి సానుభూతి చూపించం.

తన తల్లి స్వార్థానికి శాంతి తను చేయూత నిచ్చింది. తోడబుట్టినవాళ్ళ అభివృద్ధికి అండగా నిల్చింది. తండ్రి బాధ్యతారహిత ప్రవర్తనకు తను బాధ్యత వహించింది. తల్లి వృద్ధాప్యంలో తనే తోడయింది. కాని లోకం దృష్టిలో శాంతి పిచ్చిది. ఎప్పుడో మెంటల్‌గా దెబ్బతిని కోలుకున్నా ఇంకా పిచ్చిదానిగానే చలామణి చేస్తున్నారు. దాన్ని చూసిన నాకు, తనకూ పెళ్ళవుతుందన్న ఆశతోనే అది జీవిస్తున్నట్లు అనిపించింది.

వాకిట్లోనుంచి ఏవో అరుపులు వినిపించటంతో ఈ లోకంలోకి వచ్చిన నాకు బయట జుట్టు విరబోసుకుని, పెద్దగా నవ్వుతూ, "నాకూ పెళ్ళవుతుంది. నాకూ పెళ్ళి కుదురుతుంది" అని తనలో తనే మాట్లాడుకుంటూ నడుస్తున్న శాంతి కనిపించేసరికి దాని పరిస్థితికి రెండు కన్నీటిబొట్లు తప్ప మరేమీ ఇవ్వలేక తలవంచుకుని లోపలికి నడిచాను బాధగా !



# చిన్నారి ప్రేమలేఖ

## ఎ.మంజులత

ప్రియమైన రామానుజం,

ఈ ఉత్తరం ఇట్లాగ రాయడానికి వెనక చాలా చరిత్ర ఉంది. ఇట్లాగని బాబాయి అన్నాడు. అస లేమయ్యిం దంటే, నేను బాబాయిని ఒకటి అడిగాను. అసలు అంతకన్న ముందు ఏమయ్యిం దంటే, మా నాన్న, నేను భోంచేస్తున్నాం. మా అమ్మ వడ్డిస్తోంది.

"ఇదేమిటి, ముందే చారు పోస్తు న్నావ్ ? కూర లేదా ?" అన్నాడు మా నాన్న.

మా అమ్మేమో, "ఇది చారు ఎందు కయ్యింది ? పచ్చడి" అంది కోపంగా.

మా నాన్న నవ్వాడు. మా అమ్మకి ఇంకా కోపం వచ్చేసింది.

అందుకని కొంచెంసేపయ్యాక, మా అమ్మ కోపం పోగొట్టెయ్యటానికి మళ్ళీ "ఈ దొండకాయకూర చాలా బాగుంది కదూ, చిన్నారీ?'' అని నన్ను అడిగాడు మా నాన్న.

మా అమ్మ విన్లేదేమో ననేసి, మళ్ళీ గట్టిగా ఆ మాటే అన్నాడు.

మా అమ్మేమో మళ్ళీ కోపంగా చూసి "అది దొండకాయకూర కాదు, బెండ కాయ పులుసు" అంది.

మా నాన్న మళ్ళీ నవ్వబోయి ఎందుకో ఆగాడు. మళ్ళీ నావైపు చూసి, మీ అమ్మ ఎంత గొప్పదో చూశావా చిన్నారీ ? పచ్చడి చారులాగా, చారు పులుసులాగా, నీళ్ల మజ్జిగలాగా, అది ఇదిలాగా, ఇది అదిలాగా చేసెయ్య గలదు" అన్నాడు నాతో.

"అది ఇదిలాగా, ఇది అదిలాగా అంటే ఏమిటి నాన్నా ?" అన్నాను నేను.

"అది ఇదిలాగా అంటే, చంద్రుడిని తన ముఖంలాగా అన్నమాట. ఇది అది లాగా అంటే తన ముఖాన్నే చంద్రుడి లాగా అన్నమాట" అన్నాడు నాన్న.

అంటే ఏమిటీ అని ఆలోచించాను నేను. అప్పుడు తెలిసిపోయింది నాకు. అంటే, అమ్మ మొహం చంద్రుడత్తయ్య లాగా ఉంటుందని నాన్న అనడం. చంద్రుడత్తయ్య తెలుసా నీకు రామా నుజం ? అప్పుడోసారి నువ్వు మా ఇంటికి వచ్చినప్పుడు ఇక్కడుందే—లావుగా ? గుర్తొచ్చిందా ? ఆవిడనే బాబాయి, అత్తయ్య 'పీపా' అని చాటుగా నవ్వేవారు.

నాకు కోపం వచ్చేసింది. అమ్మ మొహం చంద్రుడత్తయ్యల్లే ఉంటుందా? 'ఇంచక్కా ముద్దొస్తూ ఉంటుంద'ని అమ్మమ్మ అంటుంది కదా ?

"అమ్మ మొహం చంద్రుడత్తయ్యల్లే ఉండదు" అన్నాను నేను కోపంగా. నాన్న, అమ్మ నే నన్న దేమిటో తెలీ నట్టుగా నాకేసి చూసారు కొంచెంసేపు. "చంద్రుడత్తయ్యలాగా ఉండట మేమిటి?" అని అడిగాడు నాన్న.

నేను కోపంగానే చూసాను నాన్న కేసి. "అమ్మ మొహం చంద్రుడత్తయ్య లాగా ఉంటుందని ఎవరన్నారు ?" అన్నాడు మళ్ళీ.

నాకు ఇంకా కోపం వచ్చేసింది. "ఇప్పుడు నువ్వేకదా అన్నావు. అబద్ధా లాడొద్దు. ఆడపిల్లలు పుడతారు" అన్నాను నేను

నాన్న అస్తమానూ అబద్ధాలాడు

తాడు. అందుకే నాన్నకి నేను పుట్టానట. అమ్మ ఎప్పుడూ అబద్ధాలాడదట. అందుకే అమ్మకి తమ్ముడు పుట్టాడట. ఇట్లాగని అమ్మ అస్తమానూ అంటుం టుంది నాన్నతో.

నాన్న పెద్దగా నవ్వాడు. అమ్మ కూడా నవ్వింది. "చంద్రుడ త్తయ్య కాదు చిన్నారీ ! ఆకాశంలో చంద్రు డొస్తాడే, ఆ చంద్రుడిలాగా ముద్దుగా ఉంటుంది అమ్మ ముఖం" అన్నాడు నాన్న, నవ్వడం అయిపోయాక. అమ్మేమో నవ్వడం అయిపోయాక, మళ్ళీ ఎప్పట్లాగా కోపం తెచ్చేసుకుని "చాల్లెండి మీరు మరీనీ. చిన్నపిల్ల దగ్గరకూడా ఏమిటదీ ?" అంది.

"వయస్సు మీరుతున్నకొద్దీ మీ బామ్మకి మతిపోతోంది. మతిలేని పనులూ, మతిలేని మాటలూ ! ఎట్లా వేగేది !" అంటుంటాడు మా తాతయ్య. మా నాన్నకి కూడా వయస్సు మీరు తున్నకొద్దీ మతిపోతోంది. లేకపోతే, అమ్మ మొహం ఆకాశంలో చంద్రుడిలా ఉండటమేమిటి మతిలేని మాటలు కాక పోతే ! తాతయ్యకి లాగా నాకూ వీళ్లతో విసుగొచ్చేస్తోంది!

"అమ్మ మొహం ఆకాశంలో చంద్రుడిలా ఉండదు" అన్నాను నేను మా నాన్నతో.

"నా కళ్లతో చూస్తే అట్లాగే కనబడు తుందిలే, చిన్నారీ !" అన్నాడు నాన్న, అమ్మకేసి చూస్తూ.

"నీ కళ్లతో ఎట్లాగ చూడ్డం నాన్నా?" అన్నాను నేను.

"నా కళ్లతో అంటే, ప్రేమించే కళ్ళతో అన్నమాట." అన్నాడు నాన్న.

"ప్రేమించడం అంటే ఏమిటి నాన్నా ?" అనడిగాను నేను.

ఇంతలో అమ్మ, "ఛట్!నోర్ముయ్!" అని కసిరింది నన్ను. "ఇక మీరు మాటలు కట్టిపెట్టి భోంచెయ్యండి" అంది నాన్నతో.

ఇంక అమ్మ ఏమీ చెప్పనివ్వదు. అందుకే గబగబా భోంచేసేసి అత్తయ్య దగ్గరికి పరిగెత్తాను.

"ప్రేమించడం అంటే ఏమి టత్తయ్యా ?" అనడిగాను.

అప్పుడే బాబాయి ఏదో రాసుకుం టున్నాడు.

"అదుగోనే చిన్నారీ, ప్రేమించడ మంటే అట్లా రాయడమే" అంది అత్తయ్య నవ్వేసి.

"ఏంరాయాలి ?" అన్నాను నేను.

"ప్రేమలేఖలు రాయడమన్నమాట" అంది అత్తయ్య.

నాకూ ప్రేమించ బుద్ధేసింది. "అయితే నేనూ ప్రేమిస్తానత్తయ్యా !" అన్నాను.




"ఓసి భడవా !" అనేసి అత్తయ్య ఇట్లాగ నెత్తిమీద మొట్టి లోపలికి వెళ్ళిపోయింది.

నేను అత్తయ్య వెంటపడ్డాను.

"అత్తయ్యా ! నేనూ ప్రేమిస్తాను. ఎలాగో చెప్పవూ ?" అని బతిమాలాను.

"ఇదెక్కడి గొడవే !" అని అత్తయ్య నవ్వింది. తర్వాత "ఆ వేషాలన్నీ బాబాయివే ! బాబాయినే అడుగు" అంది.

నేను బాబాయిదగ్గర కెళ్ళి అడిగాను, "బాబాయి, బాబాయి. ప్రేమించడం నేర్పించవా ?" అని.

"ఏమిటి ? !!" అన్నాడు బాబాయి చాలా ఆశ్చర్యపోయి.

"నేనూ ప్రేమిస్తాను బాబాయి. నాకూ నేర్పు" అని అడిగాను మళ్ళీ.

"ప్రేమించమని ఎవరు చెప్పారే చిన్నారీ, నీకు ?" అని అడిగాడు బాబాయి నన్ను.

"అత్తయ్య చెప్పింద"న్నాను. ''ఎందుకు చెప్పింద''ని అడిగాడు బాబాయి. ''నాకు ప్రేమించ బుద్ధేస్తే చెప్పింద''ని చెప్పాను.

"ఎందుకు ప్రేమించ బుద్ధేసింది ?" అని అడిగాడు బాబాయి.

అప్పుడు "అమ్మ మొహం ఆకాశంలో చంద్రుళ్ళా ఉంది" అని చెప్పాను.

"ఎందుకు ఉందన్నాడు" బాబాయి.

"ప్రేమిస్తే ఉంటుందని నాన్న చెప్పాడు" అన్నాను.

"నాన్న నీకు ఎందుకు చెప్పాడే" అని అడిగాడు.

"అమ్మ పచ్చడి చారులాగా, అది ఇదిలాగా, ఇది ఆదిలాగా చేసినందుకు చెప్పాడు" అని చెప్పాను.

"ఓహో ! ఇంత చరిత్ర ఉందన్న మాట నువ్వు ప్రేమించడానికి" అన్నాడు బాబాయి.

"చరిత్ర కాదు బాబాయి" అన్నాను నేను.

బాబాయి కేంతెలుసు, చరిత్ర అంటే సింధు నాగరికత, అశోకుని పరిపాలన, చెట్లు నాటడం అని? బాబాయి పదిహేడో క్లాసు చదువుతున్నాడు. అయినా, చరిత్ర అంటే అశోకుని పరిపాలన, చెట్లు నాటడం అని తెలీదు. ప్చ్ ! అందుకే అంటుంది బామ్మ "ఏం చదువులో, ఏమిటో ! చదువుకున్నవాడి కంటే చాకలాడు నయం" అని. మా బాబాయి కంటే మా చాకలాడే నయం.

"అయితే, ఎవర్ని ప్రేమిస్తావే చిన్నారీ ?" అని అడిగాడు బాబాయి.

నేను కొంచెంసేపు ఆలోచించాను. అమ్మనే ప్రేమిద్దామనుకున్నాను. కానీ, ఎట్లాగా ? అమ్మ అస్తమానూ ఇంట్లోనే కదా, ఉంటుంది ? ఇంక ఉత్తరాలు ఎలాగ రాసి, ఎలాగ ప్రేమించాలి ? నాకు అప్పుడొక అనుమానం వచ్చింది. నాన్నమాత్రం అమ్మని ఎట్లాగ ప్రేమించాడు, అమ్మ అస్తమానూ ఇంట్లోనే ఉంటే ? బాబాయిని అడిగాను. బాబాయి బుర్ర గోక్కున్నాడు. అప్పుడు అత్తయ్య గదిలో ఉంది కదా, మా మాటలు వింటోంది కదా !

అప్పుడు అత్తయ్య చెప్పింది "మీ అమ్మ, వాళ్ళ నాన్నగారి ఊరు—అంటే రామానుజం తాతగారి ఊరు—వెళుతుంది కదే చిన్నారీ; అప్పుడు మీ నాన్న మీ అమ్మకి ఉత్తరాలు రాస్తాడు" అని.

అప్పుడు నువ్వు గుర్తొచ్చావు రామానుజం, నాకు.

అందుకని నేను "అయితే నేను రామానుజం తాతను ప్రేమిస్తాను" అన్నాను.

"సరే !" అన్నాడు బాబాయి.

అందుకని రామానుజం, నేను నిన్ను ప్రేమిస్తున్నాను.

ఇట్లు,
చిన్నారి.






పెద్దగా శబ్దంచేస్తూ ఆ చిన్నింటి గది తలుపులు రెండూ మూసుకున్నాయి. ఏడుస్తున్న యేణ్ణర్థం చిరంజీవి మళ్ళీ 'కెవ్వు' మంటూ గుక్కపెట్టి ఏడ్చాడు. లావణ్య వాడ్ని ఆత్రంగా తీసుకుని గుండెకు హత్తుకుంది. 'ఉచ్చ' కొడ్తూ, కుదుపుతూ వాడ్ని ఓదారుస్తోంది. అక్కడే నిలబడ్డ జోగారావు మంటపెడ్తున్న తన కుడిచేతిని నలుపుకుని, పిడికిలి విప్పి చూసుకున్నాడు. చిన్నగా వణుకుతోంది చేయి. 'ఛీ, ఛీ' అనుకున్నాడు.

ఇంతలో–

గోడకు తల బాదుకుంటున్న శబ్దం

'దబ్ దబ్' మంటూ విన్పించింది–చిన్న గదిలోంచి. లావణ్య భయంగా అటు చూసింది. జోగారావు బెదిరినట్టుగా చలించాడు. వెళ్ళి తలుపులు బాదాడు. తెరుచుకోవటంలేదు అవి. "వర్ధనం – వర్ధనం" అని గాభరాపడ్డాడు. మరోసారి తలుపు గొళ్ళెం పట్టుకుని బలంగా ఝాడించాడు.

సమాధానం లేదు లోపల్నుంచి. కాని, ఏడుస్తున్న గొంతు విన్పిస్తోంది.

"వర్ధనం–వర్ధనం" రెట్టించి కేకేశాడతను.

జవాబు లేదు.

చీర కొంగుతో ఏడుపును నొక్కిపెట్టిన శబ్దం – కుళ్ళి కుళ్ళి ఏడుస్తున్నట్టు, మధ్య మధ్య ఎక్కిళ్ళు – అంతకు మించి విపరీతంగా దగ్గు – రెండు చేతుల్తో తల మోదుకుంటున్న ధ్వని–

ఇవే విన్పిస్తున్నాయి బయటికి.

లావణ్య నిలువునా కంపించిపోతోంది. చిరంజీవి ఏడుస్తూనే ఉన్నాడు. జోగారావు కాలుగాలిన పిల్లిలా తలుపుముందు తచ్చాడుతున్నాడు. పిచ్చిగా తల గోక్కుంటున్నాడు.

అయిదు నిముషాలు గడిచాయి.

ఎక్కడివాళ్లు అక్కడే! యథాప్రకారంగా ఉంది పరిస్థితి.

పావుగంట గడిచింది.

వాతావరణంలో కొద్ది మార్పు.

లావణ్య పిల్లాడ్నెత్తుకుని ప్రక్కింటికి వెళ్ళింది. జోగారావు చుట్ట ముట్టించి ప్రక్కనున్న వాలుకుర్చీలో చతికిలబడ్డాడు. చిన్న గదిలోని దగ్గు రాను రాను క్షీణిస్తూ – అంతలోనే మళ్ళీ శక్తిని పుంజుకుంటూ, గచ్చుమీద దళసరి కంచుపళ్లేలు ఎత్తేస్తున్నట్టు 'ఖంగ్–ఖంగ్' మంటూ విన్పిస్తోంది.

"పిచ్చి ముండ" అనుకున్నాడు జోగారావు అస్పష్టంగా.

"నిజమే ! తను పిచ్చిది కాబట్టే ఇంకా బ్రతుకుతోంది. అభిమానాలని, అనురాగాలని అంతఃకరణాలంటూ పిచ్చిగా వాటిని నమ్ముతోంది. సరదాలు, సంతోషాలంటూ – వాటిని పదిమందితో పంచుకుందాం అనుకుంటూ భంగపాటు పడుతోంది. తీరని వేదన అనుభవిస్తోంది. ఎప్పుడూ కూడ తుళ్లుతూ, నవ్వుతూ ఉండాలనుకునే తను ఇప్పుడు...!

సన్నగా – పీలగా, బలహీనంగా ఎండిపోయిన బొప్పాయిచెట్టుకుమల్లే తన వేషం – పొడారిపోతున్న తను – మండుతున్న గొంతుతో క్షణక్షణం కెళ్ళలుగా దగ్గు – ఆదరించని పిల్లలు – అభిమానించని కోడళ్ళు – ఓదార్పులేని భర్త – ఓర్పు నశిస్తున్న జీవితం – భగవంతుడా ! ఇటువంటి బ్రతుకును ఇంకెవ్వరికీ ప్రసాదించకు తండ్రీ !

అని అన్పించింది. వర్ధనానికి అదే క్షణంలో. శూన్యంలోకి చేతులెత్తి ప్రార్థించింది కూడ. మళ్ళీ ఏడుపు, దగ్గూ మిళితమై ముంచుకొచ్చాయి ఆమెకి.

కాలుతున్న చుట్ట చివరంటా కాలిపోయి చేతి వేలుని 'చురుక్కు' మన్పించింది. జోగారావు వేలును నోట్లో ఉంచుకున్నాడు. ఆలోచిస్తున్నాడు.

ఓ అరగంట క్రితం–

అక్కడ – వాలుకుర్చీని కేంద్రంగా గజం వ్యాసార్థంతో గీసిన వృత్తంలో ఎంత రభస జరిగింది ! ఇంతెంత యుద్ధం చెలరేగిందనీ ! అంతటా అందరూ ఆవేశపడ్డారు. ఎవరి కివాళ్ళు ఆభిమానపడ్డారు.

ఫలితం ?

చిన్నవాడు శంకరం కొంపను చీదరించుకుని ఎక్కడికో వెళ్ళిపోయాడు. వర్ధనం చిన్నగది తలుపులు బిగించుకుని ఏడుస్తో కూర్చుంది. కోడలు లావణ్య ఇదేం పట్టనట్టుగా ప్రక్కింటికి వెళ్ళిపోయింది. తనొక్కడూ మాత్రం మిగిలిపోయాడు – ఎక్కడికీ వెళ్ళలేకా కాదు, ఏదీ చెయ్యలేకా కాదు, చేసిన దానికి చింతిస్తూ.

వెధవది చిన్నప్పట్నుంచీ తనకి చేయి దురుసు ఎక్కువ. ఆ దురుసుతనానికి మరింత ఆసరా ఇచ్చింది టీచరు ఉద్యోగం. అప్పట్లో అధికారం, పెద్దతనం హాయి అన్పించేవి. తను క్లాసులలో, లెక్కచేస్తూ - చెప్తూ ఉంటే ఏ గుంటడైనా కదల్డానికి, 'కుంయ్' మనడానికీ అర్హత కాని, అవకాశం కాని లేకుండా పోయేవి. ఖర్మంచాలక ఎప్పుడైనా, ఎవడైనా కదిలి 'కాం' మంటే వాడికి ఆ రోజు నరకం కంటి ముందు కదిలేది. అంతలా చావబాదేవాడు. స్టాఫ్‌లోను, స్టూడెంట్సులోనూ తనకు 'ఇనుప దేవుడు' అని పేరుండేది.

అంతలాంటి ఇనుప దేవుడూ ఇప్పుడేంవయ్యాడు ?!

ఏళ్లు మీదపడి రక్తం పలుచబడింది. శక్తి క్షీణించింది. మామూలుగానే ముసలి అయిపోయినాడు. వయసుకు తగ్గట్టు ఉద్రేకాన్ని, ఉద్వేగాన్ని అణుచుకోలేకపోతున్నాడు. అరగంట క్రితం జరిగిన యుద్ధంలో తన పాత్ర నిజానికి చాలా చిన్నది. కాని, బహు కొద్దిక్షణాలలోనే విరాట్ రూపం ధరించింది. ఉగ్రంగా అరిచింది. ఉరికింది.

వర్ధనం చెంప 'ఛెళ్' మన్పించాడు.

పర్యవసానం !?

"చాలా నాయనా ! నిన్ను కట్టుకుని బాగా సుఖపడ్డాను. మనుషుల రక్తాన్ని పచ్చిపాలులా త్రాగే మీకు నన్ను కట్టబెట్టాడు మా తండ్రి. మీ వంశాన్ని - మోతుబరీతనాన్ని చూసి సంతోషించాడు కాని, మీ ప్రవర్తనని చూడలేకపోయాడు. కాపురానికి వచ్చిన

లగాయితూ చూస్తున్నాను. కూర్చుంటే గుద్దు, లేస్తే తాపూ తంతున్నావు. చాలు ! అంతే చాలు ! జన్మ తరించి పోయింది." ఏడ్చింది వర్ధనం. ఎన్నడూ లేనిది తనని ఏకవచన ప్రయోగం చేసింది. చేతులెత్తి మొక్కింది. గదిలోనికి వెళ్ళి తలుపులు బిడాయించు కుంది.

"వెర్రి ముండ" గొణుక్కున్నాడు జోగారావు.

హఠాత్తుగా చిన్నింటి గది తలుపులు తెరుచుకున్నాయి. చుట్టుకుపోతూ బయటకు వచ్చింది—వర్ధనం. దగ్గుతో ఎగశ్వాస ఆడటంలేదు ఆమెకి. జోగారావు అయోమయంగా ఆమె వద్దకు పరుగెత్తాడు. దగ్గరగా తీసుకుని అదుముకున్నాడు. కుడి చేత్తో ఆమె గుండెను నిమరసాగాడు. కొంచెంగా సర్దుకుంది. అప్పటికీ భారంగా ఊపిరి తీస్తోందామె. బాధన్పించింది అతనికి. ఆమె కళ్ళల్లోనికి చూసాడు.

వర్ధనం అంతలేసి కళ్ళల్లో నీళ్ళు సుళ్ళు తిరుగుతూనే ఉన్నాయి.

"ఏడవకు" అతి ప్రయత్నంమీద అనగలిగాడు జోగారావు. తన అనునయం కూడ నమ్మలేని స్థితి ఆమెది-అన్పిస్తోంది అతనికి.

ఆ మాటకి దుఃఖం కట్టలు తెంచుకున్నట్టుగా అక్కుళ్లు - బుక్కుళ్ళుగా రోదించింది ఆమె.

"చూడు ! ఏడవకు. ఏడిస్తే దగ్గొస్తుంది. ఆ మాయదారి దగ్గుని తట్టుకునే శక్తి నీకు లేదు. మనిషివి చుట్టుకు పోతావు. నా మాట విను." బ్రతిమలాడాడు.

తిరస్కరిస్తున్నట్టు అతనినుండి దూరంగా జరిగింది వర్ధనం. తర్వాత స్థిరీకరించుకున్నట్టుగా అంది–

"పెద్దవాడి దగ్గరకు పోదాం."

"ఏఁ ఎందుకని ?" అడిగాడు.

"మీరు రాకపోతే నన్ను దిగబెట్టేయండి."

"అదేఁ !" ఆశ్చర్యపోయాడు.

"ఇక్కడకన్నా అక్కడే నయంగా ఉంది. ఆ కోడలే బాగుందనిపిస్తోంది. ఎంత చీదరించుకున్నా ముఖం వెనకాల కాని, ముఖంముందు భయం నటిస్తోంది కదా ! దీనికిమల్లే అది ఇంటిపని-వంట పనీ ముట్టుకోవద్దనటం లేదు. మనవళ్ని ముద్దుపెట్టుకోవద్దని శాసించటం లేదు. వాళ్ళూ దగ్గరికి రాననటంలేదు 'నాన్నమ్మా' అంటూ వాళ్ళు నా చేరువుకి వస్తున్నారు. నా కదే చాలు ! అంతే చాలు ! పదండి పోదాం" జోగారావు దగ్గరికి చేరి అర్థించినట్లుగా మాట్లాడింది వర్ధనం.

జాలిగా "వెర్రి మొఖమా" అంటూ వాలుకుర్చీదగ్గరకు నడిపించుకు వచ్చి- క్రిందన కూర్చోబెట్టుకుని ఆమె



ముఖాన్ని చేతుల్లోనికి తీసుకున్నాడతను.

"పిచ్చిదాన ! ప్రతి పిరికి వ్యక్తి ప్రస్తుతాన్ని వదిలి జరిగిపోయిన వెనుకటి రోజుల్నే తలపోసి కావాలంటాడు. కారణం ఏఁవిటో తెలుసా ! క్రితంలో తను వాటిని అనుభవించేశాడు. ఆ బాధల్ని, భయాల్నీ, దిగమింగేశాడు. కాని, నిజానికి తను అప్పట్లో ఆ రోజుల్నే అసహ్యించుకునేవాడు. వాటినుండి విముక్తి కోరుకునేవాడు..." అంటూ వేదాంత ధోరణిలో నవ్వేశాడు జోగారావు.

'అంతే' అన్నట్టుగా అతనివైపు ఆశ్చర్యంగా చూస్తోంది వర్ధనం. అలా ఆమె అతని ముఖంలోనికి చూస్తుంటే, అతనిలో ఇంతకుముందు భార్యపట్ల ఉండే సంశయాలు, సంకోచాలు, భయాలూ పంటాపంచ లైపోయినట్టుగా ఫీలయ్యాడు జరిగిన సంఘటన కలలా అన్పించి – ఆ కలకి జడుసుకున్న తను లేచి, భార్యను లేపి రాత్రంతా

స్వేచ్ఛగా - స్వచ్ఛంగా, కష్టం, సుఖం మాట్లాడుతున్నట్టు అన్పిస్తోందిప్పుడు అతనికి.

"పెద్దవాడింట్లో ఉంటున్నప్పుడు ఏఁవని బాధపడ్డావో జ్ఞాపకం ఉందా! కోడలుపిల్ల ముఖం చాటేసుకుని వాళ్ళింటా - వీళ్ళింటా మనల్ని గురించి చెడ్డగా చెప్తోంది, ఇక్కడ ఒక్క క్షణం ఉండొద్దన్నావు. ఇంకెక్కడికైనా పోదాం అన్నావు. మనకేఁ ఇద్దరు ఆడపిల్లలతో కలుపుకుని ఎనమండుగురు సంతానం - ఏ ఇంట్లో చేయి సాయం చేస్తే మన దినాలు గడిచిపోవు అన్నావు. చిన్నవాడింటికి చేరుకున్నాం. ఏఁబావు కున్నాం చెప్పు. అంతా ఒక్కటే. ఒట్టి పోయిన గొడ్లను ఎవరు చేరదీస్తారే?" ఇలా అంటున్నప్పుడు అతని గొంతు సన్నగా వణికింది.

వర్ధనం అతని మాటల్ని విశ్వసిస్తోంది. ఒదిగి జాగ్రత్తగా వింటోంది.

"పాడికట్టిన ఆవుకేనే పంచభక్ష్య పరమన్నాలూను. ఎండిపోయి, రోగిష్టి అయినవాటిని చీదరించుకుని తోలేస్తారే తప్పా, సేదదీర్చి వాటికి సాయం చెయ్యడం లోక విరుద్ధం... ఆఁ" రుద్ధమైంది కంఠం. అతని కళ్ళు చెమర్చాయి కూడ.

కాపురానికి వచ్చిన నలభై యేళ్ళలో భర్త ఎన్నడూ కన్నీళ్లు పెట్టుకోవడం తను చూడలేదు. అదుర్దా పడ్డది వర్ధనం. అదిరింది.

"ఏమైందండీ" అడిగింది. గొంతులో బాధ ఉమ్మలు చుట్టుకుంటో దగ్గు రూపంలో బయటకు వచ్చింది. గుండెను కోస్తున్నట్టుగా ఉంది దగ్గు. గొంతును చీలుస్తున్నట్టుగా ఉంది దగ్గు. ఆమె కెళ్ళలుగా ఉమ్మింది. ఆత్రంపడి ఆమె వక్షాన్ని అదిమాడు జోగారావు.

నీళ్లు చిమ్మిన కళ్లు నాలుగూ కలుసుకున్నాయి. జత కళ్ళు గాఁథల్ని తెలపమంటున్నాయి. ఇంకో జత కళ్లు బాధల్ని నెమరేస్తున్నాయి.

"తెలిసో తెలియకో ఇన్నాళ్ళూ నువ్వూ, నేమా చిరంజీవిని లాలించి ఆడించాం. ఇకనుంచి అది మానుకుందాం. వాడ్ని నువ్వు చేరదియ్యకు. ముద్దుపెట్టుకోకు." చివరి రెండు మాటలూ శాసిస్తున్నట్టుగా పలికాడు జోగారావు.

అయోమయంఁగా ఉంది వర్ధనానికి ఈ పరిస్థితి అంతా.

"రాత్రి కోడలు పిల్ల చిన్నవాడితో ఏఁవని చెప్తోందో తెల్సా! ఎక్కువగా బిడ్డల్ని కని పురుళ్లు పోసుకుంటే ఆడది అనారోగ్యంగా తయారౌతుందట. ఆ వ్యక్తికి క్షయ రాగల అవకాశాలు హెచ్చట. నువ్వు...నువ్వు పదికి పైగా పురుళ్ళు పోసుకున్నావట. నీ దగ్గు... నీ వేషం క్షయరోగి లక్షణాలట. అంత

"ఈ ఒక్క రోజు మాత్రం సిగరెట్లూ, వాగుడూ మానేశాను లలితా" అన్నాను! అంతే నేప్పగా యిలా....!!



భయంకరమైన రోగం పెట్టుకుని పసి పిల్లల్ని చేరదీసి ముద్దులు పెట్టుకుంటే ఆ రోగం పిల్లలకీ అంటుతుందటే! అందుకనే..."

ఆ మాటలు వింటున్న వర్ధనం మెదడులో ముళ్లు దించుతున్నట్టైంది. గుండెల్లో గుండుసూదులు గుచ్చుతున్నట్టైంది.. విలవిలలాడింది. గంటన్నర క్రితం జరిగిన జట్టి-పరిస్థితి, అంతా తోలుబొమ్మలాటలా ఆమె కళ్ళముందు కదిలింది.

చిరంజీవికి నీళ్ళు పోసి, పౌడర్ రాసి-డ్రస్ చేసి, కాటుకపెట్టి, వాడ్ని మునుకుల్లో పెట్టుకుని ఆడిస్తోంది లావణ్య. వర్ధనం ఆ దృశ్యాన్ని చూసి ముచ్చటపడింది. నవ్వుతూ వచ్చి, అడిగింది, ముద్దు పెట్టుకుందికి చిరంజీవిని ఇమ్మని. లావణ్య విన్పించుకోనట్టుగా లేచి నిలబడింది. వర్ధనం మరో సారి అడిగింది. తర్వాత కదిలి వెళ్ళిపోతున్న కోడల్ని పట్టి, ఆపి, కసిరినట్టుగా అడిగింది పిల్లాడ్ని ఇయ్యమని. ఆ పాటికీ పిల్లాడ్ని అందియ్యలేదు లావణ్య రెచ్చిపోతున్నట్టై చిరంజీవిని లాక్కుందికి ప్రయత్నించింది వర్ధనం. 'వద్దు' అంటూ గట్టిగా కేకపెట్టినంత పనిచేసి ఆ ప్రయత్నాన్ని ఆపింది లావణ్య. నీరుగారిపోయింది వర్ధనం. "కారణం ?" అమాయకంగా అడిగింది.

"పిల్లాడు జడుసుకుంటాడు. ఏడుస్తాడు" సమాధానం ఇచ్చింది కోడలు. ఇన్నాళ్లూ లేంది ఈ రోజే! ఆశ్చర్య

పోయింది అత్తగారు. అదే మాట అడిగింది. జవాబు రాలేదు. పిచ్చిదై పోయింది వర్ధనం. నానా మాటలూ అంది. పెద్ద రగడ లేవదీసింది. అత్తా కోడళ్ళమధ్య అనుకోని విధంగా విజృంభించింది వైరం.

చిన్నవాడు శంకరం ఆఫీసునుంచి వస్తూ ఈ సన్నివేశాన్ని చూసి విస్తుపోయి వారించబోయాడు. ఎవ్వరూ చెవొగ్గలేదు. విన్పించుకోలేదు. విసిగి, కొంపంతే చీదరవేసి వాడు ఎక్కడికో వెళ్ళిపోయాడు. జోగారావు వద్దని ఎంత చెప్తున్నా వినక, ఎవరికివారే ఏకచ్ఛత్రాధిపతులుగా వ్యవహరిస్తుంటే– 'తనది' అన్న వస్తువుకి చెంప దెబ్బవేసి తగావు ముగించబోయాడు

అంతా అర్థమయ్యింది వర్ధనానికి. ఏడుపు వచ్చింది. పొరలు పొరలుగా దగ్గు కూడ వచ్చింది. పమిట కొంగు నోట్లో కుక్కుకొని దగ్గును అణుచుకోవడానికి ప్రయత్నించి, విఫలురాలై జోగారావుకి దూరంగా జరిగింది.

ఆప్యాయతతో దగ్గర కొస్తున్న భర్తని వద్దని వేడుకొంది. ప్రాతిమాలింది. విలపించింది. తర్వాత ఇద్దరికిద్దరూ ఒకర్నొకరు చుట్టుకుని ఏడ్చుకున్నారు. ఓదార్చుకున్నారు.

చీకటి బాగా పడ్డాక – నిద్రపోతున్న చిరంజీవిని భుజాన వేసుకుని ఇంటికి వచ్చింది లావణ్య. వస్తూనే అడిగింది.

"ఆయన వచ్చారా అత్తయ్యా" అంటూ.

లేదని చెప్పింది వర్ధనం. పిచ్చిబాబు అటూ చెప్పలేక ఇటూ చెప్పలేక మూగ రోదనతో ఎక్కడ – ఏ పార్కులో తిరుగుతున్నాడో ! అన్పించి బాధపడ్డది కొడుకుపట్ల.

వాలుకుర్చీలో కూర్చుని చుట్ట కాల్చుకుంటున్న భర్త తీరిగ్గా ఉన్నాడన్పించింది ఆ తల్లి మనసుకి. ఉండలేకపోయింది.

"చీకట్లో కూర్చుని చుట్ట కాల్చుకోకపోతే అలా పార్కుకో-పరంధామయ్యగారింటికో వెళ్ళి శంకరాన్ని వెదికి పెట్టకూడదు. వేళ పట్టుకు ఇంత తిండి వాడు కతికి ఆరోగ్యంగా ఉంటేనే, వాడి పెళ్ళానికి, పిల్లాడికీను దారి ఉండేది. ఉం కదల్లేం."

జోగారావు బయటకు నడిచాడు. వీధిలోనికి వెళ్తూ ఇంటివైపోసారి చూసి నవ్వుకున్నాడు.






"మీ అన్నయ్యకు బండి నడడటం అంతగా తెలిసినట్లులేదు. వెనక్కు రమ్మనండి సుషమా ! నేను నడుపు తాను. మా బావ బండిని దాటుకొని వెళ్ళిపోతుంది మన బండి," అంటూ చిన్నగా నవ్వుతున్న మాధవిని వెనక్కి తిరిగిచూసి, పౌరుషంగా తనూ లేచి నుంచుని చర్నాకోల తీసుకొని గట్టిగా కొట్టాడు, రెండు గిత్తల్నీ. మువ్వలు ఘల్లు ఘల్లున మ్రోగించుకుంటూ పరు గులుతీశాయి ఎడ్లు. ఆ పరుగుకు నిల దొక్కుకుని నిలబడటం కష్టంగా వున్నా పట్టుదలగా బండి పరుగులు తీయిస్తు న్నాడు శేఖర్. మరో రెండు ఫర్లాంగుల దూరం పోయేసరికి చంద్రం బండి వెనుక బడింది. శేఖర్ బండి ముందు కెళ్ళింది. అప్రయత్నంగా శేఖర్ చేయి సన్నటి మీసాలమీదకు పోయింది. ముఖాన ఓ గర్వ వీచిక తొంగిచూసింది. నవ్వుతూ వెనక్కి చూసిన శేఖర్ని చూసి 'అలా వుండాలి పౌరుషముంటే' అంటూ ఫక్కున నవ్వింది మాధవి. శిరీష్ శేఖర్లు సృతి కలిపారు. వెనక్కు తిరిగి చంద్రాన్నే చూస్తున్న సుషమ నవ్వుతోంది, కానీ వీళ్ళ మాటలు విని కాదు. చంద్రం కావాలని బండి నెమ్మదిగా చేయడం గమనించి తనలో తాను నవ్వుకుంది. చంద్రం దూరాలోచనతోనే బండి

నెమ్మదిగాతోలసాగాడు. శేఖర్ పౌరుషానికి పోయిబండి ముందుకుపరుగెట్టిస్తే అంతగా అలవాటులేని శేఖర్ బండిఎక్కడ బోల్తా కొట్టిస్తాడోనని భయమేసింది. అంతా ఆడపిల్లలున్నప్పుడు జాగ్రత్తగా వుంటే మంచిదని బండి నెమ్మదిగాచేసి శేఖర్‌కి దారిచ్చాడు చంద్రం. సుషమ కళ్ళతో కలిసిన చంద్రం కళ్ళు నవ్వుతున్నాయి.

మరో గంటలో అంతా తోటలో వున్నారు. ఆ రోజంతా రకరకాల ఆట లతో, మాటలతో, పాటలతో హాయిగా గడిచిపోయింది. మధ్యాహ్నం భోజనాల టైమ్‌లో తోటలో దుప్పట్లు పరిచి అంతా సర్దుతున్న మిగతా పిల్లలు సుషమను, "మీరేం చెయ్యక్కర్లేదు. అలా కూర్చోండి" అన్నారు. చంద్రం దగ్గరగా నడిచిన సుషమ ఎటో చూస్తూ ఆలోచనలో వున్న చంద్రంతో "నాకు మీ తోటంతా చూపించరూ ?" అంది. అప్పటికే శిరీష్ శేఖర్‌లు, ఎవరెవరు ఏమేమి తెచ్చారో కనుక్కుంటూ అవన్నీ రుచి చూస్తూ, ప్లేట్లలో సర్దిస్తున్నారు.

చంద్రం మరో మాట మాట్లాడే అవకాశంఇవ్వకుండా "అన్నయ్యా ఇప్పుడే వస్తామని" శిరీష్ వాళ్ళతో చెప్పి ముందుకు అడుగువేసిన సుషమను అప్రయత్నంగా అనుసరించిన చంద్రం మనసులో భయంగా ఏదో తెలీని గుబు లుగా ఉంది. శేఖర్, శిరీష్‌లు ఏమను కుంటారోనని మనసులో వున్నా సుషమ పిలుపును కాదనలేని ఏదో బలహీనత ఆమె ననుసరించేలా చేసింది. పది నిముషాల్లో గిర గిరా తోటంతా తిరిగారు. నిజంగా సుషమ తోట చూస్తోందా ? ఒక్కోసారి అలా రెప్పవేయకుండా నా ముఖంలో ఏం చూస్తోంది? ఆ కళ్ళతో ముడిపడ్డప్పుడు నా కళ్ళు విడివడలేక పోతున్నా యెందుకు? తనకంటే అన్ని విధాల ఉన్నతురాలు సుషమ. తను ఏ విధంగానూ ఆమె అంతస్థుకు చేరు కోలేడు. అయినా అన్నీ తెలిసినా, ఆ ఆకర్షణనుంచి తను తప్పుకోలేక పోతున్నాడు. వెనక్కు తిరిగి వాళ్ళంతా వున్న ప్రదేశానికి చేరుకునే సమయానికి అంత మౌనంగా వున్న చంద్రం భాష కందని భావోద్రేకంతో—

"సుషమా ! మీ రివ్వాళ చాలా అందంగా వున్నారు. అచ్చం మా వూరి అమ్మాయిలా వున్నారు" అన్నాడు నెమ్మదిగా వణుకుతున్న గొంతుతో.

సుషమ కళ్ళు చంద్రంవైపు తిరి గాయి ఆనందంగా. ఆ కళ్ళలో మరేదో భావాన్ని గ్రహించాలని ఆత్రపడుతోంది సుషమ మనస్సు. చిన్నగా నవ్వుతూ జడకుచ్చులు చేతిలోకి తీసుకొని, ఆ చూపుల నలాగే చంద్రం చూపులతో కట్టేసి నిలదీస్తున్నట్లే అడిగింది. "మీ మధుకన్నా అందంగా ఉన్నానా ?" అని. అనుకోని యీ ప్రశ్నకు చంద్రం ఓ క్షణం తెల్లబోయాడు. అంతలోనే

చిన్నగా నవ్వేస్తూ "నా కళ్ళు పెట్టుకొని చూడగలిగితే మీకే తెలుస్తుంది. పదండి, వాళ్ళంతా మనకోసమే ఎదురు చూస్తు న్నట్లున్నారు. అంటూ త్వరగా ముందుకు అడుగులు వేస్తున్న చంద్రం అడుగులో అడుగు వేస్తూ నడుస్తున్న సుషమ మనసు ఆనందంతో మయూర నాట్యం చేసింది.

తినడం ప్రారంభించడానికి సిద్ధంగా వున్నారు వాళ్ళంతా సుషమ, చంద్రం వెళ్ళగానే చెరో ప్లేటు ఇచ్చారు శాంతా, మాధవి. అప్పటికే అన్నీ వడ్డించి వుండటంతో అంతా కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు పూర్తిచేశారు.

భోజనాలైన తర్వాత"తర్వాత కార్య క్రమమేమిటి ?" అని అడిగిన శిరీష్‌కు, ఎవ్వరూ సమాధానం చెప్పలేదు కొందరు విశ్రాంతిగా అలా చెట్లకు ఆనుకొనే కళ్ళుమూసుకున్నారు. శిరీష్‌కు దగ్గరలో ఉన్న సుషమ "అదిగో నిద్ర పోవడం" అంటూ చెట్ల కానుకొని కళ్ళు మూసుకొన్న శాంతా, సరసులను చూపించింది. సుషమ మాటలతో ఓసారి నవ్వులతో నిండిపోయిం దా ప్రదేశం

దూరంగా ఓ చెట్టుకొమ్మన వున్న దోర మామిడికాయను కోయడానికి ఎగురుతున్న మాధవిని చూపించి, "కాదు సుషమా, మామిడికాయల దొంగ తనం యింక ఇప్పటి కార్యక్రమం" అన్నాడు శేఖర్. మళ్ళీ మరో మారు నవ్వులతో మారుమ్రోగిం దా ప్రదేశం

మాధవికి వీళ్ళ నవ్వులు, మాటలు విన్పించటంలేదు. అందని పండును అందుకోవాలని మహా పట్టుదలగా ఉంది. అలసిపోతోంది, పండు అందడంలేదు. ఓ క్షణం విశ్రాంతి తీసుకుని మళ్ళీ ఎగురుతోంది ఆ పండుకోసం. "పోనీ నువ్వెళ్ళి కోసివ్వరా పాపం." అన్నాడు శేఖర్ చంద్రాన్ని వుద్దేశించి "నాకు ఓపిక లేదురా ! భుక్తాయాసంగా వుంది. అంతగా పాప మన్పిస్తే నువ్వెళ్ళి కోసివ్వు. !" అన్నాడు ప్రక్కనేవున్న చెట్టుకు చేరగిలబడుతూ

"ఇప్పుడే వస్తా నుండరా"అని మళ్ళీ శిరీష్ వెంటబడకుండా ఆ మాటతో ఆపేసి లేచి మాధవిని అంతగా అవస్థ పెడుతున్న మావిడిచెట్టు దగ్గరకు చేరు కొని నెమ్మదిగా వెళ్ళి మాధవి వెనగ్గా నుంచొని, కొంతసేపు పైకి ఎగురుతూ ఆయాసపడుతున్న మాధవిని చూసి, చిన్నగా నవ్వుతూ "కోసివ్వనా ?" అన్నాడు.

గిరుక్కున వెనక్కు తిరిగిన మాధవి, శేఖర్ని అంత దగ్గర్లో చూసి సిగ్గుపడి పోయింది "ఎక్కడి కెళ్ళినా మామిడి తోటలన్నీ మావగారివే కావడం మీ అదృష్టం" అంటూ ఒక్కసారి పైకి ఎగిరి, కొమ్మ అందుకొని కాయకోసి మాధవి కిస్తూ, అంతటితో ఊరుకోకుండా

"కడుపునిండా భోంచేయలేదా? మావిడి కాయల కెగబడ్డారు" అన్నాడు చిలిపిగా నవ్వుతూ చురుక్కున చూసిన మాధవి కళ్ళలోని భావమేమిటో బోధపడక ముందే సమాధానం చెప్పింది నవ్వుతూ. "మీరు మిగిల్చితేకదూ, మా కడుపులు నిండటానికి!" అని.

"నేను మిగిల్చింది తింటారని తెలిస్తే మిగిల్చేవాడినేనే ..." అన్నాడు శేఖర్ అంతకంటే కొంటెగా మాధవి కళ్ళలోకి చూస్తూ.

ఆ చూపుల్లో వున్న ఆరాధన మాధవిని ఓ క్షణం మైమరచి శేఖర్ కళ్ళలోకి చూసేలా చేసింది. అంతలోనే కళ్ళు వాల్చేసుకుంది బలవంతంగా.

"మొట్టమొదటిరోజే ఆ కళ్ళలోని ఏదో అయస్కాంతశక్తికి కట్టుబడి పోయిన శేఖర్ మాధవితో మనసువిప్పి మాట్లాడమని మనసుచేసే అల్లరిని చంద్రాన్ని చూసి కంట్రోలు చేసుకుంటూ వచ్చాడు కానీ ఈ రోజు మాధవికళ్ళలో కనిపించిన ఆ మెరుపు, చూపులు తిప్పేసుకోవడంలోని ఆ బెదురు చూసిన తర్వాత ఎందుకో మాధవి తనకోసమే యీ వూరొచ్చిందని, తమది ఈ జన్మ అనుబంధం కాదని జన్మజన్మలుగా తామిలా కలిసే వుండేవారనీ, అసలు మాధవిని తానింతక్రితమే చూశానని" గట్టిగా అన్పించింది అలాగే మైమరచి మాధవినే చూస్తూ కలల అలలపై తేలి పోతున్న శేఖర్ వైపు కళ్ళెత్తిచూసి "ఇది కలకత్తాకాదు శేఖర్ బాబూ! కళ్ళు కొంచం కంట్రోల్‌లో పెట్టుకోండి," అని నవ్వుతూ ముందుకు సుషమ వాళ్ళున్నవైపు పరుగెడుతున్న మాధవినే చూస్తూ నుంచొని, మొట్టమొదటిసారిగా తనపేరు అంత మధురంగా విన్పించిన మాధవి గొంతును, వీణ మీటినట్లు పలికిన ఆ గొంతులోని మాధుర్యాన్ని పదే పదే తల్చుకుంటూ, వాళ్ళంతా వున్న చోటుకు చేరుకున్నాడు శేఖర్.

ఏవో జోకులు విసురుకుంటూ మామిడిచెట్లమధ్య కులాసాగా నవ్వు కుంటూ కొంతసేపు కాలక్షేపం చేశారు. అంతలో ఓ పాట పాడమని సరసు అడిగింది మాధవిని.

"మధూ పాడతారా! ప్లీజ్ మాధవీ పాడరూ" అంటూ అడగటం మొద లెట్టింది సుషమ. మరీ బ్రతిమిలాడించు కోకుండానే మొదలుపెట్టి, రెండుపాటలు పాడింది. శిరీష్‌కూడా కొన్ని భావ గీతాలు పాడాడు. చంద్రం అడక్కుండా వుండలేకపోయాడు "సుషమా! మీరూ ఒక పాట పాడకూడదూ!" అని. ఒకళ్ళు మొదలుపెడితే, యింకా అంతా గొడవే, పాడండి, ఒక్కపాట పాడండి, అంటూ. చివరికి సుషమకూడా పాడింది. ఒక హిందీపాట, ఓ బెంగాలీపాట పాడి విన్పించింది. పాట అంతగా అర్థంకాక పోయినా గొంతులోని ఏదో ఆకర్షణ

శక్తి అందర్నీ ఆకట్టుకుంది. పాట అంతమంది పాడినా అందర్లోకీ ప్రత్యేకంగా కన్పించిందీ, అందర్నీ మైమరపించిందీ మాధవి పాడిన కృష్ణశాస్త్రిగారి పాటలే...

పాటల ప్రోగ్రాం అయిన తర్వాత అంతా బయలుదేరి మళ్ళీ తోటమీద పడ్డారు. ఎవరు కోరిన కాయలు వాళ్ళు కోసుకొని తిన్నారు.బుట్టనిండా పళ్లున్నా అవెవరూ ముట్టుకోలేదు. తమకు కావల్సినవి తామే కోసుకొని తినడంలో అదో ఆనందం. అల్లరిగా ఒక పండుకోసం యిద్దరిద్దరు పోటీపడటం, చివరికది ఏ ఒక్కరికో దక్కటం, రెండోవాళ్ళు మూతి ముడుచుకోడం, మళ్ళీ అంతలోనే ఆ పండు లాక్కొని పరుగెత్తటం, యిలా యిష్టమొచ్చినంతగా ఆటలతో, అల్లరితో గడిపి, కొంతదూర మలా నడుస్తూ వెళ్ళిన సుషమ, చూడాలనుకున్న ప్రకృతి దృశ్యాలు ఒక్కొక్కటే చూస్తూ, ఆ పల్లెమీద, ఆ పల్లెలో పుట్టి పెరిగి, తన నాకర్షించిన చంద్రం మీద అంతు తెలీని అభిమానాన్ని పెంచుకుంది.

సాయంత్రం చల్లబడేవరకూ యిష్టమొచ్చినట్లు తిరిగి చిన్నపిల్లల్లా గంతులువేసి, మధ్య మధ్య చిలిపి తగవులతో, అలకలతో మళ్ళీ రాజీపడిపోవడంతో యింక వెళ్ళిపోదామనే ఏకాభిప్రాయానికి వచ్చి నెమ్మదిగా బళ్లెక్కి యిళ్ళకు చేరుకున్నారు.

## 2

గంగాపూర్ కావడానికి బెంగాల్ ప్రాంతమే అయినా ఆ ఊళ్ళో తెలుగు వాళ్ళే ఎక్కువ. అంతా ఎప్పుడో ఆంధ్రదేశంనుంచి అక్కడికి వెళ్ళి సెటిలైనవాళ్ళే. కొందరు బెంగాలీస్ కూడా లేకపోలేదు. అయితే అంతా చాలా కలివిడిగా వుంటారు. అందరికీ బెంగాలీ వచ్చు. అయినా తమ మధ్య బెంగాలీ వాళ్ళు తక్కువ వుండటంవల్ల, అంతా తెలుగే మాట్లాడతారు. భాషేతరప్రాంతం వచ్చినా, అక్కడ స్థిరపడిపోయినా, తెలుగుదనంలో వున్న తీపి దనాన్ని నలుగురికీ పంచుతూ, నలుగురితో కలిసి మెలిసి తిరుగుతుండటంవల్ల వాళ్ళ మధ్య స్వ పర భేదాలు లేవు. అందుకే బెంగాలీ అమ్మాయిలైన ఇందిర, రమ కూడా మాధవి వాళ్ళతోపాటు పిక్నిక్ ప్రోగ్రాంలో స్వేచ్ఛగా పాల్గొన్నారు. అంతేకాదు వీళ్ళు బెంగాలీ మాట్లాడినంత స్వేచ్ఛగా, స్వచ్ఛంగా వాళ్ళూ తెలుగు మాట్లాడటం నేర్చుకున్నారు. అందువల్ల వాళ్ళ స్నేహానికి భాష, జాతి అడ్డు రాలేదు. వాళ్ళలో ఎవరూ హెచ్చు తగ్గులు ఆలోచించరు. స్నేహానికి అవి అవసరంలేదు కూడా.

మరో వారంరోజులు, శిరీష్, సుషమ గంగాపూర్‌లోనే వున్నారు. ఆ వారం

రోజులూ క్షణాల్లా గడిచిపోయాయి. ఈలోపు సుషమ శాంతను చూసే మిషతో చంద్రం వాళ్ళింటికి రెండు మూడుసార్లు వెళ్ళడం, చంద్రంతో మాట్లాడాలని ప్రయత్నించడం జరిగింది. మాట్లాడింది కూడా, అవకాశం చూసుకొని. చంద్రం సుషమతో మాట్లాడుతున్నప్పుడు అతని కళ్ళు ఆరాధనాభావంతో మెరుస్తుండేవి. కానీ మరుక్షణం సుషమకూ, తనకూ మధ్య నున్న దూరం జ్ఞాపకం వచ్చి కలవర పడిపోయేవాడు. అందని గగన కుసుమంకోసం అర్రులు చాచడం వెర్రితన మౌతుందేమోనని బాధపడే వాడు.

చిన్నప్పటినుంచీ కోరిందల్లా పొంద గల్గిన సుషమకు ఈ కోరికూ్కడా అసాధ్య మన్పించలేదు. ఈ కోరిక కూడా డాడీతో చెప్పి అవలీలగా తీర్చు కోగలనన్న నమ్మకంతో చంద్రంతో స్వేచ్ఛగా మనసు విప్పి మాట్లాడేది. స్కూల్ ఫైనల్ తో చదువాపేసినా చంద్రం, మంచి మంచి పుస్తకాలు చదివేవాడు. కలకత్తా ఎవరు వెళుతున్నా మంచి పుస్తకాలు తెప్పించుకొని చదవడం వాటిని శ్రద్ధగా, నీట్ గా ఓ బీరువాలో భద్రంచేయడం, అలవాటు చేసుకున్నాడు. అతని చిన్న లైబ్రరీలో వున్న ఆ పుస్తకాలు చూసి సుషమ ఆశ్చర్యపోయింది. తను చదవని ఎన్నో గ్రంథాలు, నవలలు మంచి మంచి సెలక్షన్స్ యింగ్లీష్ నవలాలోకంలో పేరెన్నికగన్నవారి రచన లెన్నో వున్నాయి. అవన్నీ చూసిన సుషమ అతని అభిరుచిని అభినందించకుండా వుండలేకపోయింది. శాంతా, మాధవీ కూడా సుషమకు మంచి ఫ్రెండ్స్ అయ్యారు. వాళ్ళిద్దరినీ ఓసారి కలకత్తా రమ్మని ఆహ్వానించింది.

ఆ రోజు సాయంత్రం గంగాతీరాన కూర్చొని కబుర్లు చెప్పుకుంటున్నప్పుడు "నాకూ కలకత్తా చూడాలనే వుంది. అన్నయ్య తీసుకొస్తే వస్తా" నంది శాంత. మాధవి మౌనంగా వుండి పోయింది. "ఏం మధూ నువ్వు మాట్లా డవేం ! నువ్వొప్పు డొస్తావు కలకత్తా ?" అంది సుషమ తలవంచుకు కూర్చున్న మాధవి చుబుకం పట్టుకొని పైకి లేపుతూ. మాధవి కళ్ళనిండుగా నీళ్ళు న్నాయి. "అరే ! యిదేమిటి ? నే నేమన్నానని ! ఎందు కేడుస్తున్నావు మాధవీ ?" అంది సుషమ గాభరాగా. మాధవి కళ్ళు తుడుచుకుని "ఏమీ లేదు ... ఏమీ లేదు సుషమా ! మళ్ళీ రేపు కలుస్తాను" అంటూ ఎవరో తరుముతున్నట్లే పరుగెత్తింది పల్లె వైపు.

మౌనంగా కూర్చున్న శాంతవైపు ప్రశ్నార్థకంగా చూసింది సుషమ. శాంత నెమ్మదిగా మొదలుపెట్టింది...

"మధువాళ్ళు అసలు మొదట కలకత్తా లోనే వుండేవాళ్ళు. అక్కడే వాళ్ళమ్మ గారు పోయారు. శ్యాం పుట్టిన కొద్ది కాలానికే అత్తయ్య పోవడంతో యింట్లో ఓ ఆయాను పెట్టుకొని, ఎలాగో శ్యాంను పెంచుతూ, మాధవిని స్కూలుకు పంపుతూ, తన ఉద్యోగం తను చేసుకుంటూ పిల్లల కే కష్టం లేకుండా చూసుకొనేవారట శ్రీరాం మావయ్య. వాళ్ళకు పెద్దగా ఆస్తి పాస్తు లేంలేకపోయినా, జరుగుబాటుకు తక్కువకాని జీతం వుండటంతో, ఎలాగో వాళ్ళకు హాయిగానే జరిగి పోతుండేది.

వాళ్ళ దురదృష్టమేమో ! భగవం తుడు వాళ్ళు ఆ మాత్రం సుఖంగా వుండటం కూడా చూడలేకపోయాడేమో! ఓ రోజు హడావిడిగా ఆఫీసుకు వెళ్ళే తొందరలో ట్రామెక్కి వెళుతున్న శ్రీరాం మావయ్యను, ఆ త్రొక్కిడిలో ట్రామ్ కదులుతుండగానే, ఎవరో ముందుకు తోశారట. సమయానికి మావయ్య వాళ్ళ ఆఫీసులో పనిచేసే తను ప్రక్కనే వుండటంతో వెంటనే ఆయన్ని ఆస్పత్రిలో చేర్చి, పిల్లలకు కబురంపించారు. మధు కూడా చిన్నదే ఏం తెలుస్తుంది ? ఏం చేయగల్గుతుంది ? తమ్ముడు శ్యాంను, ఆయాను తీసుకొని ఆస్పత్రికి పరుగెత్తింది ఏడుస్తూ. అప్పటికే మావయ్య పరిస్థితి ప్రమాద కరంగా వుంది. ఆ పరిస్థితుల్లో కూడా ఆయన ఆత్మస్థైర్యాన్ని కోల్పోలేదు. కానీ పిల్లల గురించే విపరీతంగా బాధ పడ్డారట. గోపాలం బాబాయితో చాలా రోజులుగా మాటలు లేకపోయినా మిగిలిన బంధువు, అత్తయ్యకు ఆత్మీ యుడు ఆయనే కనుక బాబాయికి వెంటనే టెలిగ్రాం యిప్పించి, ఆయన వెళ్ళగానే మధును, శ్యాంను కన్నీళ్ళతో బాబాయి చేతుల్లో పెట్టి కళ్ళు మూశారట శాశ్వతంగా.

చెల్లెలు వుండగా కూడా గోపాలం బాబాయి కలకత్తా వెళ్ళినా వాళ్ళింటికి వెళ్ళేవాడు కాదు. కారణం సీత అత్తయ్య గోపాలం బాబాయికి యిష్టం లేకుండా శ్రీరాం మావయ్యను ప్రేమించి, పెళ్ళిచేసుకుందట. అదీ ఆమె చేసిన పాపం. చివరికి చెల్లెలు చనిపోయిందని టెలిగ్రాం వచ్చిన రోజు కూడా ఇక్కడే వుండి మూడురోజులు నిద్రాహారాలు మాని బాధపడ్డాడే గాని, వెళ్ళి చెల్లెలి పిల్లలనైనా చూడలేదు. అంతిష్టమైన చెల్లెలి కబుర్లు ఎప్పటి కప్పుడు ఎలాగో తెలుసుకుంటుండే వాడే కాని స్వయంగా ఎప్పుడూ మళ్ళీ తను వాళ్ళ గుమ్మంలో కాలు పెట్ట లేదు. అంత పట్టుదల గోపాలం బాబాయికి.

హఠాత్తుగా మాధవి పేరుతో వచ్చిన టెలిగ్రాం "నా హృదయం పాషాణం,

యిది కరగదు" అనుకున్న గోపాలం బాబాయి హృదయాన్ని కరిగించింది ఇక్కడినుంచి కలకత్తా కదిలించింది. ఒంటరిగా వెళ్ళిన బాబాయి పిల్లలిద్దర్నీ వెంటబెట్టుకొని తిరిగి వచ్చాడు. పాపం! కాలేజిలో చేరాలి, డాక్టరవ్వాలి," అని కలలు కంటున్న మధు అనుకోకుండా, అగమ్యంగా మారిన పరిస్థితులకు లొంగి ఎన్నడూ చూడని ఓ మావయ్య పంచన తలదాచుకునేందుకు యీ మా పల్లెటూరికి రావల్సి వచ్చింది. అప్పుడే మధు వచ్చి సంవత్సరం దాటిపోయింది. కొంతవరకు, ఆపేక్షగా చూసే గోపాలం బాబాయి ప్రేమలో అన్నీ మర్చిపోతుందనే చెప్పవచ్చు. కానీ 'కలకత్తా' అంటే ఓ రకమైన భయంగా, బాధగా ఇద్దరు అత్యంత ఆత్మీయుల్ని పోగొట్టుకున్న ప్రదేశంగా మధు మనస్సులో నాటుకుపోయింది. అంతేకాదు అక్కడే పుట్టి పెరిగి, స్కూల్‌ఫైనల్ వరకూ చదివిన ఆ ఊరి జ్ఞాపకాలు కూడా మధుని బాధపెట్టవచ్చు అందుకే అలా పారిపోయిందది," అంటూ మధు వెళ్ళిన వైపే చూస్తున్న శాంత గొంతు ఆర్ద్రమవడం గమనించింది సుషమ అంతవరకూ మౌనంగా, మధును గురించిన విషయాలన్నీ విన్న సుషమ మనస్సు మధుమీద జాలితో, సానుభూతితో నిండిపోయింది. అనవసరంగా కలకత్తా జ్ఞాపకంచేసి మధు మర్చిపోతున్న విషాదమైన గత జ్ఞాపకాల్ని మళ్ళీ కెలికినట్లయిందని, తనలో తాను బాధపడింది సుషమ.

ప్రశాంతంగా, నిర్మలంగా ప్రవహిస్తున్న గంగానది వైపే చూస్తూ ఆలోచనల్లో పడ్డ సుషమ, శాంత లేచి "పద సుషమా ! ప్రొద్దు గూకుతోంది" అన్నమాటతో నెమ్మదిగా లేచి శాంత చెయ్యందుకొని మౌనంగా ముందుకు సాగింది వాళ్ళతోపాటు ఆలోచనలూ సాగాయి ఏ చీకూ చింతా లేనిదానిలా నవ్వుతూ, నవ్విస్తూ తిరిగే మాధవి మనసులో అంత బాధ దాచుకొని వుందని ఎవ్వర్నూ ఊహించలేరు అన్ని బడబాగ్నులూ తనలో దాచుకొని ప్రశాంతంగా, నిర్మలంగా పారే పవిత్ర గంగానదికీ, మధుకూ చాలా దగ్గర పోలిక లున్నట్లుగా అన్పించింది సుషమకు

ఆవేళే సుషమ, శిరీష్ బయలుదేరుతున్నారు. శ్యామలాదేవికీ, రఘుపతి గారికి సుషమను కలకత్తా పంపించాలంటే తమ కన్నకూతుర్ని అత్తవారింటికి పంపుతున్నట్లుగా బాధపడిపోతున్నారు పదిహేనురోజుల్లో, సుషమ వాళ్ళింట్లో అమ్మాయిగా, గారాల కూతురిలా మెసిలింది శ్యామలాదేవి సుషమకు తల్లిప్రేమ ఎంతటి స్వార్థరహితమో ! ఎంతటి తీయనో రుచి చూపించారు. నిజంగా ఆ ఆత్మీయుల్నీ

ఆ పచ్చటి పంట పొలాల్నీ ప్రతి సాయంత్రం షికా రెళ్ళి అనుభవించిన అందాల గంగానదీ తీరశోభను అక్కడి చల్లని ప్రశాంతమైన పిల్లవాయువుల్నీ, అతి తక్కువ వ్యవధిలో అత్యంత సన్నిహితులైన మాధవినీ, శాంతనూ ముఖ్యంగా పోగొట్టుకున్నట్లు అని పించింది సుషమకు.

ఎంతమంది కాలేజి స్టూడెంట్స్‌కో ఊహాసుందరిగా మెదిలి, ఎవ్వరినీ దరిదాపుల్లోకి చేరనివ్వని సుషమ మనస్సును తనవైపు అయస్కాంతంలా ఆకర్షింపజేసుకున్న చంద్రాన్ని... వదిలి పోవాలంటే సుషమకు తీరని వ్యథగా వుంది. "మళ్ళీ ఈ ప్రశాంత ప్రకృతి శోభలో ఐక్యమవగల రోజు ఎప్పు డొస్తుందో ?" అని తల్చుకుంటూ ... వెంటనే బయలుదేరి రమ్మని వ్రాసిన డాడీ మాట జ్ఞాపకం వచ్చి, తప్పని సరిగా శిరీష్‌తోపాటు బయలుదేరింది సుషమ. ఇంకో గంటలో వాళ్ళు బయలు దేరుతా రనగా మాధవి పరుగెత్తుతూ వచ్చింది.

తొందరగా రావడంవల్ల ఆయాస పడుతున్న మాధవిని చూసి సుషమ నవ్వుతూ, మంచినీళ్లు తెచ్చి యిచ్చింది. గటగటా నీళ్ళు త్రాగేసి గ్లాసు ప్రక్కన పెట్టి, నెమ్మదిగా పవిటచాటున దాచి తెచ్చిన తెల్లని సన్నజాజుల మాలను సుషమ చేతుల్లో పెట్టింది మాధవి. మాధవి హృదయంలా, స్వచ్ఛంగా మాధవి వేసుకున్న వోణీలా తెల్లగా, మాధవి స్నేహమాధుర్యంలా సుగం ధాలు చిందే ఆ పూలను, ముఖ్యంగా తనమీద ఆపేక్షతో పూవులన్నీ చక్కటి మాలగా కట్టి తెచ్చిన ఆ మాల వెనుక మెదిలే మాధవి మృదు హృదయాని గ్రహించిన సుషమ, చిరునవ్వుతో మాల మాధవి చేతి కిచ్చి "నువ్వే పెట్టు మధూ ?" అని వెనుదిరిగి కూర్చుంది

శ్యామలాదేవి అందంగా అల్లిన పొడవైన జడలో చక్కగా పూలు అమర్చి, చటుక్కున సుషమను తన వైపు తిప్పుకొని బుగ్గన ముద్దుపెట్టు కుంది సుషమ ఊహించని పనిచేసి అల్లరిగా నవ్వుతున్న మాధవిని చూసి సిగ్గుపడింది సుషమ. అంతటితో ఊరు కోకుండా మాధవి నెమ్మదిగా సుషమ చెవిలో చెప్పింది. "పూలుమట్టుకు నేను తెచ్చాను. రెండోది మా బావ తరఫున నే నిచ్చాను," అంటూ కొంటెగా నవ్వు తున్న మాధవిని చూసి తెచ్చిపెట్టు కున్న కోపంతో మధు వీపున ఒక్క టిచ్చింది సుషమ.

మొదటినుంచీ సుషమ, చంద్రాలను కనిపెట్టిన మాధవి ధైర్యంగా ఆ మాట అనడానికి తగినంత కారణం లేకపో లేదు. ఆ ముందు రెండురోజుల్నుంచీ చంద్రం పొలం వెళ్ళలేదు. ఆ స్తమానం గదిలో పడుకొని పైకి చూస్తూ ఏవో

ఆలోచనల్లో మునిగి వున్నాడు. పుస్తకాలు కూడా చదవడంలేదు. ఏవిటో ఆ తెగని ఆలోచనలు ఎవరికీ అర్థం కాలేదు. కదిలించి, కవ్వించాలని వెళ్ళిన మాధవిని, శాంతను కూడా కసురుకున్నాడు. బావ సరదాగా లేకుండా అలా వుంటే ఎలాగో వుంది మాధవికి. ఇదికాదు ఉపాయమని గదిలోనుంచి బయటకు వచ్చి..."రా సుషమా! అలా నిలబడిపోయావేం ? పద మా యింటి కెళ్దాం" అంటూ ముందుకు అడుగు వేసిన మధుని ప్రక్కకు తోస్తూ ముందుకు వచ్చాడు చంద్రం. కానీ అక్క డెవరూ లేరు. మరి మరి సుషమ వచ్చినట్లు మాట్లాడింది మధు. మధు వైపు చూసేసరికి పవిటచెంగు నోటికి అడ్డంపెట్టుకొని నవ్వుతోంది. చంద్రానికీ నవ్వాగలేదు. తన తొందరపాటుకు సిగ్గుపడ్డాడు కొద్దిగా. "కొంటెపిల్లా !" అని మధు నెత్తి నో మొట్టికాయవేసి, నవ్వుతూ లోపలి కెళ్ళాడు. ఆ సాయంత్రం శాంతను పంపి, సుషమను గంగాతీరానికి పిలిపించింది మాధవి. నెమ్మదిగా చంద్రం దగ్గిరచేరి "బావా ! అలా ఎంతసేపు యింట్లో కూర్చొని వాసాలు లెక్కపెడతావు ? ఎలాగూ యీ యిల్లు నీకు చెందిందే. ఎందు కొచ్చిన శ్రమ చెప్పు ? వెళ్ళి అలా గంగాతీరాన, గాలైనా పీల్చుకో కూడదూ" అంది

రెండురోజుల్నించి ఎటూ కదల్లే దేమో, ఆలోచనలతో బుర్ర వేడెక్కి పోయిన చంద్రం, "శిరీష్ వాళ్ళు రేపే కదూ వెళ్ళేది. వాళ్ళూ వచ్చే వుంటారు" అని లేచి చెప్పులు వేసుకొని బయలుదేరుతుంటే ... "వాళ్ళు జమీం దారుగారి తోటవైపు వెళ్ళారు బావా ! త్వరగా వెళ్ళు" అని సంకేతం ప్రకారం చంద్రాన్ని పంపి, పది నిముషా లాగి వెనకే తనూ బయలు దేరింది.

చంద్రం అక్కడికి వెళ్లేసరికి తోటకు ఫర్లాంగుదూరాన యిసుకలో, నదికి అభిముఖంగా కూర్చున్న శాంత, సుషమ కన్పించారు. ఉత్సాహంగా అడుగులు ముందుకువేసి వాళ్ళను చేరుకున్నాడు. సుషమ పలకరింపుగా నవ్వింది. వాళ్ళ దగ్గరలో కూర్చుంటూ "శేఖర్, శిరీష్ ఏరీ ?" అన్నాడు. సుషమ నెమ్మదిగా చెప్పింది. "ఇవాళ అన్నయ్యలిద్దరూ పొలం వెళ్ళారు ! అక్కడ గోపాలంగారికి విత్తనా లవీ ఎలా వేయించాలో వివరించడానికి" అంది. మౌనంగా నవ్వి ఊరుకున్నాడు చంద్రం. వాళ్ళమధ్య మాటలు సాగటం లేదు. అప్పటిదాకా ఏవేవో కబుర్లు చెబుతున్న శాంత కూడా ఠక్కున నో రెవరో మూసేసినట్లే మూగిదానిలా వుండిపోయి, అన్నయ్య వచ్చిన దారి వైపు చూస్తోంది

ఇంతలో మాధవి శాంతను పెద్దగా పిలుస్తూ వచ్చింది, "అత్తయ్య నిన్ను త్వరగా రమ్మంది శాంతా" అంటూ. దిగ్గున లేచింది శాంత. సుషమ యిబ్బందిగా కదిలింది. వాళ్ళిద్దరూ బయలు దేరడం చూసి మాధవి సుషమవైపు తిరిగి "నువ్విక్కడే వుండు. మేమిద్దరం మళ్ళీ పదినిముషాల్లో వచ్చేస్తాం" అంది నెమ్మదిగా నవ్వుతూ. "ఊహూ, నేనూ వచ్చేస్తాను," అంటూ లేచింది సుషమ. చంద్రం ముఖం ఒక్కసారి దివిటీలా వెలిగి, సుషమ లేవడంతో చిన్న బోయింది. మాధవి, సుషమను మళ్ళీ యిసుకలోకి తోసి, "నిన్నెవరూ ఎత్తుకు పోరు లేవోయ్. అయినా హీరోలా యింతటి మా బావ అండ వుండగా నీకేం భయం ?" అంటూ శాంత చేయి పట్టుకొని లాక్కుపోతూ, "మళ్ళీ వచ్చేస్తాం యిప్పుడే. యిక్కడే వుండు !" అని ఓ హెచ్చరిక జారీచేసి మరీ వెళ్ళింది.

సుషమ, చంద్రం ఎన్నాళ్ళుగానో కోరుకుంటున్న ఏకాంతం లభించింది. కాదు లభింపజేసింది మాధవి. కానీ వాళ్ళకు మాటలు దొరకడంలేదు. ఒకరి వైపొకరు అలా చూస్తూ కూర్చున్నారు. ఆ కళ్ళలో కోటి భావాలు, విడివడని ఆ చూపుల్లో శతకోటి కోరికలు. అలా ఎంతసేపు కూర్చున్నారో తెలియదు. నెమ్మదిగా చంద్రం భంగపరిచాడా నిశ్శబ్దాన్ని

"రేపు వెళ్ళిపోతున్నారు కదూ సుషమా ?"

చూపు మరల్చకుండా చంద్రాన్నే చూస్తూ "ఊ" అంది. ఆ 'ఊ' అనే శబ్దంలో యిక రేపు తర్వాత చంద్రాన్ని చూడలేననే బాధంతా ధ్వనించింది. చంద్రమే చేతులు చాపాడో ... సుషమే అతని చేతుల్లో వాలిపోయిందో చెప్పడం కష్టం, వాళ్ళిద్దరూ ఏకమయ్యారు. పరిసరాల్ని మరచి, ప్రకృతిని మరచి, హెచ్చుతగ్గుల తారతమ్యాల్ని, యీ ప్రపంచాన్నీ విడిచి, చిక్కబడుతున్న చీకటిలో కలిసి, ఒకరి గుండెలను మరొకరికి విన్పించేంత దగ్గిరగా హత్తుకుపోయారు. అప్పుడు వాళ్ళిద్దరి మనసుల్లో ఒక్కటే అనుకున్నారు. "ఈ కలయిక శాశ్వతమైనది. దీన్ని విడదీయగలశక్తి యీ ప్రపంచంలో ఎవ్వరికీ లేదు" అని.

అలా ఎంతసేపు వున్నారో, మరింకెంతసేపు వుండేవారో కానీ అప్పుడే వచ్చి, ఒక్కటై కన్పిస్తున్న యిద్దరినీ దూరంనుంచే చూసి సిగ్గుతో అటు తిరిగి "సుషమా ! ప్రొద్దుగూకింది, వెళ్ళి పోదాం రా !" అంటూ కేకేసింది మాధవి. ఆ పిలుపుతో యీ లోకంలోకి వచ్చిన సుషమ, చంద్రాన్ని వదిలి దూరంగా జరిగింది. జరిగిందేమిటో గ్రహించే లోపల యిద్దరూ సిగ్గుపడి

పోయారు. "వెళతాను" అని లేచిన సుషమ చేయి నెమ్మదిగా నొక్కి పెదవుల కంటించుకొని నవ్వుతూ వదిలేశాడు చంద్రం. హడావుడిగా పరుగెత్తి మధుని కలిసి వెళ్ళిపోయింది సుషమ.

దారిలో యిద్దరూ మాట్లాడలేదు. సుషమను వాళ్ళింటిదగ్గిర వదిలేసి వెళ్ళిపోయింది మాధవి. మనసంతా ఎలాగో వుంది మాధవికి. వచ్చేటప్పుడు వెనుదిరిగి బావను చూడాలని ప్రయత్నించి సిగ్గువల్ల చూడలేకపోయింది. సుషమ, చంద్రం ఒకరంటే ఒకరు యిష్టపడుతున్నారని అర్థమైన తర్వాత, వాళ్ళిద్దరినీ కలపాలని తన కెందు కన్పించిందో అర్థంకాలేదు. చివరికి వాళ్ళిద్దర్నీ కలిపి వాళ్ళు ఒక్కటిగా వుంటే చూసిన తన మనసులో గుబులేమిటో అర్థం కాలేదు. చంద్రం బావంటే అభిమానముంది. మొదటినుంచీ చంద్రంకూడా శాంతతోపాటు మాధవినీ ఆపేక్షగా చూస్తూ, మరదలు కనుక అల్లరిపెట్టేవాడు. ఆ అల్లరి వెనుక అంతు తెలీని ఆపేక్ష తప్ప మరేమీ లేదని తెలిసిన మాధవి కూడా అతన్ని అల్లరిపెడుతుండేది. కొంటె సమాధానాలు యిస్తుండేది. వాళ్ళ వాదనల్లో అదో తెలీని సంతోషం కల్గేది. ఊళ్ళో వాళ్ళందరూ బహుశా చంద్రం, మాధవిని పెళ్ళిచేసుకోవచ్చేమో! అనుకుంటున్నారు అసలైన పెద్దలు రెండిళ్ళలోనూ ఏమీ బయటపెట్టుకోలేదు. అంతా కలసి ఆప్యాయంగా మాట్లాడుకుంటున్నారు. అభిమానంగా వుంటున్నారు అంతే... గోపాలంగారు మాధవిని పెళ్ళిచేసుకునే ప్రసక్తి చంద్రందగ్గిర ఎప్పుడూ తీసుకురాలేదు. ఆయన కింకా మధు పెళ్ళి ఆలోచన వచ్చినట్లులేదు.

శిరీష్‌తో సరదాగా కాలం గడిచిపోయింది. తను నవ్వుతూ అందర్నీ నవ్వించే శిరీష్ అంటే దాదాపు అందరూ యిష్టపడ్డారు. అలాగే తనూ, అంత కంటే అతనంటే ప్రత్యేకత ఏమీలేదు. చంద్రం బావంటే చనువుగా ఓ ఆత్మీయుడిలా తనకు లేని అన్నయ్యలా అన్పిస్తాడు. అంతకంటే అతనితో వున్నప్పుడు, అతనితో మాట్లాడినప్పుడు, అతన్ని చూసి, తన మనసు మరోలా పులకించలేదు. శేఖర్ ?... ఆ ఊహ రాగానే మాధవికి పిక్నిక్ రోజు తను తండ్రి ఎంతో యిష్టంగా దగ్గిర కూర్చొని నేర్పించిన కృష్ణశాస్త్రి గారి భావగీతాలు పాడుతున్నప్పుడు రెప్పవాల్చకుండా తననే చూసిన శేఖర్ కళ్ళలో మెదిలాడు. అంతమంది వున్నారనే ధ్యాసైనా లేకుండా ఆరాధనా భావంతో, ఆర్తిగా చూసిన ఆ చూపుల్లోని ఆకర్షణకో కరిగిపోయి వుండేది మాధవి. తన ప్రక్కన కూర్చున్న వాళ్ళందరి జ్ఞాపకమూ లేకపోతే .



యువ

అదృష్టవశాత్తూ తనను తాను కంట్రోల్ చేసుకోగల్గింది. కానీ ఏవిటిది ? తన ఆలోచన ఎంత అర్థరహితమైంది ? ఎంత అసంభవమైంది. కనీసం ఊహించడానికి కూడా తన కర్హతలేని ఓ రాజకుమారుడిని గురించి తన మనసు యిలా వెర్రిగా పులకించడ మేమిటి ? దిక్కులేక మావయ్య పంచను చేరిన తనెక్కడ ? శేఖ రెక్కడ ? తరతరాలుగా పేరెన్నికగన్న జమీందారీ వంశానికి ఏకైక వారసు డతను. మావయ్య ఆశ్రయంలో తనూ, తమ్ముడూ ఎలాగో చీకూ, చింతా లేకుండా కాలం గడప గల్గుతున్నారు. అదే పదివేలు. అదే ఓ వరంలా భావించే తను శేఖర్ని గురించి తీరని కలలు గనటం ఎంత హాస్యాస్పదమో ? కానీ ...ఊహలోనే ఎంతో మధురంగా అన్పించే అతని సాన్నిధ్యంలోని లాలిత్యం శాశ్వతం కాగల్గితే ఎంత బావుండును ? ఊహించుకోవడంవల్ల తనకు కలిగే తృప్తివల్ల ఎవరూ ఏమీ నష్టపోరుకదా ! అలాంటప్పుడు ఊహించుకోడానికి అడ్డ మేమున్నది ? కేవలం ఊహే కదా ! ఈ ఊహ మధు మనస్సుకు కొంత శాంతిని ప్రసాదించింది. తృప్తిగా అన్పించింది.

* * *

సుషమ, మాధవి కూర్చొని మాట్లాడుకుంటుండగానే "బైమైంది, బయలుదేరమ్మా," అంటూ శేఖర్ గదిలోకి వచ్చాడు. మాధవి హడావిడిగా లేచి నుంచుంది, ఊహల్లో మెదిలిన రాజకుమారుడు ఎదుట నిలిస్తే ఏం మాట్లాడాలో తెలీక మూగవోయిన రాజకుమారిలా.

మాధవిని అంత నెమ్మదిగా అంత అణకువగా, అంత భయభక్తుల్తో నుంచొని వుండగా చూడటం ఆదే మొదటిసారేమో ! శేఖర్కు నవ్వొచ్చింది. నవ్వుతూ సుషమవైపు తిరిగి "మీ ఫ్రెండ్ మధు కూడా వస్తుందేవిటి నీతో ?" అన్నాడు. బదులుగా మాధవి భుజాన చేతులువేసి, శేఖర్ వైపు చూస్తూ "ప్రస్తుతం నాతో అయితే రావడంలేదు గానీ ... నువ్వు తీసుకొస్తే వస్తానని మొన్న నాతో చెప్పింది," అంది సుషమ చిలిపిగా నవ్వుతూ.

కళ్ళెర్రజేసి సుషమవైపు చూసింది మాధవి. ఆ చూపులు చూసి సుషమకు, శేఖర్కు నవ్వాగలేదు. ఇద్దరూ పగలబడి నవ్వుతుంటే సిగ్గుపడి పారిపోబోయిన మాధవిని అప్రయత్నంగా చెయ్యిపట్టుకుని ఆపాడు శేఖర్ యిద్దరికళ్ళూ కలుసుకున్నాయి. అక్కడ సుషమ వున్న విషయమే మరచి ఒకరి మనోభావాలు మరొకరు కళ్ళలో చదువుకుంటూ నిలబడిపోయా రొక్క క్షణం. మరుక్షణం స్పృహలోకి వచ్చిన

శేఖర్ చిన్నగా "సారీ" అంటూ చెయ్యి వదిలేశాడు.

ఇంక అక్కడ ఓ నిముషం నిలబడ లేక పారిపోవాలని ముందుకు పరుగెట్టిన మాధవిని, శిరీష్ హాల్లో అటకాయించాడు. "ఏం మాధవీదేవి ? ఎక్కడి కలా ఆఘమేఘాలమీద పరుగెడుతున్నారు ? మేం వెళ్ళిపోతున్నామండీ యిప్పుడు. కనీసం బస్‌స్టాండ్‌వరకైనా రారూ ?" అన్నాడు. "క్షమించండి. శిరీష్‌బాబూ కొంచెం పనుంది, వెళ్ళాలి," అంటూ తమ యింటివైపు పారిపోయింది మాధవి సుషమ, శేఖర్ నవ్వుతూ హాల్లోకి వచ్చారు.

సుషమ, శిరీష్‌లను రైలెక్కించి యింటికి చేరిన శేఖర్‌కు మనస్సంతా బరువుగా అనిపించింది. సందడిగా, సరదాగా గడచిన ఆ పదిహేనురోజుల తృప్తి ఆవిరైపోయినట్లుగా నీరసంగా పడుకున్నాడు యింటికి రాగానే.

శ్యామలాదేవి కాఫీ తీసుకొచ్చి శేఖర్ కిస్తూ "ఏం శేఖర్! ఎటూ కాని వేళ పడుకున్నావేం ? తల నొప్పిగా వుందా ?" అని అడిగింది, వెల్లకిలా మంచంమీద పడుకొని పైకి చూస్తూ కణతలు నొక్కుకుంటున్న శేఖర్‌ను చూసి. అమ్మ మాట వినిపించగానే నవ్వుతూ లేచి కాఫీ అందుకుంటూ—

"అవునమ్మా ! కొద్దిగా తల నొప్పిగా వుంది. సుషమా వాళ్ళు వెళ్ళిపోతే యిల్లంతా ఏదో బావురుమంటున్నట్లుంది కదూ" అన్నాడు, తల్లి కళ్ళలోకి ఆప్యాయంగా చూస్తూ. చిన్నగా నవ్వుతూ శేఖర్ ప్రక్కన కూర్చొని "అవును శేఖర్ ! శిరీష్, సుషమ వుంటే పదిమంది పెట్టు. ఏమైనా యింటికో ఆడపిల్ల వుండితీరాలిరా ఆడపిల్ల లక్ష్మీదేవిలా నట్టింట తిరుగుతుంటేనే యింటికి కళ వస్తుంది తొందరలో నీ పెళ్ళి చేశామంటే ఆ కొరతా తీరుతుంది. ఆ రోజు తొందరలో రావాలనే నేనూ, మీ నాన్నగారూ ఎదురుచూస్తున్నాం," అంటున్న తల్లి మాటలకు ఆనకట్ట వేసే ఉద్దేశ్యంతో గబగబా కాఫీ పూర్తిచేసి, "అలా గంగాతీరానికి వెళ్లొస్తానమ్మా !" అంటూ లేచి వెళ్ళిపోయాడు శేఖర్ పెళ్ళి మాట రాగానే కొడుకు సిగ్గుపడి, పారిపోతున్నా డనుకొని నవ్వుకుంటూ, రఘుపతిరావుగారి గదివైపు వెళ్ళిపోయిందామె.

రోజులు సాఫీగా గడిచిపోతున్నాయి సుషమా, చంద్రాల మధ్య ఉత్తరాలు సాగుతున్నాయి. అప్పుడప్పుడు మాధవికీ, శాంతకు కూడా సుషమ నుంచి ఉత్తరాలొస్తున్నాయి

శిరీష్‌కు లెటర్స్ వ్రాయాలంటే మహాబద్ధకం. అందుకే చెల్లెలితో చెప్పేసేవాడు, "నువ్వు లెటర్స్ వ్రాస్తే నేను

అందర్నీ అడిగినట్లు వ్రాయి" అని. సుషమకు కోపం వచ్చేది.

"శేఖరన్నయ్యకు ఒక్క లెటర్‌కూ, రిప్లై వ్రాయవేం ? నీ మాట నే నసలు వ్రాయను. అమ్మకు, నాన్నగారికికూడా నిన్ను గురించి వ్రాయను" అని బెదిరించేది. శిరీష్ బద్ధకం తెల్సిన శేఖర్, యిద్దరికీ కలిపి లెటర్ వ్రాసేవాడు. అన్నింటికీ సుషమే జవాబులు వ్రాసేది. అన్నయ్యమీద కోపమొచ్చినా బ్రతిమిలాడేసరికి కరిగిపోయి, వెంటనే అందరికీ శిరీష్ తరపున కూడా తనే వ్రాసేది లెటర్స్. చంద్రం, సుషమల లెటర్స్‌లో ఒక్కో నవలమీద వాళ్ళ అభిప్రాయాలు, సాహిత్యపరంగా చేయాల్సిన చర్చలన్నీ సాగేవి. ఇంకేమో వ్రాయాలని మనసులో తపన కానీ తరతరాలుగా జీర్ణించుకుపోయిన సంస్కారం తాలూకు అడ్డుపొర. ఏమేమో ! ఎంతెంతో, వ్రాయాలనే ఆరాటం, ఆవేశం, సాహిత్య చర్చలద్వారా తీర్చుకుంటున్నారు. అందులోనే ఏదో తృప్తినీ, ఆనందాన్నీ పొందగల్గుతున్నారు. ఒకరి లెటర్స్ చూడగానే ఒకరి మదిలో కలిగే విచిత్రమైన స్పందన. ప్రతిరోజూ ఒకరి లెటర్స్‌కోసం ఒకరు ఎదురుచూడటంతో ఓ విధమైన తృప్తినీ, హాయినీ పొందగల్గుతున్నారు.

## 3

శేఖర్ పొలాలమీద శ్రద్ధతీసుకొని గోపాలంగారి సాయంతో ట్రాక్టర్ ఉపయోగించి, సమిష్టి వ్యవసాయంలో వుండే సుఖవు అందరికీ అర్థమయ్యేలా చెప్పి, చెక్కలు చెక్కలుగా, ముక్కలుగా వున్న భూమినంతా ఒక్కటిచేసి, సారవంతమైన ఎరువులు తెప్పించి, ఆ సంవత్సరం అందరిలోకీ శ్రేష్ఠమైన పంట పండించిన కీర్తిని సంపాదించాడు. ఆ సంవత్సరం వ్యవసాయ ఎగ్జిబిషన్‌కు పంపిన పంటల సారం, శేఖర్ కృషికి ఫలితాన్నీ గంగాపూర్ గ్రామానికో విశిష్టమైన స్థానాన్నీ సంపాదించి పెట్టాయి. ఆ సంవత్సరకాలంలో జరిగిన ప్రతి పండుగలో మాధవీ, శాంతా, చంద్రం, శేఖర్ కలిసి తిరగటంతో, ఊళ్ళో పంటలు వచ్చినప్పుడు జరుపుకొనే ఉత్సవాల్లో పాల్గొనటంతో వాళ్ళమధ్య చనువు, స్నేహం పెరిగాయి.

మునుపటిలా శాంత కూడా శేఖర్ దగ్గర సిగ్గుపడటంలేదు. అన్నయ్యతో మాట్లాడినంత స్వేచ్ఛగానూ, స్వచ్ఛంగానూ మాట్లాడగల్గుతోంది. అయితే వాళ్లు నలుగురూ కలిసినప్పుడు మాధవి ఒక్కతీ అయిపోయేది. వాదనకు వాళ్ళు ముగ్గురూ ఒక్కటయ్యేవాళ్లు. అప్పుడప్పుడూ ఆడపిల్ల కనుక అభిమానంతో మధును సపోర్ట్ చేసినా, అన్నయ్యలను ఆటపట్టించే మధుని తనూ ఆటపట్టించి సరదా తీర్చుకునేది శాంత. వాళ్ళు

కలిసినప్పుడల్లా శిరీష్, సుషమల కబుర్లు వచ్చేవి. ఓసారి కలకత్తా వెళ్ళి రావాలనుకుంటూనే ఎప్పటికప్పుడు పనుల ఒత్తిడివల్ల కుదరడంలేదు చంద్రానికి. ఈ సంవత్సరకాలంలో నాలుగుసార్లైనా వెళ్ళి వచ్చాడు శేఖర్. కలకత్తా వెళ్ళి వచ్చినప్పుడల్లా సుషమ పంపిందని రసగుల్లా టిన్నులు మాధవికీ, శాంతకూ యిచ్చేవాడు. చంద్రానికి మంచి పుస్తకాలు తెచ్చి యిచ్చేవాడు. సుషమ మర్చిపోయినా తను కొని, ముగ్గురికీ యిచ్చేవాడు శేఖర్.

ఎన్నో రకాలుగా పనుల ఒత్తిడిలో నలిగిపోతున్నా, ప్రశంసల తాకిడికి కరిగిపోతున్నా, శేఖర్‌లో ఏదో అసంతృప్తి చోటుచేసుకుంది. రోజు రోజుకూ అది పెరిగి పెద్దదవుతోంది. చంద్రం, మాధవీ చనువుగా మాట్లాడు కుంటుంటే ... మనసులో ఏదో బాధ మొదలవుతుంది. మళ్ళీ అంతలోనే తన సంకుచిత మనస్తత్వానికి పశ్చాత్తాపం కలుగుతుండేది. ఏది ఏమైనా తను ఒంటరివాణ్ణనే భావం రోజురోజుకూ పెరిగిపోతోంది. ఇంటిదగ్గర అమ్మ ఎంత ఆప్యాయంగా చూసినా, నాన్న గారెంత ఆపేక్షగా పలకరించినా ఏదో వెలితి, ఏదో తెలీని అసంతృప్తి, మనస్సులో చోటు చేసుకుంటోంది.

అలా మనసు మరీ బాధగా వున్న పుడు గంగాతీరానికి చేరి ప్రశాంతమైన ప్రవాహంలోకి చూస్తూ ఏవేవో అంతు తెలీని ఆలోచనలతో గడిపేసేవాడు. మనస్సును, శరీరాన్నీ ఏదో తెలీని నిర్లిప్తత ఆవేశించింది. ఆవేశంగా పొలం పనులు చేసేటప్పుడు అలసట తెలిసేదికాదు ఒంటరిగా గంగాతీరానికి చేరినప్పుడు ఆలోచనలు పిచ్చివాణ్ణి చేసేవి. ఇంతవరకూ తను గడిపిన రోజులన్నీ నిస్సారంగా సాగినట్లు ఒక అనూహ్యమైన అతి విచిత్రమైన, గొప్ప మార్పు యిప్పుడే జరిగినట్లూ అన్పిస్తుం దేది. అదేవిటో అతనికే అర్థమయ్యేది కాదు. అర్థంచేసుకునే అనుభవమూ లేదు.

ఈ సంవత్సరకాలంలో మాధవిని ఎన్నోసార్లు కలిశాడు, మాట్లాడాడు. కానీ ఏకాంతంగా కాదు. అందుకేనేమో ఆ అసంతృప్తి. అతనికి ప్రేమ గురించి అంతగా తెలీదు. అతను చూసిన సినిమాల్లోనూ, చదివిన నవలలోనూ తప్ప ప్రేమ స్వరూపం యిలా వుంటుం దని అనుభవపూర్వకమైన నిదర్శనం యిచ్చినవాళ్లు ఎవ్వరూ లేరు. శేఖర్ మాధవిని ప్రేమిస్తున్నాడా ? అంటే చెప్పడం కష్టం. ఓ పదహారేళ్ళ పడుచుగా తమ పల్లెలో ప్రత్యక్షమై మొట్టమొదటి చూపులోనే ఆకట్టుకున్న ఆ అందమైన కదలికలోని ఆకర్షణ నను, ఆ అనుభవాన్ని అమితంగా

ఇప్పుడు మీరు అతని పళ్లను
పిప్పిపళ్లు కాకుండా చెయ్యవచ్చును.

## వాడండి సిగ్నల్ 2

పళ్లను గట్టిపరచి దంత క్షయాన్ని నివారించేందుకు
దీనిలో అత్యంత ప్రభావంగల ఫ్లోరైడ్ ఫార్ములా ఉంది.






# సిగ్నల్ 2 ఫ్లోరైడ్‌తో

కుటుంబంలో వారికి పిప్పి
పళ్లు రాకుండా నిరోధిస్తుంది

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

లింటాస్ SG2 I 172 TL

ప్రేమిస్తున్నాడు. ప్రతి కలయిక ఒక వినూత్నమైన ఆనందాన్ని కల్గిస్తోంది శేఖర్‌కు.

మెత్తటి యిసుకలో వెల్లకిలా పడు కొని తలక్రింద చేతు లుంచుకొని కళ్ళు మూసుకొని చిన్మయానందమూర్తిలా చిన్నగా నవ్వుతూ మాధవి ఆలోచన లలో మునిగి వున్న శేఖర్ ముఖాన పడిన చల్లటి చిరుజల్లుకు వులిక్కిపడి కళ్ళు విప్పాడు. ఎదురుగా నవ్వుతూ నుంచొని వుంది మాధవి వెంట శాంత లేదు. చేతిలో ఖాళీ బిందె. శేఖర్‌ను చూసి చిన్నగా నవ్వుతూ "భయ పడ్డారా ?" అంటూ బిందె ప్రక్కన పడేసి కొద్దిదూరంలో కూర్చుంది.

ఆనందమో, అయోమయమో తెలీని అవస్థలో వున్న శేఖర్ గాభరాగా, భయం, భయంగా చుట్టూ చూశాడు. చుట్టుప్రక్కల నరసంచారం లేదు. ఎదురుగా, నిండుగా ప్రవహించే గంగానది. పశ్చిమానికి కృంగిపోతూ, ఎర్రగా మెరిసిపోతున్న సూర్యుడు తప్ప మరెవ్వరూ లేరు. సృష్టి చైతన్య రహస్య స్వరూపంలా ఎదురుగా మాధవి. ఆ సమయంలో మధు ప్రత్యక్ష మైన దేవతలా మెరిసిపోతోంది. శేఖర్‌లో ఎన్నడూ లేని అధైర్యం తొంగిచూసింది. నోరు విప్పి మాట్లా డటం కష్టమైపోతోంది. మనిషి భావా వేశంలో నిండా మునిగిపోయినప్పుడు మాటలకంటే మూగతనమే ఎక్కువ సహకరిస్తుంది. అంతేకాదు చూడగల్గిన వాళ్ళకు మనసులో మె లే మూగభావాలు ఎక్స్‌రే తీసినట్లే, కళ్ళలో ప్రతి ఫలి స్తాయి. ఆవేశంగా, ఆర్ద్రంగా, అర్థింపుగా ఏదో తెలీని వింత ఆనం దంతో మెరిస్తున్న శేఖర్ కళ్లు చూడ గానే విచిత్రమైన పులకింత కల్గింది మాధవిలో. శేఖర్ కళ్ళతో కలిసిన చూపులు విడిపోయే భావనకే భయపడి అలాగే నిలచిపోయాయి. మాటలు కరువైన మనుషుల్లా ఒకరి కళ్ళలో ఒకరి కళ్లు కలిపిన వాళ్ళిద్దరిలో అలజ డేదో ఆరంభమైంది.

అప్పటివరకూ నవ్వుతూ ఉన్న మాధవి చిరుగాలి తాకిడి తట్టుకోలేని చిగురుటాకులా వణికిపోయింది. ఇంక అక్కడ కూర్చోలేక దిగ్గున లేచి బిందె తీసుకొని "వస్తాను" అంటూ ముందుకు అడుగువేసింది మధు. "మధూ !" అంటూ శేఖర్ చేయి పట్టుకోగానే వెను దిరిగి శేఖర్‌వైపు చూసింది. సృష్టిలోని ఆత్మీయతంతా యిముడ్చుకున్న ఆ చూపులకు అందులోని ఆర్ద్రతకు గాలి తగిలిన మంచులా క్రమక్రమంగా కరిగిపోతున్న మనస్సును ధృడపరచు కొనే ప్రయత్నం చేస్తున్నా ... మనసు తన కంట్రోల్‌లో ఉన్నట్లే ఉన్నా... శరీరం తనకు తెలీకుండానే తూలి క్రిందకు జారింది. శేఖర్ అతి

జాగ్రత్తగా ఆపేక్షగా మధును దగ్గిరకు తీసుకొని ఆపుకోలేని ఆవేశంతో ఆర్తిగా మధుని హృదయానికి హత్తుకున్నాడు.

మధుకు తెలీకుండానే కళ్ళు వర్షిస్తున్నాయి. మాధవి చెవిలో మెల్లగా మృదువుగా విన్పిస్తున్న మాటలు మనసున పాకి రక్తంలో కలిసిపోతున్న అనుభూతి కలిగింది. "మధూ ! నువ్వు నాకు కావాలి మధూ ! నువ్వు తోడు లేని బ్రతుకు భారంగా, శూన్యంగా తోస్తోంది. నీ మనస్సేమిటో, తెలీక యిన్నాళ్ళూ నా మనసు బయటపెట్ట లేకపోయాను. ఈ రోజు యీ శుభ ఘడియలో, నీ మనసంతా విప్పి చెప్పిన నీ కళ్ళకు నేను సదా కృతజ్ఞుడిని మధూ ! మనం పెళ్ళిచేసుకుందాం. ఈ వేసవికే నిన్ను నా అర్ధాంగిగా చేసుకుంటాను. ప్రేమపక్షుల్లా గంగాతీరాన హాయిగా, స్వేచ్ఛగా విహరిద్దాం. ఈ ప్రశాంత గంగాతీరాన, నీ సువిశాలమైన కళ్ళలోని సుకుమారమైన భావాలకు పులకిస్తూ కాలం గడిపేయాలన్నదే నా కోరిక. అందుకు నీ అంగీకారంకోసమే యిన్నాళ్ళూ చూశాను. అది దొరికిపోయిందీవేళ. యింక నాకు ఏ అనుమానాలూ లేవు. ఆలోచనలూ లేవు," అంటూన్న శేఖర్ కౌగిలినుంచి నెమ్మదిగా తప్పుకుంది. నెమ్మదిగా కళ్ళు వాల్చుకొని సన్నని చిరునవ్వుతో, సిగ్గుతో ఎరుపెక్కిన బుగ్గలను రెండు చేతులతో దాచుకొని "మావయ్యతో మాట్లాడండి" అంటూ లేచి బిందె అందుకొని ఒక్కపరుగులో నదివైపు వెళ్ళి, నీళ్ళు తీసుకొని పల్లెవైపు నెమ్మదిగా సాగిపోతున్న ఆ సజీవ శిల్ప సౌందర్యాన్ని. కన్నుల్లో నింపుకొని మధు కనుమరుగై పోయేంతవరకూ నవ్వుతూ చూస్తూండిపోయాడు శేఖర్.

ఆనందం నిండిన మనస్సు మహా తేలిగ్గా అన్పిస్తోంది. లేచి గంతులేయాలన్పిస్తోంది. ఇన్నాళ్ళూ అనుభవించిన మానసిక సంఘర్షణ అంత త్వరగా, అంత తేలిగ్గా తేలిపోయిందన్న తృప్తితో మనసు పరవశ్ళు త్రొక్కుతోంది. ఆ పిచ్చి ఆనందంలో, మామిడికొమ్మలో దాగిన కోయిల కూత విని, మళ్ళీ దాన్ని అనుకరిస్తూ కుహూ ... అని కుస్తూ, యిసుకనుంచి లేచి, స్వేచ్ఛగా... అప్పుడే రెక్కలు వచ్చిన విహంగంలా పొలం గట్లవెంబడి, యీలవేసుకుంటూ, పచ్చగా, ఏపుగా పెరిగిన వరిచేలను మృదువుగా స్పృజిస్తూ, ఆ స్పర్శలోని చల్లదనాన్ని మనసున నింపుకుంటూ తీయటి కలల్లో తేలిపోతూ, హాయిగా నడిచిపోతున్న శేఖర్‌కు హడావిడిగా పరుగెత్తు కొస్తున్న రామయ్య కన్పించాడు. (సశేషం)

Printed and Published by A. Chandra Sekar Rao at 5-9-88, Public Garden Road Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Public Garden Road, Hyderabad-500 001. Editor : A. SUDHAKARA RAO

# బ్రిటానియా పాల బిస్కట్



## పెరిగే పాపాయిలకు రుచివంతమైన తోడు!




రుచికరమైన,
పుష్టికరమైన
బ్రిటానియా
గ్లాక్సో బిస్కట్లు

ఎంటాప్ - BBC.GLX.36-172 TE




బ్రిటానియా బిస్కట్లు అత్యుత్తమమైనవి




## బహుమతి : రూ. 116

ఈ క్విజ్‌లో మొదటి అయిదింటికి నాలుగేసి సమాధానాలు ఇచ్చాము. అందులో సరైన సమాధానాన్ని మీరు ఎంచుకొని క్విజ్‌ను పూర్తిచేయాలి. మిగతా అయిదింటికి పాఠకులే సమాధానాలు 6 నుంచి 10 వరకూ ఇచ్చిన "డాష్" లలో వ్రాయాలి.

## 'క్విజ్' లో పాల్గొనేవారు పాటించవలసిన నిబంధనలు

1. సమాధానాలు 'యువ' కూపన్‌మీద మాత్రమే వ్రాసి పంపాలి. కవరుమీద 'క్విజ్' అని స్పష్టంగా వ్రాయాలి. అందులో క్విజ్ కూపన్ తప్ప మరేమీ ఉండరాదు. కూపన్‌లో ఎటువంటి దిద్దుళ్ళు ఉండరాదు. కూపన్లను పోస్టులోనే పంపాలి. ఆఫీసుకు వచ్చి ఇచ్చేవాటిని స్వీకరింపబడవు.
2. ఒకరికంటె ఎక్కువమంది ఆల్‌కరెక్టు సమాధానాల్ని పంపితే, వారికి బహుమతి సొమ్మును పంచడం జరుగుతుంది. సంఖ్య మరీ ఎక్కువైతే లాటరీ పద్ధతిని అమలుపరుస్తాం.
3. సమాధానాలు సీలువేసిన కీ సొల్యూషన్‌తో సరిపోవాలి.
4. దీనికి సంబంధించిన విషయాలలో 'యువ' సంపాదకునిదే తుదినిర్ణయం క్విజ్ సమాధానాలను నవంబరు సంచికలో ప్రకటిస్తాము. ఎట్లాంటి ఉత్తరప్రత్యుత్తరాలకు అవకాశం లేదు.
5. మాకు కూపన్లు చేరవలసిన ఆఖరు తేదీ సెప్టెంబరు 28. ఆ పైన వచ్చిన వాటిని పరిశీలించడం జరగదు.

## అక్టోబరు నెల క్విజ్

1. భారతదేశం ఐక్యరాజ్యసమితి (UNO) లో కింది సంవత్సరంలో సభ్యత్వాన్ని పొందింది.

   ఎ) 1946 బి) 1945 సి) 1948 డి) 1949
2. గయానా (Guyana) రాజధాని.

   ఎ) జార్జిటవున్ బి) కింగ్‌స్టన్ సి) వెల్లింగ్టన్ డి) అమ్మాన్

